

# ప్రేమచంద్ జీవిత

శ్రీమతి శివరాణీదే

# ప్రేమచంద్ జీవితం

రచన:

ప్రేమచంద్ శివరాణీదేవి

అనువాదం:

సీతాదేవి

విశాలాంధ్ర ప్రచురణాలయం
: : విజయవాడ : :



శ్రీమతి శివరాణీదేవి



ప్రేమచంద్ స్వగృహం

## బాల్యము

ప్రేమచంద్ కాశీకి నాలుగుమైళ్ల దూరంలోవున్న 'లమహీ' అనే గ్రామంలో, శనివారం, జులై, 1880లో జన్మించారు. తండ్రి పేరు అజాయబ్ రాయ్, తల్లిపేరు ఆనందీదేవి. వీరు కాయస్థజాతికి చెందిన శ్రీవాస్తవ తెగవారు. ఆయనకు ముగ్గురు తోబుట్టువులు. కాని వారిలో ఇద్దరు స్వర్గస్థులైనారు. ఒక్కామె మాత్రం చాల కాలం వరకు జీవించి యుండెను. ఆయన తల్లి ఆరోగ్యం మంచిది కాదు. ప్రేమచందుకు ఇంకా రెండు పేర్లుకూడ వున్నాయి. తండ్రి 'ధనపత్ రాయ్' అనీ, పెదనాన్న 'నవాబ్ రాయ్' అనీ పెట్టారు. తల్లిదండ్రులిద్దరికీ అజీర్ణవ్యాధి వుండేది. రెండు మూడు సంవత్సరాల వయస్సులో చాందాబిల్లా వెళ్ళవలసి వచ్చింది. మొదట మౌలవీ దగ్గర ఉర్దూ నభ్యసించారు. రోజూ తమ సహాధ్యాయులతో కలసి మౌలవీ ఇంటికి వెళ్ళి ఉర్దూ నేర్చుకొనేవారు. శారీరకంగా చాలా బలహీనంగా వున్నా, చదువులో చాలా చురుగ్గా వుండేవారు. చిన్నతనంనుండి వినోదప్రియులే.

ఒకసారి పిల్లలంతా చేరి మంగలి ఆట ఆడుకుంటున్నారు. ప్రేమచంద్ కూడ ఒక పిల్లవాడికి క్షవరం చేస్తున్నాడు. అప్పుడు ఆయనకు ఓ తమాషా ఆలోచన తట్టింది. చేస్తూచేస్తూ కత్తిలాగ వుపయోగిస్తున్న వెదురుబద్దతో ఆ పిల్లవాడి చెవికోశారు. ఆ కుర్రాడి తల్లి రుసరుసలాడుతూ ప్రేమచందు తల్లిదగ్గర కొచ్చింది, ఆమె గొంతువినగానే ప్రేమచందు తలుపుచాటున నక్కారు. ఆయన తల్లి చూసి నాలుగు తగిలించింది.

"వాళ్ళబ్బాయి చెవ్వెందుకు కోశావుర్రా?" అంది తల్లి.

"చెవ్వు కొయ్యలేదు, క్షవరం చేశాను."

"వాడి చెవ్వునుండి రక్తం కారుతుంటే క్షవరం చేశానంటావేంరా!"

"అందరూ అలాగే ఆడుకుంటున్నారు."

"ఇంకెప్పుడూ అలాంటి ఆటలాడకు."

"ఇం కెప్పుడూ ఆడను."

ఇంకొక సంఘటన – ఒకరోజు ఆయన పెదతండ్రి నార అమ్మిన డబ్బు గూట్లో పెట్టాడు. ప్రేమచందూ, అతని పెదతండ్రి కొడుకూ కలిసి అందులోది ఒక రూపాయి తీశారు. ఆయనకు ఆ రూపాయి ఎలా ఖర్చుచేయాలో తోచలేదు. ఆయన పెదతండ్రి కొడుకు అందులో ముప్పావలా 'మౌలవీ'కి ఇచ్చి మిగతా నాలు గణాలకు జామపళ్ళూ, నూజీలూ కొన్నాడు. ఇద్దరూ తిన్నారు.

ఇంతలో ఆయన పెదతండ్రి వాళ్ళను వెతుక్కుంటూవచ్చి 'రూపాయి దొంగిలించారా?' అని అడిగాడు.

"అవును! తమ్ముడు ఒక రూపాయి తెచ్చాడు"అన్నాడు ఆయన కొడుకు.

"ఆ రూపాయెక్కడ?" గర్జించాడు పెదనాన్న.

"మౌలవీకి ఫీజు ఇచ్చాము."

ఆయన వాళ్ళిద్దర్నీ మౌలవీ దగ్గరకు తీసుకెళ్ళి అడిగాడు— "వీళ్ళు మీకు డబ్బిచ్చారా?" అని.

"అవును పన్నెండణాలు ఇచ్చారు" అన్నాడు మౌలవీ.

"అవి ఇలా ఇవ్వండి!" అని తీసుకున్నాడు.

"మిగతా నాలుగణాలు ఎక్కడ?" ప్రేమచందును అడిగాడు.

"జామపళ్లు కొన్నాము."

ఒకరోజు ఆయన తన బాల్యజీవితాన్ని గురించి చెబుతూ ఈ సంఘటననుకూడ వినిపించాక— "పెదనాన్న తన కొడుకును కొడుతూ ఇంటికి తీసుకెళ్ళాడు. అప్పటి నా ముఖాన్ని చూడాల్సిందే! భయపడుతూ చిన్నగా ఇంటికి చేరాను. అన్నయ్యను వాళ్ళ నాన్న కొట్టటంచూసి అమ్మ నన్నుకూడ కొట్టసాగింది. పెద్దమ్మ

అడ్డంవచ్చి నన్ను కొట్టకుండా రక్షించింది. తన కొడుక్కు అడ్డం వెళ్ళకుండా నన్నే ఎందుకు దెబ్బలనుండి రక్షించిందో తెలియదు. బహుశా నా బక్క శరీరంమీద ఆమెకు జాలికలిగి వుండవచ్చును."

"మావూరి మాదిగవాడుకుట్టిన చెప్పులే చాలారోజులు తొడుక్కున్నాను. మానాన్న జీవించి వున్నంతవరకూ, పన్నెం డణాల చెప్పులు, నిజం నాలుగణాలగుడ్డతప్ప కొనేవారుకాదు. ఉమ్మడి కుటుంబంలో పెరగటంవల్ల నేను తల్లిదండ్రులకు ఒక్కడినే కొడుకుననే భావం కలిగేదేకాదు. మా పెదనాన్న కొడుకులతో చేర్చి మొత్తం మేము అన్నదమ్ములం ఐదుగురము. ఎవరైనా అడి గినా ఐదుగురం అన్నదమ్ములమనే చెప్పేవాడిని".

"నా ఎనిమిదవ సంవత్సరంలో మా అమ్మ జబ్బుపడ్డది. ఆరు మాసాలు జబ్బులోనే వుంది. నేను విసనకర్రతో విసురుతూ ఆమె తలదగ్గరే కూర్చునేవాడిని. నాకంటే పెద్దవాడు కాబట్టి మా పెద నాన్న కొడుకు మందులూ, మాకులూ చూస్తుండేవాడు. మా అక్కయ్య అత్తవారింట్లో వుంది. మా అమ్మ తలదగ్గర పంచదార సీసా పెట్టివుండేది. ఆమె నిద్రపోగానే పంచదార తినేవాడిని. మా అమ్మ ఏడెనిమిది రోజులకు చనిపోతుందనగా, మా అక్కయ్యా, నాయనమ్మా వచ్చారు. మా అమ్మ చనిపోతున్నప్పుడు నాన్న చేతుల్లో అక్కయ్యనూ, అన్నయ్యనూ, నన్నూ అప్పగిస్తూ అంది—"ఈ ముగ్గురూ నీ బిడ్డలే" అని.

"అక్కయ్యా, అన్నయ్యా, నాన్నా ఏడుస్తున్నారు. కాని నాకు ఏమీ తెలియదు. కొద్దిరోజుల తరువాత అక్కయ్య అత్తవా రింటికి వెళ్ళింది. రెండుమూడు నెలల తరువాత జబ్బుచేయుటవల్ల నాయనమ్మకూడ 'లహామీ' వెళ్ళిపోయింది. ఇంట్లో నాన్న, అన్నయ్యా, నేనూ మాత్రం మిగిలిపోయాం. అన్నయ్య నన్ను ఎంతో ప్రేమగా చూసేవాడు. కాని, మాతృప్రేమలోని ఆ స్నిగ్ధత ఎక్కడ లభిస్తుంది? అమ్మను తల్చుకొని ఏడ్చేవాడిని."

"ఐదారు నెల్ల తరువాత నాన్నకుకూడ జబ్బుచేసింది. నాన్నా, నేనూ 'లహామీ' వచ్చాము. మౌలవీ దగ్గర చదువుకోవటం, బిళ్లంగోడు ఆడటం, బెల్లపు చెరుకులు నమలటం, బఠానీకాయలు కోసుకురావటం - ఇవీ ఆ రోజుల్లో నేను చేసిన పనులు."

"నాన్న అక్కయ్య ఇంటికెళ్ళితే నన్నుకూడ తీసుకెళ్ళేవాడు. నాయనమ్మ బలేబలే కథలు చెప్పేది. అన్నయ్యా, నేనూ, నాయనమ్మను నా వైపు తిరగమంటే, నా వైపుకు తిరగమని పోట్లాడుకొనే వాళ్లం. నాయనమ్మకు నేనంటేనే ఎక్కువ ప్రేమ."

"మా నాన్నకు జమీన్‌పూర్‌కు బదిలీ అయింది. నన్నూ, నాయనమ్మనూ తీసుకెళ్ళాడు. అన్నయ్య ఇండోర్‌లోనే వుండి పోయాడు.

"కొన్ని రోజులకు మా ఇంటికి పిన్ని (సవతితల్లి) వచ్చింది. ఈ వివాహం నాయనమ్మకు ఎంతమాత్రం ఇష్టంలేదు. పిన్నితో ఆమె సోదరుడు 'విజయ బహదూర్' కూడ వచ్చాడు. పిన్ని ఇంటికి యజమానురాలయింది. పిన్ని తన తమ్ముడిని ఎంత ఆదరించేదో నన్ను అంత హీనంగా చూసేది. నాన్న సాయంకాలం ఇంటి కొచ్చేప్పుడు ఏమైన చిరుతిండి తెస్తే పిన్ని దాన్నంతా నాన్నముందే పెట్టి తినమనేది. 'నా కోసంకాదు; పిల్లలకోసం తెచ్చాను' అనేవాడు. కాని పిన్ని వినిపించుకొనేదికాదు. నాన్న కోపంతో లేచి బయటకెళ్లిపోయేవాడు."

"ఎలాగో ఒక సంవత్సరం గడిచిపోయింది. అక్కయ్య అత్తవారింట్లోనే వుంది. నాయనమ్మ చనిపోయింది."

"మేము అద్దెకువున్న ఇల్లు చాలా ఇరుగ్గానూ, మురిగ్గానూ వుండేది. అద్దె రూపాయన్నర. వాకిలికి పక్కనేవున్న గదిలో నేను పడుకొనేవాడిని. తోచనప్పుడు పక్క నేవున్న పొగాకుకొట్టువా డింటికి వెళ్ళేవాడిని. అప్పుడు నాకు పన్నెండేళ్ళు.

గోరఖ్‌పూర్ : కజాకీ

"నాన్నకు గోరఖ్‌పూర్ బదిలీ అయింది. ఇక్కడకూడ అలాంటిదే ఒక ఇల్లు దొరికింది. నాకు వాకిలి పక్కనే గదికూడ దొరికింది. ఈవూరు వచ్చేప్పటికి నావయస్సు పదమూడు సంవత్సరాలు. మిషన్‌స్కూల్లో ఆరోక్లాసులో చేరాను. పిన్నిదగ్గరే వున్నాను."

గాలిపటాలు ఎగరేయటం నాకు చాలా ఇష్టం. డబ్బులుండేవి కాదు. నేనూ, విజయబహాదూర్ పక్కనేవున్న మైదానంలోకి వెళ్లి పెద్ద పెద్ద గాలిపటాలను చూస్తుండేవాళ్ళం. ఎక్కడైనా గాలిపటం తెగిందా, మాపంట పండించన్నమాటే! తెగిన గాలిపటాలనూ, దారాలను సంపాయించి మా కోర్కె తీర్చుకొనేవాళ్ళం."

"రాత్రిళ్ళుమాత్రమే మేము ఇంట్లో వుండేవాళ్ళం. విజయ బహాదూర్ నాకంటే చిన్నవాడు. ఇక్కడకూడ నాకు ఒక పొగాకు కొట్టువాడితో పరిచయం ఏర్పడ్డది. ఏ కొంచెం సమయం దొరికినా అక్కడికెళ్ళి కూర్చొనేవాడిని. ఇంట్లో నాకు ఎలాంటి ఆకర్షణా, ఆదరణా లేదు. అక్కడే నాకు రాయాలనే కోర్కెకూడ కలిగింది. రాసి రాసి చింపేస్తుండే వాడిని! అప్పుడప్పుడు మానాన్న నా గదిలోకి వచ్చేవాడు. నా రచనేదైనా కన్పిస్తే 'ఏం మహాశయా, రాస్తున్నారా!" అనేవాడు. నాకు చచ్చే సిగ్గేసేది. కాని యీ విషయంలో నాకు ఆయన్నుండి ఎలాంటి ప్రోత్సాహమూ దొరకలేదు. దానికార్కణాలు —— ఒకటి, ఆయనకు తన జీవిత సమస్యలనుండే తీరిక లేకపోవటం, రెండు, ఆయనకు ఈ విషయంలో ప్రవేశం లేక పోవటమూను. నేను రాత్రిళ్ళు ఎక్కడ వుండేవాడినోకూడ పట్టించుకొనేవాడు కాదు. బహుశా ఆ రోజుల్లో వారికి, అది తమ కర్తవ్యంగా కన్పించేది కాదేమో!"

"మా ఇంటికి దగ్గర్లో రామలీలలు (వీధినాటకం) వేస్తుండే వారు. అందులోని రాముడూ, భీముడూ, సీత అంటే నా కెంతో

ఇష్టం. ఆ రోజుల్లో నా దగ్గర ఏ ఒక్క మంచి వస్తువున్నా అది తీసుకొని రాముడి కోసం పరుగెత్తేవాడిని. డబ్బులున్నా అతనికే ఇచ్చేవాడిని. రాముడు మాట్లాడాడా, ఇక నా ఆనందానికి అంతేలేదు. ఈ రోజుల్లోని పిల్లల్ని చూస్తుంటే, అప్పుడు నే నెంత మొద్దబ్బాయినో బోధపడేది."

"డబ్బుకు ఎప్పుడూ ఇబ్బందిగానే వుండేది. చదువుఫీజు నెలకు పన్నెండణాలు ఇచ్చేవాడు. అందులో ఒకటీ రెండణాలు ప్రతినెలా తినేసే వాడిని. నేనువుండే పేటలో పాటకజనం ఎక్కువ; వాళ్లొక నాలుగైదు కాన్లు కొట్టేసేవాడు. ఫీజు ఇచ్చే సమయానికి చిక్కుపడేవాడిని. ఇంట్లో అమ్మలేదు. సవతితల్లివుంది. అమ్మను తల్చుకొని ఏడ్చేవాడిని. అబద్ధం ఆడటం కూడ ఒక కళే. అది అందరికీ రాదు. నిజంచెప్పి దెబ్బలు తినేవాడిని. మేమున్న ఇల్లు ఒకగొల్లావిడది. ఆమె వితంతువు. మా పిన్నీ, ఆమె, ఏవేవో తమాషా విషయాలన్నీ మాట్లాడుకొనేవారు. నాకు వాళ్ళమాటలు వినటం చాలా సరదాగా వుండేది. చాలా రోజులకుకాని, వాళ్ళ సంభాషణలు పిల్లల జీవితాలకు ఎంత హానికరమో బోధపడిందికాదు."

'నాన్నకు 'జమనియ'కుబదిలీ అయింది. అప్పుళ్లోవున్న పోస్టుమాన్ నన్నుచాలా ప్రేమించేవాడు. నన్నుభుజాలమీద ఎక్కించుకుని పరుగెత్తేవాడు. అతను నాకోరకుజామపళ్లూ, మొక్కజొన్న కండెలూ, బెల్లపుచెరుకులూ తెచ్చేవాడు. అందుకే నా కతనంటే అంత ఇష్టం. ఒకరోజు అతను ఎంతసేపటికీ రాకపోవటంవల్ల, కజాకీ ఎందుకు రాలేదని పిన్ని నడిగాను."

'ఏమో నాకేం తెలుసు?' అంది పిన్ని.

"సరి ఏంచేస్తాను. నోరుమూసు కూర్చున్నాను. కాని నా హృదయాన్ని ఎవరో బల్లెంతో పొడిచినట్లు బాధపడ్డాను. నాన్నరాగానే భయపడుతూనే అడిగాను. అందుకు జవాబు—'వెధవను తీసిపారేశాను' అని నాన్న చెప్పాడు."

"భయపడుతూనే అన్నాను— చాలామంచివాడు అని."

'గాడిద!' నాన్నపళ్ళు కొరికాడు.

"రాత్రంతా నాకు నిద్రపట్టలేదు. అతని మంచితనాన్ని గురించే ఆలోచించాను. నేను పెద్దవాడినయింతరువాత ఇలాంటి వాడిని ఎప్పుడూ నా దగ్గరే వుంచుకోవాలనుకున్నాను. ఉదయం నిద్రమంచం దిగుతూనే వాళ్ళింటికి వెళ్ళి అతన్ని పిల్చుకొచ్చాను. అప్పుడు నేను ఎనిమిదవక్లాసు చదువుతున్నాను. పిన్నికూడ అతనికి సిఫారస్ చేసింది."

పెద్ద బాబుగారు

ఒకరోజు నాన్న స్నేహితుడు పెద్దబాబుగారు నన్ను తమ ఇంటికి పిల్చారు. ఆయన నా వీపుమీద గోముగా నిమురుతూ అడిగారు — 'ఏం, నాయనా! చిక్కిపోయావు? మీ అమ్మ నీకు పాలూ, పెరుగూ బాగా పెట్టటం లేదా? బాగా పాలు తాగాలి!'

"నాకు ఒక్కసారిగా దుఃఖం పొర్లుకొచ్చింది. నన్ను దగ్గరకు తీసుకొని ఆయన ఓదార్చారు. రెండోరోజు పిన్ని నాపప్పులో ఇంత పేర్నెయ్యి గుమ్మరించింది."

"పప్పులో ఇంత పేర్నెయ్యి ఎందుకు గుమ్మరించావు?"

"కరగపెట్టే వేశాను."

"అసలు పప్పులో ఇంత నెయ్యెందుకు పోశావు?"

"ఎందుకా? ఇంటింటికెళ్ళి చెప్పుకొని ఏడవటానికి?"

"నే నెవర్తో చెప్పాను?"

"నువ్వు చెప్పకుండానే అందరూ వచ్చి అడుగుతున్నారేం?"

"పెడితే తినవు, పైగా నన్నల్లరిపాలు చేస్తావు."

"నే నెవరితో ఏమీ చెప్పలేదు."

"శుంఠా! అన్నీ అబద్ధాలే!"

"నాకు ఏడుపొచ్చేసింది."

నేను : మీకు ఇష్టం లేకపోతే తినటం మానేయాలిగాని వడవటం దేనికి ?

ఆయన : "ఇప్పుడు నువ్వు నా కెలా అన్నంపెడుతున్నావు ? స్త్రీలో కేవలం స్త్రీత్వమేకాదు, మాతృత్వం కూడా వుండాలి. అవి లేనప్పుడు ప్రేమ, పోషణ అన్నీ అసంభవాలే. నాకు పెర్నెయ్యిలో పంచదార వేసుకొనితినటం ఇష్టం, కాని పప్పులో ఇష్టం వుండదు."

నేను : అయితే ఇప్పుడెలా తింటున్నారు ?

ఆయన : "నీవు నాకు తినిపించినట్లు తినిపించటానికి ఎవరికి పట్టింది? అందువల్లనే తినలేక పోయేవాడినేమో.- అసలు ఆ రోజుల్లో పిల్లలకూ పెద్దలకూ కూడ పాలవసరమే కన్పించేదికాదు."

నేను : "అవసరం లేకపోవట మేమిటి ? మా ఇంట్లో పిల్లలందరం పాలు తాగేవాళ్ళం."

ఆయన : "మీరు జమీందారు బిడ్డలు. మేము పేద వాళ్ళం."

నేను : "అయితే మీ ఇష్టమొచ్చినట్లే తినండి బాబూ, నాదేం పోయింది."

ఐ దు రూ పా య ల బె ల్లం

"ఒక సంవత్సరం తరువాత నేను కాశీ వెళ్లాను. అప్పుడునేను తొమ్మిదో క్లాసు చదువుతున్నాను. వయస్సు పదిహేనేళ్ళు. నాన్న అడిగారు - ధనపత్, నీకు నెల కెంత కావాలి? ఐదు రూపాయలు చాలన్నాను. ఇంత చౌకగా బేరం తేలిపోయి నందుకు నాన్న సంతోషించారు."

"కాశీకివెళ్లి తీరాచూస్తే రెండురూపాయలు ఫీజుకే పోతాయని తెలిసింది. పాలకు ఒకరూపాయి పోతుంది. మిగతా రెండు రూపాయల్లో అన్ని అవసరాలూ గడవాలి. పగలంతా వూళ్లో తిరిగి రాత్రిళ్ళు ఏ లాంతరుస్తంభందగ్గరో చదవుకుంటూ కూర్చొని చదివేవాడిని. ఉదయం పిన్నిదగ్గరకెళ్ళి బెల్లం తెచ్చుకొనేవాడిని.

ఇంటినుండి ఇంతకంటే ఎక్కువసహాయం పొందే ఆశలేదు. మా కుటుంబ పరిస్థితులే అందుకు కారణం".

"పరీక్షలు దగ్గరకొస్తున్నాయి. నాన్న బెల్లంకొని జాగ్రత్తగా వుంచమని ఐదుసూపాయలు పంపించారు. ఆ బెల్లం నా వివాహం కొరకు కొనబడింది. మేము— అంటే, నేనూ మా పెదనాన్న కొడుకూ, ఇంకా కొందరు స్నేహితులం కలసి బెల్లంతినటం ప్రారంభించాము. రోజుకు శేరూ, శేరున్నరబెల్లం ఎగిరిపోయేది. బెల్లం తగ్గిపోతుందే ఇకనుండి తినకూడదనుకొనేవాడిని. కాని బెల్లం తిన టానికి అలవాటుపడ్డ నేను ప్రతిజ్ఞను నిలుపుకోలేకపోయేవాడిని. చివరకు ఒకరోజు బెల్లంపెట్టెకు తాళంవేసి, తాళంచెవి డ్రాయర్లో పడేశాను. ఇకనుండి బెల్లం ముట్టుకోనని ఒట్టు వేసుకున్నాను. 'వెదుళ్ళే లేకపోతే వేణువు మోగటమనే సమస్యేలేదు'. కాని నా ప్రతిజ్ఞను ఎంతోసేపు నిలబెట్టుకోలేకపోయాను. ఇంతలోనే మిత్ర మండలి రావటం, డ్రాయరునుండి తాళంచెవి తీయటం, బెల్లం తరిగిపోవటం, అన్నీ కొద్ది నిముషాల్లోనే జరిగిపోయాయి."

"బెల్లం సగం అయిపోయింది. పెట్టెకు తాళంవేసి తాళం చెవ్వి బావిలో పడేశాను. నాన్న వచ్చి బెల్లం అడిగితే తాళం పగలకొట్టాల్సివచ్చింది. బెల్లం చూసి పిన్ని గొణిగింది. నా వివాహం జరిగిపోయింది. ఆ సమయంలో నేను చాలా వుషారుగా వున్నాను. వివాహ మండపం కట్టటానికి బొంగులు నేనే చీల్చి ఇచ్చాను."

వి వా హ ము

"నా వివాహము రామాపురం అనే గ్రామంలో నిశ్చయ మయింది. వాళ్ళూ, వాళ్ళింట్లో మహారాజులే. వారి వారి ఆచార వ్యవహారాలూ, సాంప్రదాయాలూ భిన్నంగా వుంటాయి. నేను వాళ్ళింట్లో ప్రవేశించేప్పటికి ఇంటినిండా స్త్రీలున్నారు. సరససల్లాపాలు చాలా జోరుగా వున్నాయి. నేను ఒంటరిగాడినయినా ఎలాగో నెగ్గగలిగాను. అప్పగింతలయ్యాయి. మేము వంటె బండిలో ఇంటికి

బయలుదేరాము. బండి దిగ్గానే నా భార్య నా చేయిపట్టుకొని నడిచింది. నే నందుకు సిద్ధంగా లేను. చచ్చేంత సిగ్గేసింది. నా భార్య నాకంటే పెద్దది. ఆమె ఆకారాన్ని చూడగానే నా రక్తం చల్లబడి పోయింది."

నేను: ఒహో! మీరు చాలా అందంగా వుంటాననుకుంటున్నారు లాగుంది పాపం!

ఆయన: 'అదికాదు! సిగ్గులేని వాళ్ళంటే నాకు అసహ్యం. ఎవరు ఎంతదూరంగా వుంటే వాళ్ళను చూడాలనే కుతూహలం కూడ అంత ఎక్కువగానే వుంటుంది.'

నేను: అంటే మీవుద్దేశం స్త్రీలు పురుషులకంటే' ఒక అడుగు ముందుంటారనేగా? చాలా బాగుంది. ఒక మహావీరుడు చచ్చిన పామును చంపాడట. పెద్దవాళ్ళకు అణిగి పడివుండటం, చిన్నవాళ్ళను అణచటం, చాలా బాగుంది.

దానికి ఆయన — "ముందే నిన్ను చేసుకొనివుంటే ఇంతకంటే ఎంతో వృద్ధిలోకి వచ్చివుండేవాడిని" అన్నారు.

నేను: చీకటి లేకుండా వెలుగులోని గొప్పతనం తెలియదు. నన్ను కూడ సవతితల్లితో చేరి అలాగే చేసివుండేవారు. అసలు మీకు ఆడవాళ్ళతో ఎలా ప్రవర్తించాలో తెలియదు.

"అయితే, నా కేమీ తెలియదంటావు. అంతేనా?"

"వివాహం అయిన తరువాత, భార్యకు యజమాని కావటమే పురుషుని కర్తవ్యం."

ఆయన: "నిన్ను యజమానురాలును చేశానుగా" అన్నారు నవ్వుతూ.

"ఒకామె జీవితాన్ని నాశనంచేసి, నన్ను యజమానురాలును చేశారు. ఆ పాపానికి ప్రాయశ్చిత్తంకూడ నేనే చేసుకోవాలి. ఈ విషయం ముందే తెలిసివుంటే మా నాన్న, నన్ను మీ కిచ్చే వారేకాదు."

"ఆవిడ కురూపి. పైగా నోరు మంచిదికాదు."

"అవును పాపం! మీరు చాలా మంచివారు!"

"ఆమెను మర్యాదగా పుట్టింటికి పంపాను. అంతేగా నేను చేసింది!"

నేను: మీరు మగవాళ్ళు, నన్ను వివాహం చేసుకొని తీసుకొచ్చారు. ఆమె పుట్టింట్లోపడి కుళ్ళిపోతుంది. ఆడది కాబట్టేగా? నేనూ అందవికారంగా వున్నట్లయితే నాపనీ అంతే అయివుండేది.

"ముందు నే చెప్పేదంతా విను. తరువాత కోప్పడుదువుగాని. ఈ వివాహం మా సవితితల్లి తండ్రి కుదిర్చాడు. సిగ్గు బొత్తిగా లేని నా కురూపిభార్యను చూసి, మానాన్న చాలా బాధపడి అన్నారు: 'నా బంగారంలాంటి బిడ్డను గోతిలోకి తోశారు. వాడి జీవితం నాశనం చేశారు. వాడికి నేను రెండో పెళ్ళిచేసి తీరుతాను' అని. మా పిన్ని 'చూద్దాంలే' అన్నది."

"అప్పుడు నేను ఫోర్తుఫారం చదువుతున్నాను. నాన్న లక్నో వెళ్లిపోయారు. రోజు రోజూ, మా పిన్ని నా భార్యనుగురించి ఎన్నో పితూరీలు చెబుతుండేది. ఆవిడకూడ తన దురదృష్టాన్ని నాముందు వెళ్ళబోసుకొనేది. బహుశా మా పిన్ని కనక మా యిద్దరి మధ్య లేకపోతే, జీవితం, ఎలాగో ఆవిడతోనే సాగిపోయి వుండవచ్చును."

నేను: "అయితే మీరు అసమర్థులన్నమాటేగా?" అన్నాను.

"అవును! నేను అసమర్థుడ్నే, ఎవరిమీదా అధికారం చలాయించటం నాకు చేతకాదు."

ఆయన తండ్రిగారు చనిపోయిన తరువాతి జీవితాన్ని ఆయన స్వయంగానే రాశారు. దాన్నికూడ యిక్కడ ఇస్తాను.

చు నా ర్ గ ఢ్

"చలికాలంలో చునార్‌గఢ్‌నుండి ఇంటికి వచ్చాను. నాతో మా సవతితల్లి చిన్నతమ్ముడు 'విజయబహాదుర్' కూడ వున్నాడు.

అతని తండ్రి బతికేవున్నాడు. అయినా అతని భారంకూడ నా నెత్తినే వేశారు. చునార్‌గఢ్‌లో ఐదురూపాయలకు ఒక ప్రయివేటు చెప్పేవాడిని. ఆ డబ్బు మాయిద్దరకు నెల్లో సగంరోజులకుకూడ సరిపడేదికాదు. భోజనంకూడ అప్పుచేసి తినేవాళ్ళం. ఇంటినుండి తిరిగివెళ్ళేప్పుడు పిన్నిని డబ్బడిగితే లేదంది. వున్నికోటును రెండు రూపాయలకు అమ్మేసి ఇద్దరం చునార్‌గఢ్ చేరాము. చలికాలంలో తొడుక్కోవటానికి నాకు వున్నదల్లా ఆ ఒక్క కోటే. అదయినా ఎంతో కష్టంమీదనే కుట్టించగలిగాను."

అలహాబాద్

"అలహాబాద్‌లో నాకు పదిరూపాయలు దొరికేవి. అందులో ఏడురూపాయలు ఇంటికి పంపేవాడిని. ఇంకొక ఐదురూపాయలకు ప్రైవేటు చెప్పేవాడిని. మొత్తం ఎనిమిదిరూపాయల్లో కాలం వెళ్ళబుచ్చేవాడిని. వంటచేసుకుతిని, స్కూలుకు వెళ్ళేవాడిని. ఆ రోజుల్లోనే 'కృష్ణా' అనే ఒక 'నవల' రాశాను. దాన్ని ఇండియన్ ప్రెస్‌లో అచ్చువేయించాను. ఆసారి శెలవల్లో ఇంటికొచ్చినప్పుడే నా భార్యకూ, నాకూ, పోట్లాట ప్రారంభమయింది. మా పిన్ని కూడ ఆమెమీద చాడీలు చెప్పింది. నా భార్యను కోప్పడ్డాను. ఆవిడమాత్రం తక్కువ తింటేగదూ ? ఆమెకూడ అరవటం మొదలు పెట్టింది. కోపంలో అన్నాను— 'ఇంతకంటే నీ పుట్టింటికి వెళ్ళి పోవటం మేలు' అని. విజయ బహాదుర్‌తో చెప్పటమే తడవుగా ఆమెను వాళ్ళింటిదగ్గర వదిలొచ్చాడు. మా అక్కకు నా దగ్గర వుండాలని కోరిక. మా పిన్నికి ఆమెఅంటేకూడ గిట్టేదికాదు. నే నేమీ చేయలేక ఆమెను అత్తగారింటికి పంపించాను. తరువాత నాకు 'కాన్పూర్'లో 30 రూపాయలకు ఒక మాస్టరు వుద్యోగం దొరికింది. మా పెదనాన్న కొడుకూ, విజయ బహాదుర్‌కూడ నాతో కాన్పూరు వచ్చారు. అక్కడ పదిరూపాయలకు ఒక

ప్రయివేటుకూడ చెప్పేవాడిని. ఆ సంవత్సరంలోనే, నా పున ర్వివాహం జరిగింది."

శివరాణీ దేవి

నా మొదటి వివాహం నా పదకొండవ సంవత్సరంలో జరిగింది. నా వివాహంగానీ, నా భర్త చనిపోవటంగానీ నాకు గుర్తే లేదు; వివాహం అయిన నాలుగు మూడు నెల్లకే నా భర్త పోయారట.

మా నాన్నగారి పేరు ముంషీ దేవీ ప్రసాద్. ఫతేపూర్ జిల్లా లోని ఒక చిన్నగ్రామంలో పోస్టు మాష్టరుగా వుండేవారు.

నా దుస్థితికి మానాన్నగారు చాలా దుఃఖించేవారు. ఎలా గయినా నా జీవితాన్ని సుఖవంతంచేయ నిశ్చయించుకున్నారు. కొందరు పెద్దల సలహాలను తీసుకొని ఒక ప్రకటన చేశారు. ఎంతో మంది యువకులు నన్ను వివాహంచేసుకోవటానికి సిద్ధపడ్డారు. కాని మా నాన్నకు అందులో ఒక్కరూ నచ్చలేదు. ఒకరోజు వారి (ప్రేమచందు) దగ్గరనుండి వుత్తరం వచ్చింది. అందులో తను ఎంత వరకు చదువుకున్నదీ, ఏం చేస్తున్నదీ మొదలైన వివరాలుకూడ రాశారు. మా నాన్న ఆయన్ను ఫతేపూర్ రమ్మని వుత్తరం రాశారు. ఆయనను ఫతేపూర్ రావటానికి అయిన ఖర్చులు మా నాన్నే ఇచ్చారు. ఆయన తన వివాహ విషయం ఎవరికీ చెప్పలేదు. ఇంట్లోవాళ్ళకుకూడ చెప్పకుండానే చేసుకున్నారు. సమాజాన్నీ, తనవాళ్ళనూకూడ లక్ష్యపెట్టకుండా చేసుకున్నారు. ఈ విషయంలో ఆయన చాలా ధైర్యం చేశారనే చెప్పాలి.

ఫాల్గుణమాసంలో నా వివాహం జరిగింది. చైత్రమాసంలో ఆయన 'సబ్ డిప్యూటీ ఇనస్పెక్టరు' అయ్యారు. సంవత్సరంలో పది నెలలు పుట్టింట్లోనే వుండేదాన్ని. నాకు కాన్పూర్‌లో వుండటమంటేనే ఇష్టముండేదికాదు. ఆయనకూ, నాకూ ఎప్పుడూ పోట్లాట జరుగుతూండేది. అదీకాక నాకు తమ్ముడొకడు వున్నాడు.

మా అమ్మ చనిపోయినప్పటినుండి వాడిని నేనే పెంచాను. అందువల్ల వాడిని వదలాలంటే చాలా కష్టంగా వుండేది.

కాన్పూరు జీవితము

ఆయన నాలుగుగంటలకు లేచి కాలకృత్యాలు తీర్చుకునే వారు. పెట్టిన దేదో కొంచెం 'టిఫిన్' తీసుకుని రాయటం మొదలు పెట్టేవారు. ఆయన కలం కూలివాడి 'దోకుడుపార'లాగ పనిచేసేది. అనారోగ్యంగా వున్నా రాసేవారు. ఇనస్పెక్షన్ సమయంలోకూడ రాస్తూనే వుండేవారు. మాటిమాటికి వెళ్ళి మాష్టర్లకు కష్టం కలిగించటం తనకు ఇష్టంలేదనేవారు.

"అయితే గవర్నమెంటుకు మిమ్మల్ని ఇన్‌స్పెక్టరుగా నియమించవలసిన అవసరం ?" అన్నాను నేను.

"అది దానిపని కాబట్టి. ఈ పెద్ద పెద్ద ఆఫీసర్లను దేవుళ్లు అనుకొంటున్నావా ?" అన్నారు ఆయన.

"అదంతా నాకు తెలియదు. ఎవరిపని వారు చేసుకుపోవాలి. అంతే నాకు తెలిసింది."

"నేనుమాత్రం నాపని చేసుకోవటం లేదూ!"

"అందుకే మీ పై ఆఫీసర్లకు మీరంటే ఇష్టంలేదు. మీ క్రిందవాళ్ళకు మీరంటే భయమూలేదు." అని నేను అంటుండే దాన్ని. "ఆఫీసరయితే మానవుడు మానవుడుగా వుండలేడు. నన్ను అలాంటి దుస్థితిలోకి నెట్టకుండా ఈశ్వరుడు రక్షించుగాక" అనే వారు.

ఆయన తను ఎలాంటి స్థితిలోవున్నా సంతోషంగానే వుండే వారు. లౌకిక విషయాలతో తనకు సంబంధంలేనట్లు కన్పించేవారు. కాని ఆయన తన తల్లిని చాలా ప్రేమించేవారు. ఆయన నేత్రాలు ఎప్పుడూ తన మాతృమూర్తికోసం వెతుకుతూ వుండేవి. తల్లిని ప్రేమించని వాళ్ళంటే ఆయనకు చాలా కోపం, అసహ్యంకూడ. ఆయన దృష్టిలో అంతకంటే దుర్మార్గు లెవరూ వుండరు.

వివాహం అయిన ఎనిమిది సంవత్సరాల వరకూ మా ఇద్ద రకూ పడేదికాదు. ఎప్పుడూ కీచులాడుతూనే వుండేవాళ్ళం. దాని క్కారణం ఆయనగారి సవతితల్లే. ఆయనకు నేను ఇంటికి యజ మానురాలుని కావాలని వుండేది. ఈ గొడవంతా నా కెందుకని మా పుట్టింట్లోనే ఎక్కువకాలం గడిపేదాన్ని. ఒకసారి మానాన్న నన్ను పంపించమని ఆయనకు వుత్తరం రాశారు. ఆయన పంప నన్నారు. నాకు చాలా కోపంవచ్చింది. ఆయన గదిలోకి రాగానే నేను బయటకు వెళ్ళబోయాను. ఆయన-"ఎక్కడికి వెళుతున్నావు?" అన్నారు.

"బయటకు వెళుతున్నాను".

"బయటకు సరే! అసలెక్కడకు వెళతావు?"

"అయితే మీరే వెళ్ళండి."

"నే నెక్కడి కెళతాను?"

"అయితే వుండండి. నేనే వెళ్ళిపోతాను."

"నువ్వు ఎక్కడికీ వెళ్ళటానికి వీల్లేదు."

"నేను వెళతాను."

ఆయనకు చాలా కోపంవచ్చింది. నాలుగు చెంప దెబ్బలుకొట్టి బయటకు వెళ్లిపోయారు. సాయంత్రం చిన్నగా, అపరాధిలాగ వచ్చారు. నేను చాలాకోపంగా కూర్చుని వున్నాను.

ఆయన: ఎందుకంతకోపం?

నేను: "నా కెందుకు కోపం?"

ఆయన: "కోపం కాక మరేమిటి? ఒకరితో మాట్లాడవు. మాట్లాడించినా పలకవు?"

"నేను పలక్కపోతే ఎవరికొచ్చిన నష్టం ఏమిటి?

మా ఇంటికి పంపకుండా శిక్ష విధించారుగా? ఖైదీని సంతో షంగా వుండమంటే ఎలా వుంటాడు?"

"నువ్వు పొరపడుతున్నావు. నిన్ను కష్టపెట్టాలని నాకెందుకుంటుంది ? నీ వెళ్ళిపోతే ఇక్కడ నాకు బాగుండదు."

"నా కిక్కడ బాగా లేదు. మా ఇంటికి వెళ్ళిపోతాను."

"ఇది నీల్లు కాదూ !"

"పరాయివాళ్ళ ఇల్లును నా ఇల్లని చెప్పుకోవాల్సిన కర్మం నాకేం పట్టింది!"

"ఇది నీ ఇల్లేనంటే కాదంటావు. ఎలా నిన్ను ఒప్పించటం ?"

"చెంపలు వాయించి ఒప్పించండి."

"నేను చెంపలు వాయించలేదే!"

"అంత కోరిగ్గావుంటే, కానివ్వండి."

"నేనేం చేసేది చెప్పు. ఇంట్లో వుండనివ్వవు, ఎక్కడ కెళ్ళేది!"

"మీకు నన్ను ఖైదీని చేసుకోవటంలో ఆనందంగా వుంటుంది."

"నిజం చెబుతున్నా. నిన్ను ఖైదుచేయాలని మీ ఇంటికి వెళ్ళకుండా ఆపుచేయలేదు. నీవు ఈ ఇంటికి అధికారిణివై, నన్ను కూడ నీ అడుపాజ్ఞలలో పెట్టుకోవాలని నా కోరిక."

"అలాంటి పని నావల్ల కాదు."

"అయితే నేనేం చేసేది!"

"నేను మాత్రం ఏం చేస్తాను?" అన్నాను.

ఆ రోజుల్లోనే ఆయన సవతితల్లి నామీద చాడీలు చెప్ప సాగింది. ఆయన చాలా కోపంగా వున్నారు. నేను ఆయన్ను బతిమాలి సమాధానపరచాలని, పాపం ! ఆయన కోరిక ! నే నంతకంటే మొండిఘటాన్ని. ఆయన కోపాన్ని నిర్లక్ష్యంగా చూసే దాన్ని. చివరకు ఒకరోజు ఆయనవచ్చి అన్నారు— "నామీద పిన్నితో ఎందుకలా చెప్పావు ?"

నేను : నేనేం చెప్పలేదు.

"నువ్వేమీ అనకపోతే ఆమె ఎందుకలా చెబుతుంది ?"

నేను: మీకు నా మాటల్లో నమ్మకం లేకపోతే నేను చేయగలిగిందేమీ లేదు.

ఆయనకు నామాటమీద నమ్మకం కలిగింది అన్నారు— "చూడు! పిన్నికి చాడీలు చెప్పే చేష్ట అలవాటు వుంది. బహుశా అందుకే నువ్వు నేనంటే అంతకోపంగా వుండటానికి కారణం కావచ్చును."

నేను: అన్నీ తెలిసిన మీకెందు కంతకోపంవచ్చింది మరి!

ఆయన: "నామాటలు విని పరదా వదిలేయి. వివాహం అయిన ఇన్ని సంవత్సరాల తరువాతకూడ పరదాఏమిటి? అదీకాక ఆమె నీకు స్వంత అత్తగారుకూడ కాదు."

నేను: "నే నంత సిగ్గువిడిచిందాన్ని కాదు" అన్నాను.

"సరి, నువ్వేం చెయ్యకు. అంతా నేనే అనుభవిస్తాను."

"చేసుకున్న వాళ్ళకు చేసుకున్నంత మహాదేవ! అని వూరికినే అన్నారా పెద్దలు?"

"ఇదంతా నా ఖర్మం!"

"అవును! ఎవరి ఖర్మకు ఎవరు కర్తలు!" అన్నాను.

"అబ్బ! నీ హృదయం ఎంత కఠినమైంది? నీకు నామీద కొంచంకూడ దయ లేదు."

"దయ చూపాల్సినంత కారణం ఏముందో నాకు బోధ పడటం లేదు."

"పరదావదిలి ఈ ఇంటి అధికారాన్ని నీ చేతిలోకి తీసుకో"

"అంత బాధే మొచ్చింది. నేను సుఖంగానే వున్నాను. మీకు మాత్రమేం? మీ పిన్నికి మీరంటే ఎంతో ప్రేమ?"

"నువ్వనుకొనేది ప్రేమకాదు. మాతృప్రేమ నిస్వార్థ ప్రేమ. ఆ ప్రేమనుకూడ పొందలేని దురదృష్టవంతుడను." ఆయన కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆరోజునుండి ఆయనమీద నాకు జాలిగా వుండేది.

ఆరోజునుండే నేను ఆయన్ను సానుభూతితో చూడటం నేర్చుకున్నాను.

లేచి వెళుతూ వెళుతూ అన్నారు — "నిజం చెబుతున్నానూ. నన్ను నీకు పూర్తి అప్పగించుకున్నాను. నీవు ఏం చేసినా సరే!

ఆరోజునుండి నేను ఆయనమీద అధికారం చలాయించాను. ఆరోజునుండే ఆ ఇంటిని నాఇల్లుగా భావించాను.

మహోబా :

ఆయనకు మహోబా బదిలీ అయింది. ఆయన సవతితల్లి ముందు మాతో మహోబా రావటానికి ఒప్పుకోలేదు. ఆమె సోదరుడు చెప్పిన మీదట మాతో వచ్చింది. కాని ఎక్కువ రోజులు అక్కడవుండలేకపోయింది. తిరిగి కాన్పూరు వెళ్ళిపోయింది.

మహోబాజీవితం—ప్రొద్దున లేవటం, తినటం, సాహిత్యసేవచేయటంలోనే ఎక్కువ కాలం గడిచిపోయింది. తనకింద పని చేసేవాళ్ళను చాలా క్షేమగా చూసేవారు. అందులో వయస్సు మళ్లిన వాళ్ళను తన తండ్రిలాగ గౌరవించేవారు. మా ఇద్దరు పిల్లలూ, అక్కడే పుట్టారు.

మహోబాలో పాలూ, పెరుగూ, మొదలైనవన్నీ వుచితంగా దొరికేవి. మా నౌకర్లు పాలతో 'కోవా' తయారుచేసుకుని తింటుండేవాళ్ళు. మొదట ఆయన గ్రామస్థులనుండి వస్తువులు తీసుకోవటానికి నిరాకరించారు. అందరూ అది తమ నియమమనీ, ఆ నియమాన్ని పాటించకపోతే ముందువచ్చే వాళ్ళకు కష్టమనీ చెప్పిన మీదటా, పాలూ, పెరుగూ, పండ్లూ, మొదలైనవి వుచితంగా గ్రామస్థులనుండి లభించేవాటిని తన కింద పనిచేవాళ్ళకు ఇప్పించేవారు. ఆ వస్తువులను ఇంట్లో వుపయోగించవద్దని చెప్పారు.

ఆయన ఎక్కువగా 'టూర్' కు వెళ్ళుతుండేవారు. టూర్ కు చలికాలంలో వెళ్ళవలసివస్తే తను పాత 'శాలువ' కప్పుకుని తను ఎక్కే గుర్రానికి మంచిదీ, కొత్తదీ, అయిన శాలువ కప్పేవారు.

ఏ ప్రాణి కష్టాన్ని కూడ ఆయన చూడలేకపోయేవారు. నాకు కోపం ఎక్కువ ఆయన తన చిరునవ్వులో నా కోపాన్ని జయించేవారు.

మహోబాలో ఒక తమాషా అలవాటువుంది. ఎవరింట్లోనయినా పెళ్ళి అయితే పెళ్ళివారు తర్లివెళ్ళింతరువాత స్త్రీలు ఒక చేత్తో హారతి వెలిగించే పళ్ళెం, రెండో చేత్తో రొట్టెలు చేసే కర్ర తీసుకుని మోగిస్తూ, పాటలు పాడుతూ ఇంటింటికీ వెళతారు. ఎవరింట్లో నయినా మొగవారు పెళ్ళివారితో వెళ్ళకపోతే ఆ కర్రతో కొడతారు.

ఒకసారి మా ఇంటికికూడ వచ్చారు. నౌకర్లకు బాగా తగిలాయి. ఎందుచేతనో ఆయనమీద మాత్రం దయ చూపించారు. ఆయన భయపడి ఒక గదిలోకి పరుగెత్తారు.

మహోబా (2)

మేము మహోబాలో వున్నప్పుడు ఆయన పిన్నమ్మ, ఆమె కొడుకులూ, వారి మామగారింట్లోనే వున్నారు.

ఆయన తనతోపాటు నన్నుకూడ 'టూర్'కు రమ్మనేవారు. "నీవు ఒక్కదానివి ఇంటిదగ్గరవుంటే నాకు ఎప్పుడూ నీ దిగులే. నీవు కూడ నాతో రాకూడదూ?"

నేను: ఎలావచ్చేది?

"ఎందుకు రాకూడదూ? వంటమనిషికూడా వుంటాడాయె?"

"భారతీయులెవరూ టూర్‌లో భార్యలను తీసుకెళ్ళరు. నేను మీతోవస్తే బలేతమాషాగా వుంటుంది?"

"ఇందులో తమాషా ఏముంది? నీ వింకా పాతకాలం పద్ధతులను పట్టుకొనే వేలాడతావు. ఇంగ్లీషువాళ్ళను చూడు. ఎంత కులాసాగా వుంటారో!"

"ఇది ఇంగ్లండు కాదు, హిందూదేశం."

"అందుకే ఈ గొడవలన్నీ. నాకు మాత్రం ఈ పద్ధతేమీ నచ్చలేదు. నీ విక్కడ వంటరిగా, నే నక్కడ నీగురించిన ఆలోచనలతోనే కష్టంగా కాలంగడపటం."

"ఏమో బాబు, నాకేమాత్రం సిగ్గుగా వుంటుంది. నేను రాను. అదీకాక వూరూరూ ఎవరు తిరుగుతారు."

"నేను తిరగటంలేదూ?"

"గవర్నమెంటు మీకు తిరగటానికి డబ్బు ఇస్తుంది. నాకేం లాభిస్తుం?"

"నీకు ఆనందం దొరుకుతుంది."

"అలాంటి ఆనందం నాకొద్దు."

"సరి! నీ ఇష్టం."

ఆయన సోదరి!

ఆయన సోదరికీ, సవతితల్లికీ బొత్తిగా పడేదికాదు. అందువల్లనే పదిహేను సంవత్సరాలవరకు ఆమె పుట్టింటికి రాలేదు. మీ అక్కయ్యను ఎందుకు తీసుకురారని అడిగితే అనేవారు– "పిన్నికీ, ఆమెకు పడదు. ఎలా తీసుకురావటం"– అని.

నేను: "మీ పిన్నంటే ఎందుకంతభయం. ఆమెకు లేని హక్కు ఈమెకు ఎక్కడినుంచి వచ్చింది!"

ఆయన: "పరిస్థితులు అనుకూలంగా లేనప్పుడు ఏం చేస్తాము? నాన్నగారు లేరాయె. మా అక్క అత్తవారింట్లో సుఖంగా నేవుంది. ఇక్కడ కొచ్చినప్పటినుంచి పోట్లాట ప్రారంభం."

నేను: "దీనికంతా కారణం మీరే!"

ఆయన: "నువ్వు చాలా అన్యాయం చేస్తున్నావు."

నేను: "అన్యాయం కాదు. న్యాయమే. తల్లితండ్రులు లేని పిల్ల. ఒక్కగా నొక్క సోదరుడుండీ కూడ తనను ఒక్కసారికూడ పుట్టింటికి తీసుకువెళ్ళకపోతే ఎంత బాధపడుతుంది? నేను వద్దన్నా ఆమెను తీసుకురావటం మీ కర్తవ్యం."

"నీకు తెలియదు. నీతోనే ఎప్పుడూ పోట్లాట జరుగుతూ వుంటుంది. ఆమెనుకూడ తీసుకొస్తే నీ కేం సుఖం వుంటుంది.?"

"ఇంతకంటే, మీరు అవివాహితులుగానే వుంటే బాగుండేది."

"నువ్వే చెప్పు. నాకు అక్క చెల్లెళ్లమీద ప్రేమ వుండదా!"

"వుంటుంది. కాని మీరు పిరికిపందలు. అందుకే సవతితల్లిని నెత్తి కెక్కించుకున్నారు. జీవితంలో ప్రతి వాళ్లకూ వాళ్ళ వాళ్ళ స్థానం వుండనే వుంటుంది."

"అవును! నేను పిరికి పందనే కాని, హృదయ హీనుణ్ణికాదు. నేను ఎంతో బాధపడుతుంటాను"

"మీ సవతితల్లి మీ కేం తవ్వి తలకెత్తింది? మీ సంపాద నంతా ఆవిడ అక్క, తమ్ముళ్ళు తినొచ్చుకాని, మీ తోబుట్టువులు తినకూడదు!"

ఆయన: "ఇదంతా ఆత్మాభిమానంగల స్త్రీలకు అర్థమవు తుంది. అది లేని ఆమెతో నే నెక్కడ విరోధం పెట్టుకోనేది" అన్నారు.

నేను: "మీ అక్కయ్య ఏమనుకుంటుంది?"

"ఏమనుకుంటుంది? పరిస్థితులను అర్థంచేసుకొని బాధ పడుతూ వుండివుంటుంది."

ఒకసారి మాత్రం ఆయన సోదరి వచ్చింది. తరువాత కొద్ది రోజులకే ఆమె చనిపోయింది. ఆమె చనిపోయిం తరువాత ఆయన సవతితల్లికూడా మాదగ్గరనుండి వెళ్లిపోయింది. ఆయన, తన అక్క పిల్లల్ని తన పిల్లల్లాగానే ప్రేమించేవారు. తరుచుగా వాళ్లందర్నీ తీసుకొస్తుండేవారు. వాళ్ళను ఒళ్లో కూర్చోబెట్టుకొని ముద్దులాడే వారు. తన సోదరినీ, తల్లినీ, తల్చుకుంటూ బాధపడేవారు.

## 1905

నేను రాకముందునుంచే ఆయన రాస్తుండేవారు. ఆయన మొదటి నవల "కృష్ణా" ప్రయాగలో ప్రకటించబడింది. నా వివాహం అయిన సంవత్సరమే 'ప్రేమ' అనే నవల రాశారు. అది తరువాత 'విభవ్' అనేపేరుతో ప్రసిద్ధికెక్కింది. నా వివాహం అయిన రెండో సంవత్సరంలో "సోజోవతన్" అనే కథాసంగ్రహము ప్రకటించ బడింది. దానిమీద కేసుకూడ నడిచింది. సి. ఐ. డీ.లు మా

ఇంటికి రాసాగారు. చివరకు కలెక్టరు దగ్గరనుంచి రమ్మని కబురు వచ్చింది.

అప్పుడు ఆయన కేంప్‌లో వున్నారు. ఒక రోజు ఆలస్యంగా ఇంటికి వచ్చారు. నిన్న నెందుకు రాలేదని అడిగాను.

ఆయన: "రాత్రంతా నడిచీ నడిచీ చచ్చిపోయాను."

నేను: "అరే! ఏం జరిగిం దేమిటి?"

ఆయన: " 'సోజోవతన్' విషయంలో కలెక్టరునుండి కబురొచ్చింది."

"అసలు జరిగిం దేమిటో చెప్పండి!"

"ఏముందీ! కలెక్టరు పిలిపించాడు. వెళ్ళి చూస్తే 'సోజోవతన్' ఆయన టేబులుమీద పెట్టి వుంది."

"ఊఁ తరువాత?"

ఆయన: "కలెక్టరు 'ఈ పుస్తకం రచించిది నీవేనా?' నేను 'ఔ' నన్నాను. విని ఆయనన్నాడు: 'నీవు ఇంగ్లీషు వాళ్ళ రాజ్యంలో వున్నావు కాబట్టి సరిపోయింది. లేకపోతే ఈపాటికి నీ చేతులు నరికుండేవాళ్ళు. కథలద్వారా దేశంలో అరాజకాన్ని లేకెత్తిస్తున్నావు. జాగ్రత్త! నీ దగ్గరవున్న కాపీలన్నీ పంపించు".

నేను: "అన్ని కాపీలు పంపించేస్తారా?"

ఆయన: "ఇంకానయం తేలిగ్గాపోయింది ఏ గొడవా లేకుండా."

"అయితే ఇక రాయటంకూడా మానేస్తారా?"

"మానేయట మెందుకు! పేరు మార్చుకోవాల్సివస్తుంది."

నేను: "నేను ఆ కథలు ఇంకా చదవనే లేదు."

ఆయన: "గవర్నమెంటు నిషేధించిన పుస్తకాన్నే ఎక్కువ మంది కొంటారు. దాంట్లో ఏముందో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలగడం సహజమే."

"మీరు చదివి వినిపిస్తేగదూ నేను వినేది. నాకు ఉర్దూ రాదని మీకూ తెలుసు."

"సరే! పుస్తకాలు రానివ్వు. చదివి వినిపిస్తాను" అన్నారు. వివాహానికిముందు నాకు సాహిత్యంలో అభిరుచి లేదు. నా చదువూ అంతంతమాత్రమే.

కాన్పూర్ నుండి 'సోజోవతన్' పార్సిల్ వచ్చింది. ఒక కాపీ వుంచుకొని మిగతా అన్ని కాపీలు కలెక్టరుకు పంపించాము.

ఆయనకు దొరికిన సమయంలో ఎక్కువభాగం నాతోనే గడిపేవారు. తన రచనలు చదివి వినిపించేవారు. ఇంగ్లీషు పేపరు చదివి చెప్పేవారు. నాక్కూడ చదువుమీద శ్రద్ధకలిగింది. ఆయన ప్రొద్దుటపూటనే రాసుకునేవారు. ఈవిధంగా నాకు క్రమేణా సాహిత్యంలో అభిరుచికలిగింది. ఆయన 'టూర్' లో వున్నప్పుడు పుస్తకాలతో కాలక్షేపం చేసేదాన్ని. ఆయన ఇంట్లో వుంటే నాకు చదవాల్సిన అవసరమే వుండేదికాదు.

ఆయన్ను చూస్తుంటే, నాకూ కథలు రాయాలనిపించేది. నా మిడి మిడి జ్ఞానంతోటే కథలు రాయటానికి ప్రయత్నించేదాన్ని. రాసి రాసి చింపేస్తుండేదాన్ని కాని ఆయనకుమాత్రం చూపించే దాన్నికాదు. ఆయన రచనలమీద విమర్శవస్తే చదివి వినిపించే వారు. బాగా రాస్తే నాకు చాలా సంతోషంగా, గర్వంగాకూడ వుండేది. విమర్శ కొంచెం ఘాటుగావుంటే నాకు కష్టంగా వుండేది. కాని ఆయనలో ఎలాంటి మార్పూ కన్పించేదికాదు. దూషణ భూషణలను సమానంగా స్వీకరించేవారు.

నాకు ఏదైనా మంచి 'ప్లాటు' తోస్తే ఆయనకు చెప్పేదాన్ని. ఆయన దానిమీద కథ రాసేవారు.

1913 నుండి ఆయన హిందీలోకూడ రాయటం ప్రారంభించారు. ఉర్దూలోకికూడ వాటిని అనువదించేవారు.

'సాహసము' అనే నా మొదటికథ 'చాంద్' అనే పేపర్లో వచ్చింది. నేను ఆయనకు చూపించలేను. 'చాంద్'లో ప్రకటించ బడ్డ తరువాతనే చూశారు.

ఆయన ఇంటికొచ్చి అన్నారు— 'మీరుకూడ రచయిత్రి అయిపోయారే! ఆఫీసులో అందరూ చదివి చదివి నవ్వుతున్నారు. కొంతమందికి నా మీద సందేహంకూడ కలిగింది' అని.

ఆ తరువాత నేను ఏది రాసినా ఆయనకు చూపించేదాన్ని. ఆయన రచనల ప్రభావం నా రచనలమీద పడకుండా సాధ్యమయి నంతవరకు ప్రయత్నించేదాన్ని. అప్పటికీ ఎంతోమందికి సందేహంగా వుండేది.

నా కథలు వేరే ఏదైనా భాషలోకి అనువదించబడితే ఆయన చాలా సంతోషించేవారు. ప్లాటుకోసం ఆలోచిస్తూ చాలాసేపటి వరకు నిద్రపోని రాత్రిళ్లు ఆయన అనేవారు:

"నీ కెందుకొచ్చినబాధ చెప్పు. హాయిగా నిద్రపోక!"

"మీకుమాత్రం ఎందు కాబాధ? నేను ఎప్పుడో బాధపడ తాను. మీకు రోజూ ఈ బాధేగా?" అనేదాన్ని.

"ఒకర్ని చూసి లేనిపోని బాధను ఎందుకు కొనితెచ్చుకో వాలి?"

"అది మా ఇష్టం. అదీకాక మానవుడు తన భావాల్ని ఎక్కడ దాచుకో గలుగుతాడు!" అనే దాన్ని.

1913

కాన్పూరునుండి 'ప్రతాప్' అనే పేపరు వస్తుంది. సంపాద కులు 'గణేశ్ శంకర్ విద్యార్థి'. ఒకవ్యాసం రాసిపంపమని ఆయనకు వుత్తరంవచ్చింది. ఆయన రాసిపంపిచారు. ఒకసారి కాన్పూరుపని మీద 'ప్రతాప్' ఆఫీసుకుకూడ వెళ్ళొచ్చారు. తిరిగొచ్చి అన్నారు — "విద్యార్థీజీ చాలా శ్రమజీవి. చాలవరకు పని, ఆయన స్వయంగానే చేసుకుంటారు. దేశానికి ఇలాంటి వ్యక్తులే కావాలి. ఆయన తన

జీవితాన్ని సార్థకం చేసుకోగలరు. ఆయన్ను చూస్తుంటే నాకూ కూడా ఈ వుద్యోగం వదిలేసి, ప్రశాంతంగా కూర్చుని సాహిత్యసేవ చేయాలనిపిస్తుంది. నాకు కనీసం పదిసెంట్ల భూమివున్నా దాంతోనే ఎలాగో కాలంగడుపుతూ, ఏకాంతంగా కూర్చుని సాహిత్య సేవచేసి వుందును."

నేను : పదిసెంట్లభూమిలో బంగారం పండుతుందా ? అదీగాక విద్యార్థిజీకి ఎవరిబాధ్యతా లేదు. మీకు అలాకాదు. మీమీద ఎందరి జీవితాలో ఆధారపడి వున్నాయి. ఆయనతో మీకు పోటీఏమిటి ?

ఏదో మర్చిపోయిన విషయం జ్ఞాపకంవచ్చినట్లు దిగులు మొఖంపెట్టారు.

జబ్బుపడ్డా ఆయన తనపని చేస్తూనే వుండేవారు. ఆయన్ను చూస్తుంటే అసలు ఈయన పుట్టిందే పనిచేయటానికా అనిపించేది. ఒకోసారి ఆయనమీద నాకు కోపంకూడ వచ్చేది. ఆయన ఎంత గొప్పవారో ఈరోజు తెలుస్తుంది. వ్యక్తి జీవించివుండగా అతని గొప్పను గుర్తించకపోవటం మనదేశంయొక్క విశేషత. వస్తువును పోగొట్టుకున్న తరువాత దాని విలువను తెలుసుకుంటాము.

## 1914

ఒకరోజు ఆయన తన మొదటి బావమరది (మొదటిభార్యా తమ్ముడు)తో మాట్లాడుతున్నారు. అతను తన అక్కగారి విషయం మాట్లాడుతున్నాడు. అదేసమయంలో మాచిన్నమ్మాయి తప్పటడుగులువేస్తూ బయటకు వెళ్ళింది. దాన్ని తీసుకురావటానికి వెళ్ళిన నేను తలుపు దగ్గరే ఆగిపోయి వారిమాటలు విన్నాను. వారి మాటలవల్ల నా సవతి బ్రతికేవున్నదని తెలిసి చాలా బాధపడ్డాను. ఆయన చనిపోయిందని చెప్పి నన్ను మోసం చేశారు. ఆ వచ్చినతను వెళ్ళిం తరువాత అడిగాను-"ఎవరాయన?"

ఆయన : "ఒక పెద్దమనిషి."

నేను : "మీరు అబద్ధాలు ఆడతారని ఎప్పుడూ అనుకోలేదు."

ఆయన : "మానవుడు ఎవర్ని జీవించివున్నట్లు తలిస్తే వాళ్లు జీవించివుంటారు, చచ్చిపోయారనుకుంటే చచ్చిపోయినట్లే."

నేను : "అది నేను ఒప్పుకోను. దయచేసి ఆమెను తీసుకురండి."

ఆయన : "నేను చస్తే పోను."

నేను : ఎందుకు పోరు ? మరి పెళ్ళెందుకు చేసుకున్నారు ?

ఆయన : "నేను చేసుకోలేదు. మా నాన్న చేశాడు."

నేను : "ఎవరు చేసినా జరిగింది మీ పెళ్ళే. ఆ బాధ్యతంతా మీ మీదనే వున్నది."

ఆయన : "అయితే కావచ్చు, నేనుమాత్రం ఆమెను తీసుకురాను."

నేను : "ఒకవ్యక్తి జీవితాన్ని నాశనంచేసే అధికారం మీకేముంది ?"

ఆయన : "ఇందులో అధికారం ఏముంది?"

నేను : "ఇదేనా హిందూ సంస్కారం?"

ఆయన : "ఆ దౌర్భాగ్యుడు రావటంవల్ల నీ చేత ఇన్ని మాటలు పడుతున్నా."

కోపంగా చెప్పి లాభంలేదని బుజ్జగింపుగా అన్నాను. "మీరు ఆమె బాధ్యతేమీ తీసుకోవద్దు. ఆ బరువు భారమంతా నేనే వహిస్తాను."

"నీతో పోట్లాడుతుంది."

"ఏమయినా మీవరకూ రానివ్వనుగా."

"సరి నీ ఇష్టం!"

తరువాత నేను ఆమెకు "ప్రియసోదరి" అని సంబోధిస్తూ ఉత్తరం రాశాను. అందులో ఆమెను రమ్మని రాశాను. అందుకు ఆమె ఆయన వెళ్ళి తీసుకొస్తేగాని రానని రాసింది. ఆ వుత్తరం

ఆయన చేతికిచ్చాను. చదివి "రాళకపోతే మరీమంచిది. నేనుమాత్రం పోను" అన్నారు.

నేనుమాత్రం ఆమెకు వుత్తరాలు రాస్తూనే వున్నాను. ఆమె రాసిన ప్రతి వుత్తరాన్ని ఆయనకు ఇచ్చేదాన్ని.

ఈ గ్రామంలోనే ఆయన ప్రయివేటుగా చదివి, ఇంటరు పాసయారు.

ఆరోగ్యం బాగాలేకపోయినా చాలా కష్టపడి 5 గంటల వరకు చదివేవారు. 11 – 5 గంటలమధ్య ఏకొంచెంసేపో నిద్ర పోయేవారు. కాలకృత్యాలు తీర్చుకొని 6 గంటలనుండి 9 గంటల వరకు కథలు రాసుకొనేవారు. సెకండుక్లాసులో ఇంటరుపాసయారు. ఎంత అనారోగ్యంగావున్నా తనపని తనే చూసుకొనేవారు. ఎప్పుడైనా కాళ్ళు పిసుకుతానంటే ఒప్పుకొనేవారుకాదు. తన ధోవతి తనే వుతుక్కొనేవారు. నౌకరు ఎదురుగావున్నా లేచివెళ్ళి మంచినీళ్లు తాగేవారు. ఒకోసారి ఆయన పనులు చూస్తుంటే కోపంవచ్చేది.

నేను: "నౌకరు ఎందుకు?"

ఆయన: "ఎవరిపనులు వీలయినంతవరకు వాళ్ళేచేసుకోవటం మంచిది. ఈరోజు నౌకరువున్నాడు, రేపు వుండకపోవచ్చు. ఒకప్పుడు నేనూ ఐదురూపాయల నౌకరునే."

నేను: "నేను చూడలేదు."

ఆయన: "నువ్వు చూడకపోతేనేం, నేను అనుభవించాను. మానవుడు వీలయినంతవరకు తనపని తనే చేసుకోవటం వుత్తమం."

జూలై 1915

ఆ తరువాత ఆయన జీర్ణశక్తి క్షీణించింది. బదిలీకి అర్జీ పెట్టారు. నేపాలు కొండప్రాంతంలోని ఒక గ్రామంలో వేశారు. అక్కడ ఆయన ఆరోగ్యం ఇంకా చెడిపోయింది. నేను మా పుట్టింట్లోనే వున్నాను. మాతండ్రి బలవంతంమీాద ఆయనకూడ ఆరునెల్లు

ఖర్చుపెట్టారు. అర్ధజీతం 25 రూపాయలు వచ్చేవి. అందులో 10 తన సవతితల్లికి, 15 తన సోదరునకు పంపేవారు. ఆయన తన ఖర్చు ఎలా గడుపుకొనేవారో తెలియదు. కథలకు, వ్యాసాలకూ వచ్చే డబ్బుతో బహుశా తన ఖర్చులు సర్దుకొనేవారేమో.

డ్యూటీలో జాయిన్ అవగానే మళ్ళీ జబ్బుచేసింది. బదిలీకి అర్జీ పెట్టుకున్నారు. లాభం లేకపోయింది. స్వయంగా వెళ్ళి డైరెక్టర్ను కలుసుకుని చెప్పారు: "ఆ గ్రామం నీరు నాకు సరిపడ లేదు".

డైరక్టరు అన్నాడు: "నీకు మహాబా నీరూ పట్టలేదూ, ఈ గ్రామం నీరూపట్టలేదు. మరి నన్నేం చేయమంటావు. నువ్వు మాష్టరు చేసిన చోటున 40 రూపాయల నౌకరీ వుంది వెళతావా?"

తరువాత రాస్తానని చెప్పి ఇంటికొచ్చారు. ఏమయిందని అడిగాను. "కావటానికేముంది! దౌర్భాగ్యుడు కోప్పడుతున్నాడు. 40 రూపాయల మాష్టరు పని ఇప్పిస్తానన్నాడు" అన్నారు.

నేను: "ఏం చెప్పి వచ్చారు?"

"తరువాత ఆలోచించి రాస్తానన్నాను."

"మాష్టరు పని ఏం అంత చెడ్డదా?"

"జీతం 40 రూపాయలని తెలుసా?"

"ఏమయితే?"

"నెలకు 100 రూ॥ లొస్తుంటేనే ఎంతో కష్టంమీద కుటుంబాన్ని నెట్టుకొస్తున్నాము."

"దానికేంలే! 1000 రూపాయల జీతగాడూ కష్టంగానే గడుపుతున్నాడు, 10 రూపాయలవాడూ దాంతోనే కాలం గడుపుతున్నాడు."

"సరి! నీ కిష్టమయితే నాకేమీ అభ్యంతరం లేదు. డైరెక్టరుకు రాయమన్నావా?"

"రాయండి! టూర్ గొడవన్నా తగ్గుతుంది!

మళ్ళీ మా పూర్వపు గ్రామమే చేరుకున్నాము. ఒకరోజు తమాషా జరిగింది. ఆయన చేపలు కొనటానికి బజారు వెళ్ళారు. పండిత్ 'మన్నన్ త్రివేదీ'గారితో కలిసి వచ్చారు. ఆయన వెళ్ళి పోయిన తరువాత అన్నారు: "ఇవ్వాళ చేపలు కొంటుంటే పండిత్ జీ చూశారు. చాలా తమాషా మనిషి."

నేను : 'నేను మీకు ఎన్నో సార్లు చెప్పాను, మీరు వెళ్ళొద్దు ఎవరిచేతైనా తెప్పించమని. మీకు నా మాటలు చెవి కెక్కటేగదూ!"

ఆయన : "నా పని నేను చేసుకోవటానికి సిగ్గెందుకు? అదీగాక నేను చేసేది కూలిపనేగా!"

నేను : "అయితే పారను వుపయోగించరేం?"

ఆయన : "కలాన్ని వుపయోగిస్తున్నాగా, ఏదయితేనేం?"

"మీరు పారను వుపయోగిస్తే, నేను మీకు పొలం అన్నం పట్టుకొచ్చేదాన్ని కాబోలు."

"ఇంట్లో పెడుతున్నావుగా? కూరలు తేవటానికి నాకోసం నౌకర్ను పెట్టుకుంటే, నీకోసం ఒక వంటమనిషినికూడ పెట్టాలి" అనేవారు.

అక్కడ వచ్చే 40 జీతంరాళ్ళలో 10 వాళ్ళ సవతితల్లికి పంపేవారు. మిగతా 30 లో మేము ముగ్గురం జీవించేవాళ్ళం.

## 1914 నాటి మాట

అది కార్తీకమాసం. కుంభవృష్టి కురుస్తోంది. ఇళ్ళు పడిపోతున్నాయి. మా ఇంట్లో వున్న నలుగురము ఒకేచోట కూర్చున్నాము. ఇల్లు పడిపోతే ఒకేసారి అందరం చచ్చిపోవాలని మా వుద్దేశం. రెండోరోజు వర్షం తగ్గింది. ఆయన స్కూలుకు వెళ్ళారు.

"నిన్న మీరు ఎందుకు రాలేదు?" అని హెడ్‌మాష్టరు అడిగాడు.

"వర్షం చాలా ఎక్కువగా వుంది?" అన్నారు ఆయన.

"మీరు పంచదార బొమ్మా కరిగి పోవటానికి?"

ఆయన: "నేను పంచదార బొమ్మను కాదు. కాని ఆ చుట్టు పట్ల ఇళ్ళన్నీ పడిపోతున్నాయి. మా ఇల్లుకూడ పడిపోతుం దనుకు న్నాను."

హెడ్‌మాష్టరు: "పడేదాన్ని మీరుపడకుండా ఆపుతారా?"
ఆయన: "ఆపలేను. కాని అందరితోపాటు చచ్చిపోగలను."

"అయితే మీరు చావటానికి ఆగారన్నమాట!"

"అవునండి!"

ఆయన ఎప్పుడూ ఇంటిపనిలో సహాయం చేస్తుండేవారు. నేను వారించినా విశేషుటం కాదు. ఒకోసారి నాకు కోపం కూడ వస్తుండేది. నేను నిద్రలేవకముందే ఆయన లేచి పనిచేసేవారు. అందు వల్ల నేనుకూడ వీలయినంతవరకు ఆయనకంటే ముందు లేవటానికి ప్రయత్నించేదాన్ని.

నాలుగు సంవత్సరాలనాటి మాట. అవి ఎలక్షన్ రోజులు. ఆయన ఆ గ్రామంలో కాంగ్రెసు తరఫున ప్రచారం చేశారు. కాని చివరకు కాంగ్రెసే ఓడిపోయింది. కొంతమంది ఆ గ్రామంలో బీద ప్రజలమీద చాడీలుచెప్పి ఆయన్ని రెచ్చగొట్టాలని చూశారు. కాని ఆయన అన్నారు - 'వాళ్ళకు మనం చెప్పగలవాళ్ళమేకాని బల వంతం చేయలేము. తమ ఇష్టం వచ్చిన వాళ్ళకు ఓటు ఇచ్చే స్వతంత్రం వాళ్ళకున్నది. దాంట్లో వాళ్ళు పొరపాటుపడవచ్చు. అంతమాత్రంచేత వాళ్ళను మనం విరోధులుగా తలంచటం భావ్యం కాదు."

ఆ రోజుల్లోనే జరిగిన ఒక సంఘటన గుర్తొచ్చింది. ఆయన ఇంట్లో ఫలహారం తీసుకుంటున్నారు. ఇంతలో బయటనుండి ఏదో అల్లరి విన్పించి బయటకు వెళ్ళాము. ఇద్దరు పిల్లలు కొట్టుకుంటు న్నారు. ఇంకో పిల్లవాడు మధ్యలో వాళ్ళను సర్ద ప్రయత్నిస్తు న్నాడు. ఆ సర్దుతున్న పిల్లడు కొట్టుకుంటున్నవాళ్ళలో ఒకని

తమ్ముడు. ఆయన ఈ పిల్లవాడు అన్నతో చేరి, రెండవ పిల్లన్ని కొడుతున్నాడనుకున్నారు. అందువల్ల "అరే గాడిదా! మధ్య నువ్వుకూడ కొడుతున్నావా!" అంటూ ఆయన ఆ పిల్లడ్ని కొట్టారు.

ఆ పిల్లడు ఏడుస్తూ "నేను కొట్టటంలేదు. సర్దుతున్నాను" అన్నాడు.

నాకు వాడిమీద జాలివేసింది. వెళ్ళి దగ్గరకు తీసుకుంటూ అన్నాను. "ఆయనకు తెలియక కొట్టారు. ఏడవకు బాబూ!"

ఆ పిల్లడు కళ్ళుతుడుచుకొంటూ "ఫరవా లేదండి. తాతగారేగా కొట్టింది" అన్నాడు.

"మీరు ఏపని చేసినా అంతే! వెనకాముందూ ఆలోచనే వుండదు" అన్నాను ఆయనతో.

"ఏమో, అన్నతో కలిసి కొడుతున్నా డనుకున్నాను. కోపం వచ్చింది కొట్టాను" అన్నారు.

"ఇక ముందెప్పుడూ ఇలాంటిపని చేయకండి. అసలు విషయం అర్థంచేసుకోకుండా తీర్పుచెప్పటానికి పూనుకోకండి."

"తప్పే జరిగింది. ఇం కెప్పుడూ ఇలా జరగదు భయపడకు" అన్నారు.

ఆ పిల్లవాడ్ని బుజ్జగిస్తూ ఇంట్లోకి తీసుకొచ్చి మిఠాయిపెట్టి పంపించారు.

ఒకసారి మే మిద్దరం మా ఇంటికి వెళ్ళుతున్నాము. ఆయన జబ్బులో వున్నారు. రైల్లో జనం ఎక్కువగా వున్నారు. ఆయన పడుకున్నారు. ఆయన పక్కన మా అమ్మాయికూడ నిద్రపోతోంది.. ఒకస్టేషన్‌లో ఇద్దరు పురుషు లెక్కారు. వాళ్ళకు కూర్చోవటానికి స్థలం లేదు. ఒక డన్నాడు-"మనకు కూర్చోవటానికి స్థలం లేదు. ఈ మహాశయుడు హాయిగా నిద్రపోతున్నాడు" అని.

నేను: "మీరుకూడ ఎక్కడైనా కూర్చోండి" అన్నాను.

అతను: "ఆయన్ను లేపు."

నేను : "ఆయన ఆరోగ్యం బాగాలేదు."

అతను : "ఆరోగ్యం బాగాలేకపోతే ప్రయాణం ఎందుకు చేయాలి ?"

నేను : "నోటికొచ్చినట్లు వాగకండి !"

అతను : "మీరుమాత్రమే టికెట్టు కొన్నారా ?"

నేను : "ఎక్కడైనా స్థలంవుంటే చూసుకుని కూర్చోండి. ఎవరొద్దన్నారు."

అతను : "ఆయన్ను లేపి కూర్చుంటాము."

నేను : "లేపు చూస్తాను !"

అతను లేపటానికి ప్రయత్నించటం చూసి నాకు చాలా కోపంవచ్చి అన్నాను — "జాగ్రత్త! చెయ్యి ముందుకు వచ్చిందా నిన్ను బండిలోనుండి బయటకు విసిరేస్తాను."

మా ఇద్దరిమధ్య జరిగే సంఘర్షణకు ఆయనకు మెలుకువ వచ్చి అన్నారు— "పోనీ! మనకు వాళ్ళతో పోట్లాటేమిటి ? నేనే లేస్తాను."

—"మీరు లేవటానికి వీల్లేదు. వీళ్ళు మానవులు కారు పశువులు. పశువులు నయంతో చెబితే మాటవినవు. వీళ్ళకు నా తడాకా చూపిస్తాను" అన్నాను.

నా కోపంచూసి వాళ్ళేమనుకున్నారో మళ్ళీ మాట్లాడ లేదు. తరువాత స్టేషన్‌లో దిగి వెళ్ళిపోయారు. ఆయన అన్నారు— "నీకు చాలా మొండిధైర్యం. ఒకవేళ నన్ను వాళ్ళు లేపి వుండే వాళ్ళేననుకో అప్పుడేం చేసేదానివి ?

నేను : "బండిలోనుండి బయటకు నెట్టేదాన్ని."

ఆయన : "అప్పుడు నిన్ను జైలుకు పంపేవాళ్ళు. పురి శిక్ష కూడ పడేది."

నేను : "అయితే అయ్యేది. కోపంలోవున్న వ్యక్తి అదంతా ఆలోచించదు."

ఆయన : "మొత్తంమీద గయ్యాళిదాని వనిపించావు."

నేను : "నేను మీలాగ రచయతనుకాదు. అసలు వాళ్ళంత అసభ్యంగా ఎందుకు ప్రవర్తించాలి. మీకు జబ్బుగా వున్నదనీ, నేను ఆడదాన్ని, ఏమీ చేయలేననేగదూ? నేనూ చూపించ దలచాను ఆడది ఏం చేయగలుగుతుందోనని. మర్యాదగా స్థలం అడిగితే నేనే ఇచ్చేదాన్ని."

ఆయన : "ఏమన్నా చెప్పు. నువ్వుమాత్రం గయ్యాళివే."

నేను : "నేను మాత్రం కాదన్నానా!"

## గో ర ఖ పూ ర్

గోరఖపూర్ బదిలీ అయింది. టికెట్టుది కొన్న తరువాత క్వార్టరు ఖాళీ కాలేదని తెలిసింది. ఒకరోజు ఎలాగో స్కూల్లోనే గడపొచ్చని బయలుదేరి వెళ్ళాము. స్కూలుకు వెళ్ళగానే మా చుట్టూ పిల్లలు మూగారు. ఒక మాష్టరు మమ్మల్ని వారింటికి తీసుకెళ్ళారు. ఆ రాత్రే 'ధున్నా' పుట్టాడు. రెండోరోజు క్వార్టరు ఖాళీఅయింది. ఆ మాష్టరు అందులోకి వెళ్ళి మాకు ఆ ఇల్లే ఇచ్చేశాడు. 'ధున్నా'కు బారసాల జరిపించతరువాత మేము క్వార్టరుకు వచ్చేశాము. ఆ నెల్లోనే 10 రూపాయలు ఇన్క్రిమెంటు వచ్చింది. ఆయన బి. ఎ. చదవటం ప్రారంభించారు.

ధున్నాకు ఎనిమిదవ మాసం. అప్పుడే నా కాలికి గడ్డ లేచింది. అప్పుడే ఆయనకు అలహాబాదు వెళ్లి (First aid) ప్రథమచికిత్స నేర్చుకోవటానికి ఆర్డరు వచ్చింది. ఆ తరువాత 10 రూపాయలు జీతంకూడ పెంచుతారట. నాకు గడ్డ లేచిందని ఆయన వెళ్ళ నన్నారు. చివరకు నా బలవంతంమీద హెడ్‌మాష్టరు బలవంతం మీద వెళ్ళక తప్పిందికాదు. హెడ్‌మాష్టరు రోజూవచ్చి నన్ను చూసి వెళుతుండేవాడు.

గోరఖపూర్‌లో ఒక నెల వంటరిగా వున్నా నాకు ఎలాంటి కష్టమూ లేదు. స్కూల్లో వాళ్లంతా ఎంతో ప్రేమగా

ఆదరించేవారు. ఆయన వాళ్ళను ప్రేమించేవారు. అందువల్ల నే వాళ్ళంతాకూడ మమ్మల్ని ఆదరించేవారు.

ట్రయినింగు అయిం తరువాత ఆయన తిరిగొచ్చారు. 10 రూపాయలు జీతం పెరిగింది మొత్తం 70 రూపాయలు వచ్చేవి. 25 రూ॥లు లఖ్నోలో చదువుతున్న సోదరునకు పంపేవారు. ఆయన సవతితల్లీ, ఇద్దరు పిల్లలూ, ఆయనా, నేనూ, మొత్తం ఐదుగురం 45 రూపాయలతో జీవించేవాళ్ళం. డబ్బు పెత్తనమంతా మా అత్తగారిదే. మళ్ళీ ఇంట్లో గొడవలు ప్రారంభం. ఆయనకు ఇదంతా గిట్టేదికాదు.

చివరకు ఆయన బలవంతంమీద ఇంటికి కావాల్సిన డబ్బు నేనే వాడటం ప్రారంభించాను. నెల మొదట్లో 70 రూపాయలు తెచ్చి నా చేతిలో పోసేవారు. నేనే అంతా చూసుకొనేదాన్ని. ఆయన బాధ్యత కొంత తగ్గింది.

1916 నాటి విషయం. అది ఏప్రిల్ మాస మనుకుంటాను. ఆయన పెత్తల్లీ, వదినా వచ్చారు. ఆ గ్రామంలో ప్లేగు వుండటం వల్ల ఇక్కడకు వచ్చారు. వాళ్ళు రావటం ఆయన సవతితల్లికి ఇష్టంలేదు. రోజూ ఆయనకూ, ఆమెకూ పోట్లాట జరుగుతూ వుండేది, "నువ్వు సవతితల్లివయితే నాకు పెత్తల్లి, వదినా. నాకు అందరూ ఒకటే" అనేవారు.

ఆయన సవతితల్లికి, తన కొడుక్కి వుద్యోగంవస్తే ఆసంపాదన మే మెక్కడ తిని పోతామోనని భయం.

ఒకరోజు ఆయన నాతో అన్నారు— "నాకు ఒకరి సంపాదనతిని బతకాల్సిన గతి పట్టిననాడు విషం తిని చచ్చిపోతాను." అని. ఆ మాటే తన సవతితల్లి దగ్గరకూడ అన్నారు. తన తమ్ముడికి వుద్యోగం రాగానే వేరే కాపరంకూడ పెట్టిస్తానన్నారు.

ఆరోజుల్లోనే నా ఆరోగ్యంకూడ చెడిపోయింది. 'ఘన్నూ'కు ఎనిమిది నెలలు. డాక్టరు పోతపాలు పోయమన్నాడు. శేరున్నరపాలు

కొనేవాళ్లం. అందులో అర శేరు పాలు ఆయన సవతితల్లి తన కొడుక్కు ముందుగానే ఇచ్చేది. పిల్లకూ ఆయనకూ ఇవ్వగా పిల్లడికి రోజంతకు అర శేరు పాలుకూడ వుండేవికాదు. ఒకసారి నాకు కోపంవచ్చి అన్నాను- "ఇకనుండి ఇంట్లో ఎవరికీ పాలులేవు. పిల్లడికి కావాల్సిన పాలు మాత్రం కొంటాను" అని.

1916 లోన ఒకసారి ఆయన అక్కగారు తన ఇద్దరి పిల్లలతో వచ్చింది. రాగానే జబ్బుపడ్డారు. ఇన్ఫ్లుయంజా అందరికీ వచ్చింది. నేనూ జబ్బుపడ్డాను. ఇంటి పనంతా ఆయన మీద పడ్డది. అంత పనీ చేసి 'ధున్నూ'ని ఎత్తుకొని స్కూలుకు వెళ్ళేవారు. ఒంటిగంటకొచ్చి పిల్లలకు అన్నాలు పెట్టి, ధున్నూకు పాలు తాగించి, మళ్ళీ ధున్నూని ఎత్తుకొనిస్కూలుకెళ్ళేవారు. ఇంత పని మీదపడ్డా కొంచెంకూడ విసుక్కునేవారు కాదు. ఆయన సహనం చూసినాకు చాలా ఆశ్చర్యం కలుగుతుండేది.

రాత్రిళ్ళు ఇద్దరి పిల్లల్ని పడుకోబెట్టుకొని నిద్రపోయి లేచేప్పటికి ఆయన గుడ్డల్ని వాళ్లిద్దరూ బాగా తడిపేసేవాళ్ళు.

ధున్నూ పుట్టినప్పటినుండి మొదటి పిల్లను తనకు అలవాటు చేసుకున్నారు. ఆ పిల్ల పనంతా తనే చూసుకొనేవారు. తరువాత మూడు సంవత్సరాలకు ఇంకొక పిల్లవాడు జన్మించినప్పటినుండి ధున్నూను కూడ తనే చూసుకొనేవారు. ఆయనకు విసుకనేమాటే లేదు.

మూడవ పిల్లవానికి పదకొండవనెల్లో పెద్దమ్మవారువచ్చింది. బొబ్బలరంగు నల్లగా వుండటచూసి ఆయనతో డాక్టర్ను పిలవమని చెప్పాను.

ఆయన తన చదుకొనే గదిలోకి వెళ్లి ఒక పుస్తకం ఏదో చూసొచ్చి అన్నారు — "పిడు బతకటం కష్టం."

"ముందు మీరు డాక్టర్ను పిలవండి" అన్నాను.

"డాక్టర్ని పిలుస్తాలే. జనన మరణాలు సృష్టినైజం" నాకు ధైర్యం చెప్పేధోరణిలో అన్నారు.

అప్పుడే వెళ్ళి తన సవతితల్లికి టెలిగ్రాం ఇచ్చివచ్చారు. ఆమె రాగానే అన్నారు. "నువ్వు పిల్లనూ, పిల్లడినీ పెట్టుకొని బయట హాలు పక్కనున్న గదిలో వుండు. నాకు వీళ్ళందర్నీ ఇంటినుండి ఎక్కడికైనా దూరం పంపాలని వుంది."

"ఇంట్లో అమ్మవారున్నప్పుడు ఎక్కడికీ వెళ్ళకూడదు." అని ఆమె చెప్పింది. పెద్దపిల్లలిద్దర్నీ పెట్టుకొని ఆమె వేరుగా వుంది.

పదకొండవ రోజు రాత్రి పిల్లవాడు చనిపోయాడు. ఏడుస్తున్న నన్ను చెయ్యిపట్టుకొని ఆగదినుండి బయటకు తీసుకొచ్చి, ఓదారుస్తూ అన్నారు. "ఏడ్చేంలాభం చెప్పు? అయినా వాడివల్ల నీవేంసుఖం అనుభవించావు? పుట్టినప్పటినుండి ఒకటే జబ్బులు. నేను ఇంకా బ్రతికేవున్నాను. నన్ను చూసైనా నీదుఃఖాన్ని మర్చిపో" అని.

ఆ రాత్రంతా నా దగ్గర కూర్చొనే వున్నారు. ఉదయం శవాన్ని తీసుకెళ్ళిన తరువాత ఆ గదిలో వాడికిసంబంధించిన వస్తువులన్నీ తీసేశారు. ఫెనాయిల్ వేసి కడిగించి, సాంబ్రాణిపొగ వేసి, కర్పూరం వెలిగించారు. తరువాత ఆ గదికి తాళం వేశారు. తొమ్మిది మాసాలవరకు ఆ గదిని అలాగేమూసి వుంచారు.

ఆతరువాత ఆయనకూడ జబ్బుపడ్డారు. ముందు తొట్టిస్నానం ప్రారంభించారు. కాని దానివల్ల పొట్టపెరగటం ఎక్కువయినందువల్ల అది ఆపేశారు. అప్పుడప్పుడు కడుపులో నొప్పికూడ వస్తుండేది. ఆయనకు మందు తినటమంటేనే ఇష్టముండేది కాదు.

నేను ఆయనఅనారోగ్యవిషయం మానాన్నకు రాశాను. రెండు రోజులకు నా సోదరుడు వచ్చాడు. ఆయనతో అన్నాడు– "నాన్నగారు మిమ్మల్ని సెలవుపెట్టి కొద్దిరోజులపాటు అలహాబాదు వచ్చి వుండమన్నారు. అక్కడే మీకు మందుకూడ ఇప్పించదలచారు."

ఆయన : "ఎన్ని రోజులని ఈ మందులు తింటూ కూర్చోవటం ?"

నా సోదరుడు : "లేదు మా నాన్న మిమ్మల్ని తప్పక తీసుకు రమ్మన్నారు."

ఆయన : "నేను రాలేను. మీరు మందు ఇప్పించదలచిన డాక్టర్ను ఇక్కడకే పంపండి. కావాలంటే నువ్వు కూడవచ్చి ఇక్కడే వుండు."

నా సోదరుడు : "అలహాబాదు నుండి ఇక్కడకు డాక్టర్ను తీసుకురావటం మాటలా ? మీరే అక్కడకు రండి."

ఆయన : "మీ నాన్నగారితో చెప్పు నా ఆరోగ్యం చాలా బాగుందని."

నా సోదరుడు వెళ్లిపోయాడు. ఒక వారం తరువాత మళ్ళీ వచ్చాడు. ఈసారికూడ ఆయన అలహాబాదు వెళ్ళటానికి నిరాకరించారు.

మా ఇంటిమెట్లు చాలా ఇరుగ్గా వుండేవి. ఒకసారి పైనున్న మంచం కిందకూ, కిందవున్న మంచం పైకి మార్చవలసి వచ్చింది. ఆయన తన తమ్ముడిచేత ఆపని చేయించమని చెప్పి వెళ్ళిపోయారు. అతను తన అన్నచేతనే ఆపని చేయించమని అన్నాడు. నాకు చాలా కోపం వచ్చింది. చివరకు నేనే చేశాను. ఆయన స్కూలు నుండివచ్చి పై మంచాన్ని కిందకెవరు తెచ్చారని అడిగారు. నేనేనని చెప్పాను.

ఆయన అన్నారు — "నువ్వెందుకు తెచ్చావు! నేనే చేసేవాడినిగా ?"

"అవును. అన్నీ మీరే చేస్తుండండి. ఈ చిన్నచిన్న పనులు ఇంట్లో కూర్చుని తినేవాళ్ళు చెయ్యలేరా ?" అన్నాను.

ఆయన : "ఎవరిష్టం వాళ్ళది. ఇందులో బలవంతం ఎందుకు?"

నేను : "తలా కపని చూసుకుంటే కుటుంబం సరిగా నడుస్తుంది. అన్నిపనులూ ఒక్కరే చేయాలంటే ఎలా ? మీ తమ్ముడు ఆమాత్రం పనిచేయలేడా ?

ఆయన: "పోనిద్దూ. బలవంతంమీద ఎంతవరకని చేయిస్తాం?"

నేను: "అయితే, అనుభవించండి ఎవరికేం?" అన్నాను.

'నేనూ, నాఇంట్లో మహారాజునే'

అది చలికాలం. స్కూల్లో ఇన్‌స్పెక్షన్ జరుగుతుంది. ఒక రోజంతా ఆయనకు స్కూల్లోనే జరిగిపోయింది. రెండోరోజు మధ్యాహ్నానికి తన పని పూర్తిచేసుకొని ఇంటికొచ్చారు. సాయంత్రం ఆయన వరండాలో కూర్చొని పేపరు చదువుకుంటుండగా ఇన్‌స్పెక్టర్ మా ఇంటిముందునుంచి గుర్రంమీద వెళ్ళాడు. తన్ను చూడగానే ఆయన లేచి నమస్కారం చేస్తారని అతని అభిప్రాయం. కాని ఆయన లేవలేదు. కొంచెం దూరంపోయి ఆగి ఆయన్ను పిలవమని ఒక నౌకర్ను పంపాడు.

ఆయన వెళ్ళి "ఏమను పిల్చారు?" అని అడిగారు.

"నీవు చాలా గర్విష్టిలా కన్పిస్తున్నావు! నీ ఆఫీసరు నీ ముందు వెళ్తుంటే లేచి నమస్కారం చెయ్యనవసరం లేదా?" అని అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"నేను మీ స్కూల్లో వున్నంతవరకే మీ నౌకరును. నా ఇంట్లో నేనూ మహారాజునే." అని జవాబిచ్చారు ఆయన.

అతడు వెళ్ళిపోయింతరువాత ఆయన మానసష్టం దావా వేస్తానని తన స్నేహితులతో అన్నారు. కాని అందరు వద్దని సలహా ఇచ్చారు. ఈ సంఘటన ఆయన్ను చాలా రోజులు బాధించింది.

ప్రతి నెలా 25 రూపాయలు బ్యాంకిలో కట్టించేదాన్ని. ఒక సారి 80 రూపాయలు బ్యాంకులో కట్టమని ఆయనకిస్తే ఇంత డబ్బు నీ కెలా వచ్చిందని అడిగారు. ప్రతినెలా ఇంటి ఖర్చులు కొన్ని తగ్గించి పొదుపు చేశానని చెప్పాను. ఆ రోజునుండి బజారునుండి సామాను తీసుకురాగానే ఒక్క కానీ మిగిలినా నా చేతికిచ్చేవారు. నన్ను ఎన్నడూ డబ్బు లెక్క అడగలేదు. ఏ పనీ నన్ను సలహా అడగకుండా చేసేవారు కాదు. ఇదంతా ఆయన మాంపటి తల్లికి

గిట్టేదికాదు. తిండి విషయంలో చిన్న పిల్లవాడే! ఏది పెడితే అదే పలక్కుండా తిని వెళ్ళేవారు.

మేము గోరఖ్‌పూర్‌లో వుండగా మాఇంట్లో ఒక ఆవు వుండేది. అది ఒక రోజు కలెక్టరుగారి బంగళాలో ప్రవేశించింది. కలెక్టరు ఆయన్ని వెంటనే రమ్మనీ లేకపోతే అవును కాల్చేస్తాని కబురు పంపాడు. అది విన్న స్కూలు పిల్లలంతా ఉద్రేకంతో అరుస్తూ మా ఇంటిముందునుండే కలెక్టరు బంగాళావైపుకు బయలు దేరారు. ఆయన గదిలో కూర్చుని రాసుకుంటున్నారు. నేను వెళ్లి ఆయన్ను బయటకు పంపించాను. కలెక్టరు బంగళా దగ్గరకెళ్లి "మీరంతా ఇక్కడెందుకు చేరారు ?" అని పిల్లల్ని ఆయన అడిగారు.

"దొరగారి బంగళాకు మీ ఆవు వచ్చిందంట. దాన్ని అతను కాల్చేస్తానన్నాడట" అన్నారు పిల్లలు ఉద్రేకంతో.

"అయితే నాకెందుకు చెప్పలేదు ?"

"మీదాకా ఎందుకు మేము చాలమా అని!"

"ఒకవేళ కాల్చేస్తాడే అనుకోండి. మీరేం చెయ్యగలరూ."

"కాల్చేయటం మాటలా ? రక్తపుటేరులు ప్రవహింప చేయం ?" అన్నారు పిల్లలు ఆవేశంతో.

ఆయన పిల్లల్ని శాంతింపజేసి కలెక్టరు దగ్గరకు వెళ్ళారు. "మీరు నన్ను పిలిపించిన కారణం ?" ఆయన అడిగారు.

"మీ ఆవు నా బంగళా ప్రవేశించింది. మేము ఇంగ్లీషు వాళ్ళం కావాలంటే నీ ఆవును కాల్చగలనని తెలుసా ?" అన్నాడు కలెక్టరు."

"మీరు ఆవును కాల్చదలుచుకుంటే నాకెందుకు కబురు పంపారు ?"

"నేను కలెక్టర్ని ! ఏమయినా చెయ్యగలను ?"

"మీరు కలెక్టరనీ, ఇంగ్లీషువాళ్ళనీ, ఆవును కాల్చగలరనీ, కూడా నాకు తెలుసు. కాని, ప్రజల శక్తిముందు ఇవేవీ బలమైనవి

కావని తెలుసుకోండి !" అన్నారు ఉబికివొస్తున్న ఉద్రేకాన్ని అణుచుకుంటూ.

"ఈసారికి వదిలేస్తున్నాను. ఇకముందు నీ ఆవును భద్ర పరుచుకో !" అన్నాడు కలెక్టరు.

"మీరు ఆవును కాల్చండి కాని నన్ను మాత్రం పిలిపించకండి" అని బయటకు వచ్చేవారు.

హోళీ పండుగ :

గోరఖపూర్‌లో మాష్టరుగావున్న రోజుల్లో ఆయనకు హోళీ పండుగంటే చాలా ఇష్టంవుండేది. రెండురోజులు ముందురుంచే, రంగూ, గులావ్, మిఠాయీ, భంగ్ అన్నీ సిద్ధంచేసి ఉంచుకోనే వారు. పిల్లలందర్నీ చేర్చి రంగులు కొట్టుకోవటం, భంగ్ తాగటం, మిఠాయితినటం, మొదలైనవాటితో పండుగరోజు చాలా ఉత్సాహంగా గడిపేవారు. అలాంటి సమయాల్లో ఆయన పాటలుకూడా పాడేవారు. ఒకోసారి ఇద్దరంకలిసి కూడా పాడేవాళ్ళం !

కలకత్తాలో ప్రెస్ కొనాలనే ప్రయత్నం

ఆ రోజుల్లో ఆయనగారి మారుటితమ్ముడు కలకత్తాలో ఉద్యోగం చేస్తున్నాడు. ఒకసారి ఉత్తరం రాశాడు. అక్కడొక మార్వాడీతో కలిసి ప్రెస్ కొనాలనుకుంటున్నాననీ, ఆ మార్వాడీ తొమ్మిదివేలు పెట్టుబడి పెడతాడనీ, మనం నాలుగున్నరవేలు పెడితే చాలుననీ రాశాడు.

నేను బ్యాంకీలో వేసిందీ, ఇంకొకరికి నోటురాసీ మొత్తం మూడువేల రూపాయలు చేర్చాము. ఆయన తన పెద్దతండ్రి కొడుకుని వెయ్యిన్నర అప్పు అడిగారు. వెయ్యిరూపాయలు పంపి మిగతా ఐదువందలూ త్వరలోనే పంపుతానని రాశాడు. ఒకరోజు ఆయన్ని డబ్బు ఏపనిమీద పంపిస్తున్నారని అడిగాను.

"పని ఏమిటి? వచ్చిన లాభంలో సగం మనకు !" అన్నారు.

"అలాగా కాదు. పనీ, మేనేజిమెంటూ వాళ్ళు చూసు కుంటారు. ప్రెస్ మాత్రం ధనూ్నా పేరుమీద వుండాలి" అన్నాను.

"వాడికి కోపం వస్తుందేమో ?" అన్నారు.

"రానివ్వండి ! మీదగ్గరవుంటే తమ్ముడికి పెట్టుబడి పెట్టండి. కాని ఈ డబ్బుమాత్రం ఈ వస్తుమీద ఇవ్వాల్సిందే" అన్నాను ?

"సరే ! నువ్వు ఇలా అంటున్నావని వుత్తరం రాస్తాను !"

"రాయండి ! అలాంటి మొహమాటాలు నాకేంలేవు. మీలాగ కళ్ళు మూసుకొని అందర్నీ నమ్మను."

నాలుగోరోజు మా వుత్తరానికి జవాబు వచ్చింది. తనను అక్కడ అందరూ ఎగతాళి పట్టిస్తున్నారనీ, తనకుమాత్రం ధనూ్నా కంటే కావాల్సినవాళ్ళింకెవరున్నారనీ, తనను నమ్మలేనందుకు విచారంగావుందనీ రాశాడు ఆయన తమ్ముడు. ఈ ఉత్తరానికి జవాబేం రాయమంటావని అడిగారు.

నేను అన్నాను : "నేను రాసినట్లు రాయండి. ధనూ్నా కంటే నీకు కావాల్సిన వాళ్ళెవరూలేరు కాబట్టి ప్రెస్ ధనూ్నా పేరు మీదనే వుంటుందని రాయండి. వీలుంటే ఓసారి రమ్మనిరాయండి."

నేనుచెప్పినట్లే రాశారు. మూడోరోజుకల్లా అతనువచ్చాడు. తనను అక్కడ అందరూ ఎగతాళి చేస్తున్నారని అన్నాడు.

"ఇందులో ఎగతాళి చేయాల్సిందేముంది? అదీకాక మనం కోమట్లము. కోమట్లలో తండ్రీ కొడుకులమధ్యకూడ లెక్క లుంటాయని ఎవరికి తెలియని విషయం?" అన్నాను.

"ఈవస్తుమీద నేను డబ్బు తీసుకోలేను" అన్నారు.

"నేనూ ఇవ్వదలుచుకోలేదు" అన్నాను.

"ఈ విషయంలో నేనేమీ చెయ్యలేనందుకు విచారిస్తు న్నాను."

"విచారించ నవసర లేదు. మీ అన్నగారు పంపిన డబ్బు పంపించండి" అన్నాను.

"పంపిస్తాలే !" అన్నాడు నిర్లక్ష్యంగా.

"పంపిస్తాలే కాదు. పంపాలి వెంటనే !" అన్నాను.

ఉద్యోగానికి రాజీనామా

1920 లో 'సహాయనిరాకరణ' ఆందోళన ప్రారంభమైంది. గాంధీజీ గోరఖ్‌పూర్ వచ్చారు. అందరం సభకు వెళ్ళాము. ఆయన ఉపన్యాసపు ప్రభావం మామీద బాగా పడింది. అప్పటినుండీ ఆయనకు ప్రభుత్వోద్యోగం అంటే అసహ్యం ఏర్పడింది. రెండు సంవత్సరాల కిందట బి. ఏ. ప్యాసయారు. అప్పుడు ఎమ్. ఏ. కు చదువుతున్నారు. ఆరోగ్యం బొత్తిగా చెడిపోయింది. ఒకరోజున "మీరు మందు తింటారా లేదా ?" అని నిలదీశాను.

"మందువల్ల ప్రయోజనం ?" అన్నారు.

"నేను అడిగేదానికి బదులు చెప్పండి ! మందు తింటారా లేదా ?" అన్నాను కోపంగా.

"తినకపోతే ?"

"తినకపోతే స్పష్టంగా చెప్పెయ్యండి ! ఒక తులం నల్లమందు తిని హాయిగా కళ్ళుమూసుకుంటాను, ఈ మీ అవస్థను చూడకుండా !" అన్నాను.

"సరి నీ ఇష్టం. నామాట విశ్వసించుకోవు !"

"రేపటినుండే తినాలి !"

"రేపటినుండే తింటాను."

తెల్లవారి ఒక నాటువైద్యుని దగ్గరనుంచి మందు తెప్పించాను. విరోచనాలు చాలా ఎక్కువగా అవుతున్నాయి. వైద్యుడు భయంలేదని చెప్పాడు. ఎనిమిదవరోజుకు కొంచెం తగ్గాయి. క్రమేణా ఆరోగ్యం బాగుపడ సాగింది.

ఒకరోజు తనకు సర్కారు ఉద్యోగం చెయ్యటం ఇష్టంలేదనీ, ఆ విషయంలో నా అభిప్రాయం ఏమిటనీ అడిగారు. నేను నాలుగు రోజులుపోయాక చెబుతా నన్నాను. బుర్ర బద్దలుకొట్టుకున్నా ఒక

నిర్ణయానికి రాలేకపోయాను. నాకు డబ్బంటే ఆశ లేకపోలేదు. బి. ఏ. చదివితే జీతం పెరుగుతుందనే ఉద్దేశంతోనే ఆయన అంత కష్టపడి బి. ఏ. పాసయ్యారు. ఉద్యోగం వదిలేస్తే గత్యంతరం? ఇద్దరు పిల్లలున్నారు. ఇంకా పుట్టరనే నమ్మకంమాత్రం ఏముంది? ఒక నిర్ణయానికి రాలేకపోయాను.

నాలుగైదు రోజుల తరువాత మళ్లీ ఆయన నా నిర్ణయాన్ని అడిగారు. ఇంకోరోజు సమయంచూసి అడిగాను. ఆ రోజంతా ఆలోచించాను. ఆయన ఇంత జబ్బుచేసి బతికి బయటపడ్డారు. జబ్బులోవుండగా "మూడువేల రూపాయలూ, ముగ్గురు పిల్లలూ ఉన్నారు ఏంచేస్తావో" అన్నారు. భగవంతుని దయవల్ల ఆ గండం గడిచింది. ఆయనకు ఈ బుద్ధికూడ మంచికే పుట్టిందేమో! ఇలాగా ఆలోచించాను. అంతకు కొద్దికాలం క్రితమే 'జలియన్‌వాలాబాగ్ హత్యాకాండ' కూడ జరిగింది. బహుశా నా హృదయాంతరాళాల్లో కూడ తెల్ల ప్రభుత్వంపట్ల ద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతూవుండి వుండ వచ్చును! చివరకు ఆయనతో "సర్కారు ఉద్యోగం వదిలేయండి! ఈ ప్రభుత్వాన్ని తుదముట్టించే బాధ్యత మనందరిమీదా వుంది" అన్నాను.

"ఈ లోపల మన పని ఏమవుతుందో ఆలోచించావా?" అన్నారు నవ్వుతూ.

"ఆఁ అంతా ఆలోచించాను. భగవంతుడు మీకు ఆరోగ్యాన్ని మంచికే ఇచ్చాడు" అన్నాను.

"బాగా ఆలోచించు! తరువాత నన్ను నిందించి ప్రయోజనం లేదు. బహుశా తిండికూడ దొరకదేమో!" అన్నారు.

"బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను."

"అయితే రేపే రాజీనామా ఇచ్చేస్తాను. బహుశా రేపే ఈ ఇల్లుకూడా ఖాళీచెయ్యాల్సి వుంటుందేమో! ఎక్కడికి వెళదాం?"

"మన ఊరు వెళ్ళిపోదాం!" అన్నాను.

"ఊళ్ళో మాత్రం మనకు ఇల్లెక్కడుంది? ఆ వున్న ఇంట్లో మా పిన్నివాళ్ళు ఉంటున్నారాయె?" అన్నారు.

"మనకు లేని ఇల్లు ఆవిడకు ఎక్కడనుంచి వచ్చింది? మనం సగం తీసుకుందాం ఆవిడకు ఇష్టమయితే మనతో వుంటుంది. లేకపోతే వెళ్ళిపోతుంది!" అన్నాను కోపంతో.

"సరకారు ఉద్యోగాలు ఇంతమంది చేస్తుండగా మీకే వేమొచ్చింది అసవుగదా తరువాత?" అన్నారు.

"ఎందుకంటాను? అందరిలో ఇంత త్యాగం వుండొద్దూ?"

"ఇందులో నువ్వు ఊహించే త్యాగం. తపస్సూ ఏమీ లేవు. ఇది మన పాపాలకు ప్రాయశ్చిత్తం మాత్రమే."

"మన మేం పాపం చేశాం?" అన్నాను ఆశ్చర్యంగా.

మనం కాకపోతే మన పెద్దలు చేశారు! మన పూర్వుల తెలివితక్కువల్లనే దేశంలో అంజడి ఆరంభమైంది. భోగవిలాసాల్లో ఒళ్ళు మర్చిపోయి దేశాన్ని అన్యాక్రాంతం చేశారు. లేక ఈ విజేతలు తమ శక్తిసామర్థ్యాలతో దేశాన్ని జయించారా?" అన్నారు.

"ఈ విజేత కళ్ళు గర్వంతో మూసుకుపోతున్నాయి."

"నువ్వు పొరపడుతున్నావు. విజేతలు ఎప్పుడూ గర్వాంధులుగానే వుంటారు అలా లేకపోతే వాళ్ళు దేవతలే! కాని, పరాజితులైన మన సోదరులకు గర్వం తక్కువుందా? తెల్లవారికంటే తెల్లవారి సేవకావృత్తిని సంపాదించిన మన ఇండియాబాబులు రొమ్ము విరుచుకు తిరుగుతున్నారు. చదరంగంలో చూడు! సిపాయి మంత్రి కాగానే వంకర టింకరగా నడుస్తాడు. మనకు స్వరాజ్యం లభించడం కంటే భావదాస్యంనుంచి విముక్తిపొందటం కష్టతరమైనది" అన్నారు.

మహావీరప్రసాద్ పోద్దార్‌గారి ఇంట్లో రెండు మాసాలు సుఖంగా గడిపాము. పోద్దార్‌గారితో కలిసి చరఖాల వ్యాపారం పెట్టారు. కొన్ని మగ్గాలు పెట్టించి ఖాదీ నేయించారు. కొంతమంది

స్త్రీలను రోజుకూలిమీద నూలు వడకటానికి పెట్టారు. చరఖాలు కూడ అమ్మేవారు. సాయంకాలాల్లో ఆయన స్నేహితులూ, పోద్దార్ గారూ, అందరూ కూర్చొని కబుర్లు చెప్పుకొనేవారు.

ఒకరోజు కూర్చొని మాట్లాడుకొంటున్న సమయంలో ఆకాశంలో ఎర్రటి మేఘాలు వ్యాపించాయి. ఆయన నాతో గాలీ వాన వచ్చేలాగుంది. త్వరగా భోజనం చెయ్యమని చెప్పారు. నేను పళ్ళెంముందు కూర్చోగానే గాలివాన ప్రారంభమైంది. పిల్లలున్న గదిలోకి పరుగెత్తుకెళ్ళాను. ఆయనకూడ వచ్చారు. బయట పెద్దపెద్ద రాళ్ళు (వడగళ్ళు) పడుతున్నాయి. నేను వరండాలోకి పరుగెత్తుకెళ్ళి ఆయన రాసిపుంచిన కాగితాలను తీసుకొచ్చి బల్లకింద పడేశాను. ఇంతలో కప్పును చీల్చుకుంటూ రాళ్ళు పడసాగాయి. ఆయన గాబరాగా "చూడు రాణీ! పిల్లల తలలుగాని పగల్లేదుగదా !" అన్నారు. వెంటనే ఇద్దరం ఒక శాలువా పట్టుకొని పిల్లల మంచానికి చెరి ఒకవైపూ నిల్చున్నాము, పిల్లల తలకాయలను రక్షించటానికి. మా తలలను రక్షించుకోవటం ఎలా ? మా యిద్దరి తలలకూ రాళ్లూ తగిలాయి. వెంటనే నేను పిల్లల్ని ఒక బల్లకిందకు నెట్టి ఆయన్నుకూడ బల్లకిందకు దూరమన్నాను. తరవాత నేనూ, నౌకరూకూడ ఆ బల్లకిందనే ఇరుక్కున్నాము. కొంచెం సేపటికి రాళ్ళు పడటం ఆగిపోయింది.

"నీకు వున్న సమయస్ఫూర్తి నాకు లేదు. ఇవ్వాళ నువ్వు సమయానికి లేకపోతే ఒకరిద్దరి తలలు తప్పక పగిలిపోయివుండేవి !" అన్నారు.

పిల్లల్ని నిద్రపుచ్చి రాళ్ళను చూట్టానికి మే మిద్దరం బయటకు వెళ్ళాము. నడుం ఎత్తున రాళ్ళు పడివున్నాయి రోడ్డుమీద. ఇంతలో ఆయన-"అరెరె! నా కాగితాలన్నీ కొట్టుకుపోయాయి !" అన్నారు.

"బల్లకింద సురక్షితంగా వున్నాయి" అన్నాను.

ఒకసారి ఏం జరిగిందంటే— ధున్నా చిన్నపిల్లడు. ఒక వ్యాసం రాసి టేబుల్ మీద పెట్టిలోపల కొచ్చారు. ధున్నా

చిన్నగా అక్కడ కెళ్ళి కాగితాలు చింపటమే కాకుండా సిరాతో తడిపేశాడు. ఆయన అదిచూసి ధున్నూను కోపంతో కొట్టారు. వాడి ఏడుపు విని ఆయన అక్కగారితో అన్నారు: "చూడు వదినా ధున్నూ ఏడుస్తున్నాడెందుకో ?" అని.

"ఎందుకురా వాణ్ణి కొట్టావు ?" ఆమె అడిగింది తమ్ముణ్ణి.

"చూడు నా కాగితాలన్నీ ఎలాపాడుచేశాడో ? ఆవ్యాసాన్ని ఇవ్వాళ పేపరుకు పంపాలనుకన్నాను" ఆయన అన్నారు.

"పసిబిడ్డ వాడికేం తెలుసు ? చిన్నప్పుడు నువ్వూ ఇంతకంటే ఎక్కువ అల్లరిచేసినవాడివే !" అన్నది ఆమె.

"నేను రాసి ఉంచిన కాగితాలను ఎప్పుడైనా చింపానా?"

"నువ్వు చింపటానికి రాసేవాళ్ళుంటే గదూ ? రామూ చెవి కోయలా ! నీ వ్యాసం చెవికంటే ఎక్కువా ఏమిటి ?"

ఆయన మెదలకుండా కూర్చున్నారు. ఆ తరువాత కొద్ది రోజులకే మేము లమహీ వెళ్ళాము.

లమహీ: కాన్పూర్:

లమహీ (బనారస్) వచ్చిన తరువాత, ఆయన ఒక పత్రికకు ప్రతినెలా రెండు వ్యాసాలుకానీ, రెండు కథలుకానీ రాసి ఇచ్చేవారు. పత్రికవాళ్ళు నెలకు నలభై రూపాయలు ఇచ్చేవాళ్ళు. అది కాక వేరే పత్రికలకు రాస్తుండేవారు.

ఉదయం కాలకృత్యాలు తీర్చుకున్నతరువాత, ఫలహారం చేసి రాయటానికి కూర్చొనేవారు. పన్నెండుగంటలకు లేచి భోజనం చేసేవారు. భోజనానంతరం ఒకగంట విశ్రాంతి తీసుకొనేవారు. మళ్లీ రెండు గంటలకు రాయటానికి కూర్చొనేవారు. సాయంకాలం ఏదైనా కొంచెం 'టిఫిన్' తీసుకొని పిల్లల్ని ఆడించేవారు. అదే సమయంలో వాకిట్లో కూర్చొని బాతాఖానీ వేసేవారు. ఊళ్ళో వాళ్ళు ఎంతో మంది వస్తుండేవాళ్లు. ఇదీ ఆయన జీవిత కార్యక్రమం.

ఒకసారి ఆ ఊరి జమీందారుని అడిగి ఉచితంగా కొయ్య తీసుకున్నారు. ఇద్దరు వడ్రంగులను స్వంత ఖర్చుతో పిలిపించి, రాట్నాలు చేయించి ఆ ఊళ్ళోవాళ్ళకు పంచిపెట్టారు. నూలు ఎలా వడకాలోకూడా నేర్పించారు. ఇలా రెండుమాసాలు గడిచి పోయాయి.

ఒకరోజు నేను వేడివేడి రొట్టెలు చేసి ఆయనకు పెట్టాను. నెయ్యి వెయ్యలేదేమని అడిగారు. ఇంట్లో లేదన్నాను. ఆయన తన పిన్నినిపిల్చి అడిగారు: "ఇంట్లో నెయ్యి ఎందుకు లేదు ?"

"ఒక్కరోజు నెయ్యి లేకుండా తినలేవా ?" అన్నది ఆమె.

"ఒకరోజు నెయ్యా, ఒకరోజు కూరా, ఒకరోజు పప్పూ, ఈవిధంగా రోజూ ఏదో ఒకటి లేకుండా చేస్తావు ? ఎందుచేత ?" అన్నారు కోపంగా.

"దానికి నన్నేం చెయ్యమంటావు ?" అన్నదామె.

ఆయన కోపంతో పళ్లెం ముందునుంచి వెళ్ళిపోయారు. అందరూ భోజనం చేశారు. నాకు వంటఇంట్లోనే అడుగుపెట్టబుద్ధి పుట్టలేదు. అర్ధరూపాయి నెయ్యి తెప్పించాను. ఎండలో మినప్పప్పు రుబ్బి గారెలూ, హల్వా చేశాను. భయపడుతూనే ఆయనదగ్గరకు తీసుకెళ్ళాను. "ఇప్పుడు నేను ఏమీ తినను !" అన్నారు. "ఎంతో కష్టపడి చేశాను ఇంతవరకు నేనూ ఏమీ తినలేదు !" అన్నాను. మారుమాట్లాడకుండా తిన్నారు.

ఆ తెల్లవారే మా నాన్న చనిపోయారని వచ్చింది; అలహా బాదు వెళ్లాము ఒకవారం తరవాత ఆయన కాన్పూరు వెళ్ళారు. అక్కడ ఒక మార్వాడీ విద్యాలయంలో హెడ్‌మాస్టరు చోటు ఖాళీ వుందనీ, ఆయన్ను ఆపని చెయ్యమనీ కోరారు. దాని మేనేజరు, గణేశ్ శంకర్ విద్యార్థీజీకి మిత్రుడు. ఆ ఉద్యోగం చెయ్య టానికి ఆయన అంగీకరించారు. అది 1921 జూన్‌లో జరిగింది. జూలై నుండి ఉద్యోగంలో ప్రవేశిస్తానన్నారు. తరువాత బనారస్ వెళ్ళాము.

జూలై ఐదవ తేదీన కాన్పూరు ప్రయాణం అయాము. అప్పుడు నేను గర్భిణీతో వున్నాను. ఆయన పిన్నమ్మ నన్ను అక్కడఉంచి వెళ్ళమంది.

"ఉంచను. అసలే ఆవిడ ఆరోగ్యం అంతంతమాత్రం. ఏ నిముషంలో ఏం జరుగుతుందో? తరువాత జీవితమంతా పశ్చాత్తాప పడాలి!" అన్నారు.

"ఎలాగ రాసిపెట్టుంటే అలాగే జరుగుతుంది. నువ్వు అడ్డు పడతావా?" అన్నది ఆమె.

"ఆ జరిగిదేదో నా కళ్ళయెదుటే జరిగితే పశ్చాత్తాపపడాల్సిన అవసరం వుండదు" అన్నారు.

"అప్పుడు నాకు కబురుచేస్తే నేను రాను" అన్నది ఆమె.

"అదంతా నీ ఇష్టాయిష్టాలమీద ఆధారపడి వుంది!"అన్నారు.

జూలై ఐదో తారీఖున మేము కాన్పూరు వచ్చాము. నా ఆరోగ్యం పూర్తిగా దెబ్బతినిపోయింది. పనిమనిషి ఒకరోజువస్తే ఒకరోజు వచ్చేదికాదు. ఏం తిన్నా అరిగేదికాదు. సగ్గుబియ్యం జావ తాగేదాన్ని. ఇంటిపనీ, స్కూలుపనితో సతమతమవుతూనే రాస్తూవుండేవాడు. ఒకరోజు నాకు ఎక్కువ విరోచనాలు అయాయి. తెల్లవారుఝామున నాలుగుగంటల ప్రాంతంలో బయటకు వెళ్లి పడిపోయాను. ఆయన పరుగెత్తుకొచ్చి నన్ను తీసుకెళ్లి మంచంమీద పడుకోబెట్టారు. నాకు కొంచెం స్పృహవచ్చినతర్వాత అన్నారు: "ఈ స్థితిలో నన్ను పిలవకుండా ఒంటరిగా ఎందుకెళ్ళావు?"

"మిమ్మల్ని కష్టపెట్టడం ఇష్టంలేక."

"చచ్చిపోయిన తరువాత శవాన్ని మోయించదలచుకున్నావా?"

"బలహీనంవల్ల పడిపోయాను. అంతమాత్రానికే చచ్చి పోతానా?"

"ఇప్పుడు చచ్చిపోయినంతపనీ అయింది."

ఆ తరవాత నెలా పదిహేను రోజులకు 'బన్నూ' పుట్టాడు. వాళ్ళ పిన్నమ్మ రావటమయితే వచ్చింది కాని, ఇరవయ్ రోజులకే వెళ్ళిపోయింది.

కాన్పూరు:

ఒకరోజు ఓ పెద్దమనిషి వచ్చాడు. అతని కోటు రైల్లో పోయిందనీ, అందులోనే పర్సుకూడా వుందనీ, 15 రూపాయలు అప్పు కావాలనీ అడిగాడు. ఇంకా, తను పెళ్లాం బిడ్డలను తీసుకు రావటానికి అత్తవారింటికి వెళుతున్నాననీ, మేముడబ్బు ఇవ్వకపోతే ఇక్కడే వుండిపోవాల్సివస్తుందని కూడా చెప్పాడు. ఆయన లోపల కొచ్చి నన్ను 15 రూపాయలు అడిగారు.

"నాదగ్గర ఎక్కడున్నయ్! స్కూలుపిల్లల ఫీజుమాత్రం వుంది!" అన్నాను.

"ఏదో ఒకటి ఇవ్వు! పాపం చాలా కష్టంలో వున్నాడు! అన్నారు.

"సమయానికి తిరిగి ఇవ్వలేకపోతే!"

"అదంతా తరువాత చూసుకుందాంలే!" అన్నారు.

నేను 15 రూపాయలు ఇచ్చాను. ఆ వచ్చిన పెద్దమనిషి డబ్బు తీసుకొని వెళ్ళిపోయాడు.

ఐదారురోజుల తరవాత అతను తన భార్యాబిడ్డలతో వచ్చి దిగాడు. మూడురోజులుండి మళ్ళీ 20 రూపాయలు అప్పడిగాడు. ఆయన భయపడుతూ భయపడుతూ నాదగ్గర కొచ్చి "మహాశయుడు మళ్ళీ 20 రూపాయలు అడుగుతున్నాడు, నే నేం చేసేది?" అన్నారు.

"ఏం చేస్తారో చెయ్యండి. నాకేం తెలుసు? ఫీజంతా ఖర్చు పెట్టుకూర్చుంటే సమయానికి కష్టపడతాము. అంతడబ్బు నాదగ్గర ఎక్కడ ఉంటుంది?" అన్నాను.

"డబ్బులేకపోతే ఇంకేం వీళ్ళందర్నీ మేపు!"అన్నారు.

"నాకేం తెలియదు. మీరే ఏంచేస్తారో చెయ్యండి!"

"డబ్బు యిచ్చేంతవరకూ వీళ్ళు కదలరు. నలుగురికి ఎన్ని రోజులని వండిపెడతాం చెప్పు! అదీగాక, అతను ఇంటికి వెళ్ళగానే పంపిస్తా నంటున్నాడాయె!" అన్నారు.

నేను 15 రూపాయలుమాత్రం ఇచ్చాను. అన్నరోజుకు డబ్బు పంపలేదు. ఇరవయ్ రోజుల తరవాత ఆయనకు ఉత్తరం రాయమని చెప్పాను: "నువ్వు చెప్పకుండానే ఇప్పటికి రెండు ఉత్తరాలు రాశాను!" అని అన్నారు ఆయన.

"ఇప్పుడైనా ఇంకెవరికీ అప్పు ఇవ్వనని ఒట్టేసుకోండి" అన్నాను.

"నీకేం ఇంట్లోకూర్చుని నువ్వు అలాగే చెబుతావు? ఎవరైనా వచ్చి అడిగితే ఎలా లేదనటం?"

"మీకేమీ కష్టసుఖాలు తెలియకుండా వున్నాయి. ఒక రూపాయి పెట్టెలో పెడితే పదిరూపాయలు అవుతాయని మీ ఉద్దేశం!" అన్నాను.

"అదే విధంగా నువ్వు పెట్టెలోనుంచి తీసి ఇస్తూనేఉంటావాయె! లేకపోతే నువ్వుమాత్రం ఎలా ఇవ్వగలవు?"

"నా కష్టాన్నికూడా కొంచెం ఆలోచించండి!"

"ఇదంతా నీ తప్పే! అందరికీ దాచుకోవటం తెలిస్తే.

నీకు ఇవ్వటం మాత్రమే తెలుసు! అందుకు నన్నేం చెయ్యమాంటావు?" అన్నారు నవ్వుతూ.

ఆ రోజునుండి నేను ఎవరికీ అప్పుఇవ్వలేదు. కాని తరవాత కొద్దిరోజులకు గ్వాలియర్ నుండి ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరం రాసిన పెద్దమనిషికి వందరూపాయల ఉద్యోగం ఒకటి వచ్చిందట. దానికి వందరూపాయలు అమానతు కట్టాలట.

ఆయన నాకు ఉత్తరం చదివివినిపించారు. అతనిమీద నిజానికి నాకే ఎక్కువ జాలివేసింది. మనం ఒక వందరూపాయలు అప్పుఇస్తే

వందరూపాయల ఉద్యోగం వస్తుంది. ఒకరి జీవితాన్నే బాగుచేస్తున్నాము అనుకొని వందరూపాయలు ఆయన చేతికిచ్చి మనియార్డరు చెయ్యమన్నాను.

"నెలకు 50 చొప్పున ఇచ్చిన రెండు నెలల్లో మనబాకీ తీరిపోతుంది!" అన్నారు ఆయన డబ్బుతీసుకుంటూ.

"అదంతా ఇప్పుడు ఆలోచించకండి పాపం! ఉద్యోగంవచ్చి అతడు బాగుపడటమే మనకు కావాల్సింది." అన్నాను.

డబ్బు పంపుతూ ఉత్తరంలో 'ఈడబ్బు నేనుకాదు, శివరాణీ పంపుతున్నది' అని రాశారు. అతడు తన కృతజ్ఞతను తెలుపుతూ ఉత్తరం రాశాడు. తనకు ఉద్యోగం దొరికిందని కూడా రాశాడు. నెలరోజులవరకు తరచు ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు.

తరవాత కొద్దిరోజులకు అతడు స్వయంగా నేవచ్చి దిగాడు. నెలరోజులు శెలవుపెట్టి వచ్చానన్నాడు. "మా అమ్మ చనిపోయింది. మా నాన్న రెండోపెళ్ళి చేసుకున్నాడు. ఇక నేను ఆ గడపతొక్క తలచలేదు. ఇదే నా ఇల్లుగా భావించుకుంటున్నాను" అన్నాడు.

రెండు మూడు రోజుల తరవాత ఈ పెద్దమనిషిని హోటల్లో ఉంచటం మంచిదని చెప్పాను ఆయనకు కూడా అదేమంచిదని తోచిందో ఏమో, రెండోరోజునుంచే హోటల్లో వుంచారు. పదిహేను రోజులవరకూ ఉన్నాడు. ఆ రోజుల్లో ఆయన 'హంస' అనే పత్రికను నడపాలని ఆలోచిస్తున్నాడు. ఆ పెద్దమనిషి అది విన్నాడు. మళ్ళీ ఇరవయ్ రోజులకల్లా వచ్చాడు. అప్పుడే కమల వివాహం చేశాము. ఆ సందర్భంలో ఓపదిహేను రోజులు ఉన్నాడు. మళ్ళీ 50 రూపాయలు అప్పుఅడిగాడు ఇచ్చాము. తరవాత అతను వెళ్ళిపోయాడు. ఆయనకూడా లఖ్నో వెళ్ళారు. నేనుమాత్రం ఇంటి దగ్గరనే వున్నాను.

ఆ తరవాత, అతడు పాట్నాలో వివాహం చేసుకున్నాడట. ఆ సందర్భంలో భార్యకు బంగారు గాజులూ, చెవులకు పోగులూ,

రెండు మూడు పట్టుచీరెలూ, పెండ్లి ఖర్చులకు వందరూపాయలూ ఇచ్చి పాట్నా వరకూ పంపించి వచ్చారు.

అతడు తన భార్యతో లఖ్నో వచ్చాడు. మూడ్రోజుకల్లా అతన్ని వెతుక్కుంటూ పోలీసులు వచ్చారు. అతను పరారి అయిన వ్యక్తట! ఆయన వెంటనే అతన్ని ఇంటినుండి వెళ్ళగొట్టారు. ఈ విషయమంతా ఆగస్టులో నేను లఖ్నో వచ్చినప్పుడు తెలిసింది. ఒకరోజు కంసాలి డబ్బుకు వచ్చాడు. ఆ కంసాలి చేతనే మా అమ్మాయికి నగలు చేయించాను.

"నీ డబ్బంతా ఇచ్చేశాంగా!" అన్నాను.

"ఆడబ్బు కాదండి! బాబుగారు ఒక బెంగాలీ బాబుకు నగలు చేయించి ఇచ్చారు" అన్నాడు కంసాలీ.

"ఆ బెంగాలీబాబు పంపించగానే ఇస్తాంలే" అన్నాను.

"అవును. ఉత్తరంకూడా రాశాను. పంపగానే ఇచ్చేస్తాను" అన్నారు ఆయన చిన్నగా.

కంసాలి వెళ్ళిపోయాడు. "అతడిదగ్గర డబ్బు లేకపోతే మీరెందుకు ఇప్పించారు?" అని అడిగాను.

"నువ్వు ఉద్యోగంకోసం వందరూపాయలిచ్చినట్లే నేనూ పెళ్ళికి నగలు ఇప్పించాను? నువ్వు వున్నట్లయితే ఆ పిల్ల నీ కాళ్ళు పిసికేది!" అన్నారు.

నేను జవాబు చెప్పలేకుండా అక్కడనుంచి లేచి వెళ్ళి పోయాను. ఒకరోజు బట్టలషాపువాడు వచ్చాడు. ఎందుకు వచ్చావని అడిగితే, 'బాబుగారు ఒక బెంగాలీ బాబుకు గుడ్డలు ఇప్పించారని చెప్పాడు. అతనికీ ఆ కంసాలికీ చెప్పిన మాటనే చెప్పి పంపించాను. ఆరోజు నేను చాలా విసుక్కున్నాను. ఆయన నాకు తెలియకుండా కథలురాసి ఎలాగో ఆ అప్పులు తీర్చారు. ఆ అప్పులు తీర్చటానికి దాదాపు రెండు సంవత్సరాలు కష్టపడ్డారు.

ఈవిషయం ఆయన స్వర్గస్థులైనతరవాత జైనేంద్ర చెప్పాడు. ఇంట్లో చెప్పవద్దని చెప్పారట.

ఇంకోక మహాశయుడు ఒకసారి రెండువందల రూపాయలు పుచ్చుకెళ్ళారు. అప్పుడు నేను జైల్లో వున్నాను. జైలునుండి వచ్చిన తరువాత ఆ డబ్బు విషయం అడిగితే ఖర్చుపెట్టేశానని చెప్పారు. కాని నేను నమ్మలేదు. చివరకు అసలుసంగతి బైటపెట్టారు. అందరి అవసరాలను తీర్చే కన్ట్రాక్టు తీసుకున్నారా అని అడిగాను.

"ఏం చెయ్యమంటావు? నేనుమాత్రం కోరి కష్టాల్లో చిక్కుకుంటున్నానా? అడిగితే లేదనటం చాతకావటంలేదు."

"మీకేం తెలుసు, సంసారాన్ని ఎంత పొదుపుగా ఈదుకొస్తుంటే ఆ డబ్బు మిగులుతుందో! ఒకప్పుడు మీరు ఒక్కొక్క దమ్మిడీకోరకు ఎంత కష్టపడ్డారు?"

"రాణీ! ఇకనుంచి ఆ మిగిల్చే డబ్బేదో నీ పేరనే బ్యాంకిలో కట్టుకో! ఆడవాళ్ళు డబ్బుచేరుస్తారు. నిజంగా ఇది చాలా మంచి అలవాటే!" అన్నారు.

"డబ్బు పొదుపుచేస్తుంది నా కోసంకాదు మీ కోసమే! ఇదివరలో డబ్బుకు ఎంత అవస్థపడేవారు? మిమ్మల్ని సుఖపెట్టాలని నేను నానాతిప్పలూ పడుతుంటే, మీరేమో నా దగ్గరే దొంగలాగ ప్రవర్తిస్తారాయె!" అన్నాను.

"నాకుమాత్రం నిన్ను మోసంచెయ్యాలని ఉంటుందా? ఈ దౌర్భాగ్యులు నా ప్రాణం తీసేస్తున్నారు" అన్నారు.

"ఇకనుంచి డబ్బు మీ చేతిమీదగానే వాడండి. ఇలాంటి చాటుమాటు పనులుచేస్తూ ఆత్మకు ద్రోహంచెయ్యకండి."

"నేను దొంగతనం చేసేది నీ దగ్గరేగా! నువ్వు నాకు అంత కఠినశిక్ష విధించవనికూడా నాకు తెలుసు" అన్నారు.

"ఇవ్వాల్టినుంచి మీ డబ్బులో నేను ఒక్క చిల్లికానీ అంటుకోను!" అన్నాను.

"ఇవ్వాల్టినుంచి నేను ఎవరికీ ఒక్క దమ్మిడీ ఇవ్వను! ఆ బరువూ భారమంతా నీకే వదిలేస్తున్నాను" అన్నారు.

*　　　*　　　*

'బన్నా' పసివాడు. వాడు ఏడుస్తుండే మా అమ్మాయివాడిని ఎత్తుకుంది. ఇద్దరూ పడ్డారు. బన్నా తలకు దెబ్బతగిలింది. మూడు రోజులవరకూ వాడు మంచంమీద పడుకోలేక పోయేవాడు. నేను వాడిని ఎత్తుకొనే వుండేదాన్ని ఆ మూడు రోజులూ ఆయనే వంట చేశారు మూడున్నరకు లేచేవారు. కొంతసేపు రాసుకుని తరువాత ధున్నాకు చదువు చెప్పేవారు. స్నానంచేసి స్కూలుకు వెళ్ళేవారు. స్కూలునుండి వస్తూ కూరగాయలూ అవీ కొనుక్కొచ్చేవారు. కొంచెంసేపు పిల్లల్ని ఆడించేవారు. ఇదీఆయన దైనిక కార్యక్రమము.

రోజూ కాంగ్రెసు సమావేశాలకు హాజరయేవారు. ఒకో సారి రాత్రిపదిగంటలకు ఇంటి కొచ్చేవారు. ఆలస్యంగావచ్చిన రాత్రిళ్ళు పనిచెయ్యలేక పోయేవారు, కాని మూడు గంటలకే లేచి చదవటం, రాయటం చూసుకొనేవారు. నేను పోట్లాడతాననే భయంతో శబ్దం చెయ్యకుండా లేచి పనిచేసుకొనే వారు. ఆ సంవత్సరంలోనే ఆషాఢమాసంలో బాగా జబ్బు పడ్డారు. తొమ్మిది రోజులయినా జ్వర తీవ్రత తగ్గలేదు.

పదోరోజు స్కూలు మాష్టర్లువచ్చి ఎలా వుందని అడిగారు.

"జ్వరం తగ్గలేదు. ఇది సన్నిపాతంలో లక్షణాలేమీ కన్పించటంలేదు" అన్నారు.

ఒక మాష్టరు వెళ్ళి వైద్యుని తీసుకొచ్చాడు. అతనిమందుతో జ్వరమైతే తగ్గింది. కాని రక్తవిరోచనాలు పట్టుకున్నాయి. పది రోజులవరకూ అవుతూనేఉన్నాయి. ఒకరోజుఆయన పాయఖానాలోకి వెళ్లారు. నేను తలుపుదగ్గర నిల్చున్నాను. ఏదో శబ్దమయితే తలుపు తెరిచాను. ఆయన మైకంగా పడిపోయి ఉన్నారు. ఎలాగో మంచం వరకూ తీసుకొచ్చాను. నౌకరుచేత ఒక మాష్టరుకు కబురు పంపించాను. మాష్టరు వైద్యుని దగ్గరమందు తీసుకొచ్చాడు. తరువాత విరోచనాలు తగ్గిపోయాయి కాని చాలా రోజులవరకూ బలహీనం వల్ల మెట్లు దిగలేకపోయేవారు.

అంత బలహీనంలో కూడ ఆయన రాయటం మానలేదు. నేను నిద్రపోయిన తరువాత చిన్నగా లేచి వెళ్ళి, కలం కాగితాలు తెచ్చుకొనికూర్చొనేవారు. మంచంమీద రోజాయి కప్పుకూర్చొని రాసేవారు. ఆరోజుల్లో 'ప్రేమాశ్రమము' రాస్తున్నారు. నేనుచూస్తే కొప్పడేదాన్ని.

"రాయటం లేదు. ఇంతకుముందు రాసింది చదువుకుంటు న్నాను" అనేవారు.

"ప్రపంచమంతా మిమ్మల్ని మోసంచేస్తుంటే మీరు నన్ను చెయ్యాలని చూస్తారు!" అనేదాన్ని.

ఒకనాటి స్వప్నంలో ఎవరో వచ్చి, వచ్చే జూలైనుండి ఆయన ఆరోగ్యం బాగుపడుతుంది అని చెప్పారు. మెలుకువ వచ్చింది. నాకు చాల సంతోషం కలిగింది. ఇంతకుముందు కూడా ఒకటి రెండు ఇలాంటి స్వప్నాలే వచ్చాయి. అవి నిజమయాయి కూడా.

"నిద్రపోతున్నారా?" ఆయన్ను పిలిచాను.

"లేదు, ఏం?"

"వచ్చే జూలైనుండి మీకు పూర్తిగా నయమవుతుంది."

"నిద్రలోకూడ నా అనారోగ్యంవల్ల పడే బాధను మర్చిపో లేకుండా వున్నావులాగుంది" అన్నారు.

"నేను చెప్పింది నిజమవుతుంది. రేపు పొద్దున్నే మీ డైరీలో రాసుకోండి, చూద్దాం నిజమవుతుందో కాదో?"

"సరి చూస్తాను. నీ కల ఎంతవరకు నిజమవుతుందో?"

కాశీనాథ్‌కూ ఆయనకూ ఈమధ్య పడటంలేదు "ఈదరిద్రుడు నా ప్రాణం తీసేస్తున్నాడు!" అన్నారు ఒక రోజు.

"రాజీనామా ఇచ్చెయ్యండి! ఎన్నరోజులు అతని సాధింపులు పడతారు?" అన్నాను.

"ఉద్యోగం లేకుండా ఎలాగడుస్తుంది?" అన్నారు.

"ప్రభుత్వోద్యోగం వదిలేప్పుడు ఇక్కడ ఉద్యోగం దొరుకుతుందనుకున్నామా ఏం!" అన్నాను.

"రాణీ! ఈ దేశంలో కలంమీద బతకటం అసాధ్యమైనపని" అన్నారు.

"ఉన్నంతలోనే గడుపుకుందాం. ఇష్టంలేనిచోట ఎన్నిరోజులు పడివుండగలం!" అన్నాను.

"అయితే రాజీనామా ఇవ్వమంటావా!"

"ఇవ్వండి!"

ఆ రోజుల్లో కాశీనుండి 'మర్యాద' అనే ఒక మాసపత్రిక వెలువడుతూ ఉండేది. దానికి సంపాదకుడు సంపూర్ణానంద్. ఆ రోజే 'మర్యాద'లో పనిచేయటానికి రమ్మని ఆయనకు ఉత్తరం వచ్చింది. జీతం నూటయాభయ్ రూపాయలు ఇస్తామని రాశారు. ఆ రోజే స్కూలు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశారు. కొందరు మాస్టర్లు ఆయన వెళ్ళిపోయే సందర్భంలో సన్మానపత్రాన్ని సమర్పించి, విందు చెయ్యాలనివుంది. కాని కాశీనాథ్‌కు అది ఇష్టంలేదు. అయినా ఆయన గౌరవార్థం విందుచెయ్యబడింది. ఇద్దరు మాస్టర్లను ఉద్యోగం నుంచి తొలగించారు. పాతిక ముప్ఫయ్ మందిదాకా విద్యార్థులు స్కూలు వదిలేశారు.

నా సోదరుడువచ్చి నన్ను ఇంటికి తీసుకెళ్ళాడు. ఆయన ఒక్కరే కాశీవెళ్ళారు. కబీర్ చౌరాలో ఇల్లు తీసుకున్నారు. స్వయంగా వంటచేసుకునేవారు. ఆయన, మాయటి తమ్ముడుకూడా అక్కడే భోజనం చేసేవాడు.

ఒకటిన్నర సంవత్సరం 'మర్యాద' ఆఫీసులో పనిచేశారు. తరువాత 'విద్యాపీఠ్' లో ప్రధానోపాధ్యాయులుగా చేరారు. జీతం నూట ముప్పయైదు రూపాయలు. జూలైనుండి ఆరోగ్యం కూడా చాలావరకు బాగుపడింది.

"నీ కల నిజమైంది" అన్నారు.

"భగవంతుని దయ!" అన్నాను.

*　　*　　*

1921 నాటిమాట. ఆయన పెదనాన్న కొడుకు 'ఇండోర్' వచ్చాడు. ఒక ముంగలిది ఎవర్నో చాలా అశ్లీలంగా తిడుతోంది. అది విన్న ఆయన అన్నకు కోపంవచ్చి నాలుగు చెంపదెబ్బలు కొట్టాడు. ఆ ముసలిది ఏడుస్తూ ఆయన దగ్గరకు వచ్చి మొరపెట్టుకుంది. దాన్ని ఓదార్చి పంపించారు.

"మా అన్నయ్యకు కోపంవస్తే, మంచీ చెడూ అనే ఆలోచనే ఉండదు. అయినా ముసలి ముండను కొట్టటమేమిటి?" అన్నారు నాతో.

"దొంగముండ మహా చెడ్డనోరు!" అన్నాను.

"అయితే కావచ్చు! దాన్ని కొట్టే అధికారం వాడికేం వుంది?" అన్నారు.

"ఒకొక్కరు సహించగలరు; ఒకొక్కరు సహించలేరు."

"అయినా కోపానికి ఒకహద్దూపద్దూ అంటూ ఉండొద్దూ?"

సాయంకాలం అన్నను అడిగారు ఆ ముసలిదాన్ని ఎందుకు కొట్టావని.

"ఏంచెయ్యమంటావు? కోపంవచ్చింది" అన్నాడు అన్న.

"నువ్వు కొట్టినందువల్ల దాని నోరు బాగుపడుతుందా?"

"కాదని నాకు తెలుసు! కాని కోపాన్ని ఆపుకోలేకపోయాను" అన్నాడు.

"దెబ్బకు దెబ్బా తగిలింది, ఫలితం శూన్యం."

"కోపంలో ఏదో చేశాను."

"ఆ ముసలిదాన్ని క్షమాపణ అడగవా?"

"నేను అడక్కపోతే ఏం? ధున్నావాళ్ళఅమ్మ అన్నంపెట్టి సమాధానపరచి పంపిందిగా?" అన్నాడు.

*　　*　　*

1922 నాటిమాట. ఆయన అన్నకు డబ్బు కావాల్సివచ్చింది. ప్రెస్‌లో ఆయన్ను 'నవాబ్, నాకు డబ్బు కావాలిరా' అని అడిగాడు.

"లేవు. కావాలంటే ఎవరిదగ్గరైనా అప్పు తీసుకొని ఇస్తాను" అన్నారు ఆయన.

"అప్పు అడగటం దేనికి అనవసరంగా! ఇంటికి వెళ్లి ధున్నా వాళ్ళ అమ్మను అడిగి తీసుకుంటాలే" అన్నాడు అన్న.

"ఆమె దగ్గరకూడా లేవు."

"నీకైతే వుండవు. నాకు ఇస్తుందిలే."

"ఆమె దగ్గిర నిజంగా డబ్బు లేదు ఏలా ఇస్తుంది."

సాయంకాలం ఆయన అన్నవచ్చి మా అమ్మాయితో పది హేను రూపాయలు కావాలని కబురు పంపారు. లేవన లేకపోయాను. పెట్టెలోనుండి పదిహేను రూపాయలు తీసి యిచ్చాను.

రాత్రి ఆయన ఇంటికొచ్చి "మా అన్నయ్యవచ్చి వెళ్ళాడా?" అని అడిగారు.

"అవును! పదిహేను రూపాయలుకూడా తీసుకెళ్ళాడు" అన్నాను.

"డబ్బు ఎక్కడిది? నీ దగ్గరకూడా లేవని చెప్పాను. అన్నయ్య నేను అబద్ధం చెప్పాననుకుంటాడు" అన్నారు.

"మీరు అలా చెప్పారని నాకేం తెలుసు? అయినా నా దగ్గర ఆ మాత్రం డబ్బుఉండకుండా ఎలా ఉంటుందనుకున్నారు?" అన్నాను.

"ఇకనుండి నేను నిశ్చింతగా ఉంటాను."

"మీరు నిశ్చింతగా ఉండాలనేగా నా కోరిక?" అన్నాను.

"ధన్యవాదాలు!" అన్నారు నవ్వుతూ.

బిడ్డకు శుశ్రూష:

'బన్నూ' పసిబిడ్డ; నిద్రలేస్తూనే పాలు కక్కుకున్నాడు. నేను ముందు లక్ష్యపెట్టలేదు. ఆయన స్కూలుకు వెళ్ళిన తరువాత విరోచనాలూ, వాంతులూ ఎక్కువ అయాయి. ఆయన పన్నెండు గంట

లకు ఇంటికి వచ్చారు. స్నానంచేసి వైద్యునిదగ్గరకు వెళతానన్నారు. బిడ్డను ఎత్తుకున్నారో లేదో వాంతీ, విరోచనం చేసుకున్నాడు. ఆయన ముందూ, వెనకాకూడా తడిసిపోయాయి. బిడ్డను నాచేతికిచ్చి, గుడ్డలు మార్చుకున్నారు. డాక్టరుకోసం వెళ్ళారు. డాక్టరు మందు ఇచ్చాడు. తెల్లవారుఝామున నాలుగు గంటలకు కొంచెం తగ్గాయి. అప్పటి వరకూ, ఆయనకూడా నాకు ఎదురుగానే కూర్చున్నారు.

ఒకసారి నాకూ అలాంటిజబ్బే వచ్చింది. తెల్లవార్లూ ఆయనా, కంపౌండరూ, నాకు సేవలు చేస్తూనే ఉన్నారు.

గ్రామంనుండి అలహాబాద్ :

ఒకసారి మేము మా ఊరినుండి అలహాబాద్ వెళుతున్నాము. కమల చంటిపిల్ల; సరయూనది దాటాలి. స్టీమ్‌లాంచీలో కూర్చున్నాము. ఆయన ఎవరితోనో మాట్లాడుతూ ఉన్నారు. నేను కింద బెంచీమీద కూర్చున్నాను. ఒక యువకుడు నా పక్కనే నిల్చొని ఉన్నాడు. పక్కపక్కకు జరగటం మొదలు పెట్టాడు. అతడు జరిగిన కొద్దీ నేనూ జరుగుతూ ఆయన కాళ్ళవరకూ జరిగాను. ఆ తుంటరి మీదమీదకు జరగటంచూసి ఆయన కాలు గీరాను. ఆయన వెంటనే సంగతేమిటో గ్రహించారు. కోపంతో కిందకుదిగి వాడిమెడపట్టుకొని దూరంగా తీసుకెళ్లారు.

"నదిలోకి నెట్టమంటావా ?" అన్నారు కోపంగా వాడిమెడను వదలకుండానే.

"నేనేం చేశాను ? నిల్చొని వున్నాను" అన్నాడు వాడు వణుకుతూ.

"అక్కడేనా నిల్చొనేది ? మళ్ళీమాట్లాడావంటే సరయూలోకి తోస్తాను. చూస్తాను నీతాతలెవరు అడ్డంవస్తారో ?" ఆయన శరీరం కోపంతో వణికిపోతూంది.

"నువ్వు మాత్రమే డబ్బు ఇచ్చావా ? నేనూ ఇచ్చాను" అన్నాడువాడు కొంచెం ధైర్యం తెచ్చుకుంటూ.

"ఓ అలాగా! ఆడవాళ్ళ నెత్తి నెక్కటానికి కూడా డబ్బు ఇచ్చావా?" అన్నారు పళ్ళుకొరుకుతూ.

ఆయనకోపం చూస్తే నాకే భయంవేసింది. చెయ్యిపట్టుకొని లాక్కొచ్చాను. అప్పుడు ఆయనకంటే నేనే ఆరోగ్యంగా వున్నాను. ఈ విషయాన్ని ఆయనవరకూ పోనిచ్చినందుకు విచారించాను.

గ్రామంలో:

గ్రామంలోఉంటే పొద్దుటపూట ఆయనే బయటివాకిలి చిమ్మే వారు. నేను వద్దన్నా వింటేగాదూ! సాయంకాలం పిల్లలతో ఆడు కొనేవారు. రోజూ కొంచెంసేపు రైతులతో వాళ్ళకష్ట సుఖాలను గురించి చర్చించేవారు. వయస్సుకు తగ్గట్టు అందర్నీ గౌరవించేవారు. గ్రామంలోని స్త్రీలను 'వదిన, అక్కా, చెల్లీ, అమ్మమ్మా' అంటూ వరసలుపెట్టి పిలిచేవారు. వదిన వరసైనవారు సరసాలు ఆడేవారు. ఆయన నవ్వుకుంటూ వెళ్ళిపోయేవారు. బయలు ప్రదేశానికి చాలా దూరం వెళ్ళేవారు. తిరిగి వచ్చేప్పుడు కందికాయల రోజుల్లో కంది కాయలూ, మామిడికాయల రోజుల్లో మామిడికాయలూ కోసి చెంబులో వేసుకొని ఇంటికి తెచ్చేవారు.

1922–24

మున్షీ దయానారాయణతో కలసి ఒక హిందూస్తానీ 'ఎకాడమీ'ని స్థాపించాలనుకున్నారు. ఎకాడమీ స్థాపించబడింది. అందులో ఆయనకూడా మెంబరే. ప్రతి సమావేశానికి తప్పకుండా వెళ్ళేవారు. అక్కడనుంచి రాగానే విశేషాలు అడిగేదాన్ని.

ఒకరోజు "నేను ఊహించిన 'ఎకాడమీ' తెరవబడ లేదు" అన్నారు.

"మరి ఈ 'ఎకాడమీ' ఏమిటి!" అడిగాను.

"దీనిపేరు 'ఎకాడమీ' అంతే నాకు తెలిసింది" అన్నారు.

"మరి! మీరు స్థాపించాలనుకున్నది ఒక 'ఎకాడమీ' యేగా!"

"వీళ్ళకు పనిచేయటం తెలియదు. హిందూదేశంలోని అన్ని భాషలకు సంబంధించిన ఒక్కొక్క ప్రముఖ రచయితను ఇందులో సభ్యుడుగా చేర్పించాలి. ఆయా భాషల్లో వెలువడిన కొత్త పుస్తకాలను పరీక్షించే అధికారం వీళ్ళకే ఉండాలి. అప్పుడే మంచి పుస్తకాలు అచ్చు అవుతాయి. కొత్తగా రాసేవాళ్ళకు ప్రోత్సాహం ఇవ్వాలి. పెద్దపెద్ద పండితులూ, రచయితలే కొత్తవాళ్ళనుసిరుత్సాహపరుస్తున్నారు. అది చాలా తప్పు. పారితోషికం కూడ పెద్ద సమస్య కాదు. రాయల్టీ ఇవ్వవచ్చును లేక ఒకేసారి యింత మొత్తమని అయినా యివ్వవచ్చును" అన్నారు.

"రచయితలు రాసేవి ఈ ఎకడమీ లేకపోతే అచ్చవకుండా వుండవుగా ?" అన్నాను.

"తమ లాభంకోరకే ప్రాకులాడే ఈ ప్రకాశకులు అవసరం లేదు. రచయితల, ప్రకాశకుల మధ్య పారివారిక సంబంధం ఉండాలి. ఈనాటి ప్రకాశకులూ అలా లేరు, రచయితలూ అలా లేరు. రచయితలకు నిరాశను కలిగించకూడదు. ఎప్పుడూ జీవితావసరాలుకూడా తీరక, అసంతృప్తితో అలమటించేవాళ్ళు సజీవ సాహిత్యాన్ని ఎలా సృష్టించగలరు !"

"సాహిత్య క్షేత్రంలో ఉన్నతి ఎలా కలుగుతుంది ?" అడిగాను.

"ఈనాటి సాహిత్యంలో ఉన్నతి అనేశబ్దమే లేదు. రచయితలు రాగద్వేషాలతో 'నువ్వెంత అంటే నువ్వెంత ?' అని కాట్లాడుకుంటున్నారు" అన్నారు ఆయన.

"అలాంటప్పుడు రచయితల బాధ్యత ఏమిటి ?"

"అభ్యుదయ సాహిత్యాన్ని సృష్టించాలి. అప్పుడే మన దేశంలో సాహిత్యంతోపాటు సమాజ, రాజకీయ రంగాలలో కూడ అభివృద్ధి కలుగుతుంది."

"అయితే మీరు సాహిత్యాన్నీ, సమాజాన్నీ, రాజకీయా లనూ, ఒకే సూత్రంలో బంధించాలంటారా ఏమిటి?"

"అవును! ఏ దేశపు సాహిత్యం ఉన్నత శిఖరాలను అందు కుంటుందో ఆ దేశపు సమాజంలో ఉన్నతి కలుగుతుంది. సమాజ వ్యవస్థ చక్కబడినప్పుడు రాజకీయాలుకూడ సవ్యంగానే ఉంటాయి. ఈ మూటిమధ్య అవినాభావ సంబంధం ఇమిడివుంది" అన్నారు.

"ఈ మూటినీ ఒకేమార్గంలో ఎందుకు నడిపించాలి?"

"ఈ మూటి ఉద్దేశాలూ ఒక్కటే కాబట్టి. సాహిత్యము ఈ మూటియొక్క లక్ష్యాన్ని సఫలం చెయ్యటానికి 'విత్తు'లాగ పని చేస్తు ది. మానవ సమూహాన్నే సమాజం అంటాము. సమాజంలో సంభవించే లాభనష్టాల, సుఖదుఃఖాల, ప్రభావం మానవులమీదనే పడుతుంది. రాజకీయాలవల్ల స భవించే లాభనష్టాల, సుఖదుఃఖాల ఫలితాలనుకూడ ఈ మానవులే అనుభవిస్తున్నారు. సాహిత్యం మానవ మస్తిష్కాన్ని వికసింపజేస్తుంది ఈ సాహిత్యమే మానవుల్లో మ చిభావాలనూ, చెడ్డభావాలనూకూడ కలిగిస్తుంది. ఈ భావాలకు అనురూపంగానే మానవుడు జీవించటానికి ప్రయత్నిస్తాడు. కాని ఈ మూడు వస్తువులకూ మూలఆధారం మానవుడే అనేది మర్చిపో గూడదు."

"బహుశా మీరు దీని కుదురు కనుక్కోవాలని ప్రయత్నిస్తు న్నారులాగున్నది" అన్నాను.

"కుదురుమీదనే వృక్షం ఆధారపడి ఉంటుంది. వేళ్ళను రక్షించకుండా చెట్టును కాపాడ ప్రయత్నించటం తెలివితక్కువే" అన్నారు.

"మరి! వీళ్ళంతా దీనినిగురించి ఎందుకు ఆలోచించరు?"

"వీళ్ళంతా పెద్దవాళ్ళు. బీదవాళ్ళ సమస్యలతో తలపగల కొట్టుకోవాల్సిన అవసరం వీళ్ళకేమొచ్చింది? అన్న సుఖాలూ అందుబాటులో వున్నవారికి ఎవరెలాపోతేనేం? బీదవాళ్ళ సమస్యలను

విడదీయగల సాధనం సాహిత్యం ఒక్కటే. దాన్ని ప్రతిభావంతులైన రచయితలు కొందరు చేరి సక్రమంగా ఉపయోగించాలి" అన్నారు.

ఆయనకు రాత్రింబవళ్ళు రచయితల కష్టాలను గురించిన ఆలోచనే. 'సత్యజీవనవర్మ' గారి సహకారంతో రచయితల సంఘాన్ని స్థాపించారు. 1935 లో అభ్యుదయ రచయితల సంఘం స్థాపించ బడింది. దానికి మొదటి అధ్యక్షుడుగా ఈయన్నే ఎన్నుకున్నారు.

ఈ పనిని ఎలాంటి అమంగళ సమయంలో ప్రారంభించారో కానీ, అసలు వ్యక్తే శాశ్వతంగా కళ్ళుమూశారు. ఆయన ఆలోచనలు కార్యరూపాన్ని ధరించకముందే వెళ్ళిపోయారు. అన్ని భాషల లోని సాహిత్యాలను ఒకే మాలలో గుచ్చేందుకే 'హంస'ను 'భారతీయ భాషా పరిషద్' వాళ్ళకు అప్పగించారు. ఈ పరిషత్ ద్వారా విభిన్న భాషలమధ్య పారివారిక సంబంధం ఏర్పడగలదని ఆయన దృఢవిశ్వాసం. కాని ఆయన జీవితకాలంలో పరిషద్ 'హంస' ను వేరుచేసింది. జబ్బులోకూడ ఆయనకు 'హంస' ను గురించిన దిగులే. పరిషద్ 'సెక్యూరిటీ' కట్టనందువల్ల పత్రిక ఆపు చెయ్యబడింది.

ఆయన జబ్బులో ఉన్నారు. " 'హంస'కు సెక్యూరిటీ నువ్వు ఇవ్వు! నాకు తగ్గిన తరువాత కష్టపడి నీ అప్పుతీరుస్తాను" అన్నారు నాతో. ఆయనస్థితికి నేను బాధపడుతుంటే ఆయన 'హంస' కోసం దిగులుపడుతున్నారు.

"ముందు మీకు తగ్గనివ్వండి! తరువాత చూద్దాం?" అని అన్నాను.

"లేదు. ఇప్పుడే డబ్బు కట్టించు. నేను బతుకుతానో లేదో? కనీసం నా జ్ఞాపకార్థంగానైనా 'హంస' ఉంటుంది" అన్నారు.

నాకు ఏడుపువచ్చింది. హృదయం విలవిలాకొట్టుకుంది. వెంటనే బ్యాంకినుండి డబ్బు తెప్పించాను.

ధున్నూకు డబ్బు కట్టటం చాతకాదనే ఉద్దేశంతో దయా నారాయణ్ నిగమ్‌కు టెలిగ్రాం ఇచ్చి పిలిపించారు. దయా

నారాయణ్ వచ్చాడు. అతను ఆయన్ను ఆస్థితిలో చూసి కౌగలించు కొని ఏడ్చాడు. "జీవితంలో మళ్ళీ కలుసుకోలేక పోవచ్చు. నీతో 'హంస'ను గురించి మాట్లాడాలి" అన్నారు. ముందు వెళ్ళి సెక్యూరిటీ కట్టిరమ్మన్నారు. నేను, ధున్నూ కట్టాడని చెప్పాను.

ఆయన చెయ్యాలనుకున్న పని హృదయపూర్వకంగా చేసేవారు. ఆయన నా ఒక్కదానికి చెందినమనిషే కాదు. ఆయనజీవించి ఉండగా ఏవిషయాలను గురించి పోట్లాడేదాన్నో, విసుక్కునేదాన్నో వాటినే ఈ రోజు పొగడకుండా ఉండలేకపోతున్నాను. ఈరోజునాకు అన్నిటికంటే ప్రియమైనవి ఆయన వస్తువులే!

అలవర్ మహారాజా :

1924 లో ఆయన లక్నోలో ఉన్నారు. 'రంగభూమి' అచ్చవుతూవుంది. అలవర్ ఎస్టేటు మహారాజు నలుగురయిదుగురు మనుషులను ఆయన్ను పిలుచుకురమ్మని పంపించాడు. రాజాగారికి కథలన్నా, నవలలన్నా చాలా ఇష్టమట. ఆయనకు తనదగ్గర ఉద్యోగం ఇస్తానని కబురు పంపించారు కుటుంబంతో సహా రమ్మన్నారు. బంగళా ఇచ్చి నెలకు నాలుగువందల జీతం ఇస్తానని చెప్పి పంపించారు. ఆ వచ్చిన మనుషులకు ఉత్తరం ఇచ్చి పంపించారు. అందులో ఇలా రాశారు :

"మీరు నాయందు చూపిన దయకు ఎంతో కృతజ్ఞుడను. నాజీవితాన్ని సాహిత్యానికి సమర్పించుకున్నాను. మీరు నా కథలూ, నవలలూ చదువుతున్నందుకు చాలా చాలా ధన్యవాదాలు సమర్పిస్తున్నాను. మీరు నాకు ఇవ్వదలచిన పదవిని స్వీకరించే యోగ్యత నాకులేదు. వీలునుబట్టి తమ దర్శనం చేసుకుంటాను.

ఇట్లు,
ఒక సాహిత్యసేవకుడు
"ధనపత్ రాయ్"

"అలవర్ మహారాజా నన్ను పిలిపించారు" అని నాదగ్గరకు వచ్చి అన్నారు.

"ఎందుకు?" అడిగాను.

"నన్నాతని ప్రయివేటు శ్రెకటరీగా నియమిస్తారట" అన్నారు.

"రాజా మహారాజాలదగ్గర మనమేం చేస్తాము?" అన్నాను.

"కారూ, బంగళా, నెలకు నాలుగువందల రూపాయలూ, ఏం చేదాం?" అన్నారు నా కళ్ళల్లోకి చూస్తూ.

"మీకు ఎవరితోనూ పడదు" అన్నాను.

"అంటే నేను ఎప్పుడూ అందరితో గిల్లికజ్జా పెట్టుకొనే వాడిననా నీ ఉద్దేశం" అన్నారు.

"నా ఉద్దేశం ఏమిటి? గోరఖ్‌పూర్ ఇన్‌స్పెక్టర్ ఏదో చిన్న మాట అన్నందుకు మానసష్టం దావా వేస్తున్నారు. మహోబా కలెక్టర్‌తో పోట్లాడారు. ఇక రాజాలతో మాత్రం పోట్లాడకుండా వుండగలరనే నమ్మకం ఏముంది?" అన్నాను.

"ఉండగలననే అనుకో!" అన్నారు.

"అసంభవం! ఒక్కరోజు ఉండలేరు. మీకు తగినపోయిందల్లా కూలిపనే! రాజా మహారాజాల ఇళ్ళలో వ్యక్తిత్వాన్ని చంపుకో గలవాళ్ళు ఉండాల్సిందేకాని స్వాభిమానులకు అక్కడ స్థానం ఉండదు" అన్నాను.

"నేను వెళదామనుకుంటున్నాను. కొన్ని రోజులు కార్లు బంగళాల వైభవంకూడా చూడాలని వుంది. నా సంపాదనతో ఈ జీవితంలో అది అసంభవం" అన్నారు.

"మీరు చెప్పేది అవసరాలను తీర్చుకోటానికి వాకిట కూర్చొనే వేశ్యావృత్తిలాగుంది. కూలిపనినే తమ జీవిత లక్ష్యంగా పెట్టుకున్న వాళ్ళకు బంగళాలూ, కార్లూ ఎందుకు?" అన్నాను.

"నా కవన్నీ అవసరం లేకపోవచ్చుకాని నీకు వుండవచ్చుగా?" అన్నారు.

"నాకు అలాంటి కోరిక లేవుంటే సరకారు ఉద్యోగం ఎందుకు వదిలేయమని చెబుతాను?" అన్నాను.

"మన పిల్లల కయినా కోరిక లుండొచ్చునుగా?"

"పిల్లల కోరికలు పిల్లలే తీర్చుకుంటారు. కాని పిల్లలుకూడా మీలాగనే జీవితాన్ని గడపాలని నా కోరిక" అన్నాను.

"పిల్లలు నాలాగ వుండకపోతే వాళ్ళను కొట్టితిట్టి తయారు చేస్తావా?"

"పిల్లలు మనమాట వినకపోతే నా పిల్లలు కారనుకుంటాను" అన్నాను.

"నేను ముందేరానని రాశాను" అన్నారు నవ్వుతూ.

"నన్ను ఉడికించటం మీకు సరదా" అన్నాను.

"నీ కిష్టమయితే ఈ ఉద్యోగం చేద్దామనే ఉద్దేశంతోనే నిన్ను అడిగాను."

"కథల్లో, నవలల్లో పాత్రలను చక్కగా చిత్రిస్తారు. కాని కళ్ళముందు వున్న నన్ను అర్థంచేసుకోలేరు" అన్నాను.

"కథల్లోని, నవలల్లోని పాత్రలను మన అభిరుచికి అనుకూలంగా చిత్రిస్తాము. కాని మనుష్యలను మన అభిరుచులకు అనుకూలంగా మార్చటం ఎలా సంభవమవుతుంది? అదీకాక ఒకరి అభిరుచులను ఇంకొకరిమీద రుద్దటంకూడ మంచిది కాదు" అన్నారు.

"నేను నాకు ప్రతికూలంగా వుండే వ్యక్తులతో ఉండలేను" అన్నాను.

"నాకు తెలుసు, నువ్వునాకు అనుకూలంగానే ప్రవర్తిస్తావని" అన్నారు.

ప్రెస్‌లో:

ఈరోజుల్లోనే జరిగిన ఇంకోసంఘటన- అది కార్తీకమాసము. నేను గ్రామంలో ఉన్నాను. ఆయనకు మళ్లీ విరోచనాలజబ్బు పట్టుకుంది. రెండు నెలలు గడిచాయి. కాని జబ్బు తగ్గుముఖం పట్ట

లేదు. వైద్యులకని ఇచ్చిన డబ్బు ప్రెస్‌లో ఖర్చుపెట్టేవారు. చివరకు విసుగుపుట్టి ఆయనతో ఊరికి వెళ్ళదా మన్నాను.

"ప్రెస్‌పని ఎవరు చూస్తారు ?" అన్నారు.

"ఆరోగ్యం చెడినతరువాత ఈ ప్రెస్‌లన్నీ ఎందుకు ?" అన్నాను విసుగ్గా.

"చాలా పనిఉంది. ఇక్కడనుండి ఎలా కదలటం ?" అన్నారు.

ఆయనకు ఎంత చెప్పినా లాభంలేదని, నేను వెళ్ళిపోతున్నానని చెప్పాను.

"నాకు కావాల్సిన సామానుఉంచి వెళ్ళు" అన్నారు.

"పిల్లల్ని మాత్రం తీసుకెళతాను. సామానంతా ఇక్కడే పడి ఉంటుంది" అన్నాను.

బయట మా బావగారు కూర్చొని ఉన్నారు. ఆయన వెళ్ళేప్పుడు మేముకూడా వస్తామని చెప్పమని పిల్లతో కబురు పంపాను. సాయంకాలం బండితీసుకొని వస్తానని చెప్పి మా బావగారు వెళ్ళిపోయారు.

ఆయన ప్రెస్‌కు వెళుతూ "సామానంతా తీసుకువెళ్ళండి. సాయంకాలం నేనూ వస్తాను" అని చెప్పారు.

"మీరు ఉండండి ! మీరు ప్రెస్‌నువదిలి పాపం ఎందుకు వస్తారు ?" అన్నాను కోపంగా.

"నేను రానంటే నువ్వుకూడ వెళ్ళవని" అలా అన్నాను.

"నేను లేకుండా మీరు ఒక్కరోజుకూడా ఇక్కడ ఉండలేరని తెలిసే నేనూ ప్రయాణం అయాను" అన్నాను.

ఆరోజు సాయంత్రం అందరం ఊరికి వెళ్ళాము. రెండోరోజు పొద్దున్నే మా బావగారికి డబ్బు ఇచ్చి, ఆయన్ను ఎవరికైనా మంచి డాక్టరుకు చూపించమన్నాను. కొద్దిరోజుల్లో ఆయన ఆరోగ్యం చాలావరకు కుదుటపడింది. పట్టణంపోయి వస్తుండేవారు. ఒక రోజు ఎండలో బయలుదేరారు. "చాలా ఎండగా వుంది"అన్నాను.

"ఉంటే నీకేం? చచ్చేది నేనేగా!" అన్నారు.

నాకు కోపం వచ్చింది. "మీరు కదలటానికి వీల్లేదు. ఇంట్లో కూర్చోండి. నేను ప్రెస్‌కు వెళుతున్నాను. నేను నా విశ్రాంతి కోసం ఇక్కడకు రాలేదు? మీరు ఇంట్లో ఉండండి. నేను వెళుతున్నాను. మీకు అవసరమైన వస్తువులు చెప్పండి, వచ్చేప్పుడు తెస్తాను" అన్నాను కోపంగా.

"గొడవ చేయకుండా నన్ను పోనివ్వు!" అన్నారు.

"వీల్లేదు. మీరు మళ్ళీ అదే మాట అంటారు. ఈ బెదిరింపులు నా దగ్గర పనికిరావు!" అన్నాను.

"మళ్ళీ ఆమాటఅంటే తెకుదువుగానిలే! ఏదో పొరపాటున వచ్చింది. ఈ సారికి క్షమించు" అన్నారు.

"ఇప్పుడు మీకు వంట్లో కులాసాగా వుంటుందా, లేదా చెప్పండి? అక్కడేఉంటే మీ ఆరోగ్యం బాగుపడి ఉండేదేనా!" అన్నాను.

"మానవుడు అవసరాలకు బానిస" అన్నారు.

"అలాగని ఆరోగ్యాన్ని నాశనం చేసుకుంటారా? చెయ్యగలిగినంతపనే చెయ్యాలి. మీరు మంచం మెక్కితే ఏమవుతుంది?" అన్నాను.

"అయితే వెళ్ళొద్దంటావు? అంతేనా?" అన్నారు.

"ఎండ చాలా తీక్షణంగా ఉంది. పని జరక్క అట్టే ఉండిపోదులెండి!" అంటూ కాళ్ళ చెప్పులు తీశాను. కోటువిప్పి మంచం మీద నడుం వాలుస్తూ? "ఇప్పుడు సంతోషంగా వుందా?" అన్నారు.

"చాలా సంతోషంగా వుంది. విశ్రాంతి తీసుకోండి" అన్నాను.

## 1924

ఒకరోజు ఆయన 'బేదార్ సాబ్' ఇంటికి వెళ్ళారు. 'మాధురీ' ఆఫీసుకు సంబంధించిన పనిమీద వెళ్ళారు. బేదార్ తాగుబోతని అందరికీ తెలుసు. తను తాగటంకాక ఆయన్నూ తాగించాడు,

ఆ మత్తులో చాలా పొద్దుపోయి ఇంటికి వచ్చారు. ఆ రోజే నా చెవుపోటుగట్టిగా చికాకించింది. నిద్రపట్టింది. ఎంతసేపటినుండి తలుపు కొడుతున్నారో ఏమో? పిల్లలకు మెలుకువ వచ్చింది. ఘన్నూ వెళ్ళి తలుపుతీశాడు. పిల్లకూడా పక్కనేవుంది. పిల్లల్ను కుక్కను అదిలించినట్లు అదిలిస్తున్నారు. గొంతువిని మెలుకవ వచ్చింది. "చూడమ్మా! కుక్క వచ్చిందిలాగుందీ?" అన్నాను.

"నీకు వినిపించలేదు. నాన్న వచ్చారు. నన్నూ, అన్నయ్యనూ కొప్పడుతున్నారు!" అన్నది మా అమ్మాయి.

"ఎందుకు?" అడిగాను.

"చాలా సేపటినుండి నాన్న తలుపు కొడుతున్నారు. మాకు వినిపించలేదు" అన్నది.

"చూడమ్మా టైమ్ ఎంతయిందో?" అన్నాను.

"ఒకటిన్నర అయింది."

నేను లేవబోతుంటే "నువ్వువెళ్ళకమ్మా నాన్న తాగివచ్చారు. నిన్నుకూడా అలాగే విదిలిస్తారు" అన్నది పిల్ల.

నాకు కోపంవచ్చింది. మెదలకుండా పడుకున్నాను. పొద్దుటికి ఆయన మత్తు వదిలింది. పిల్లల్ని ఎందుకలా కసురుకున్నారని అడిగాను.

"అర్థగంట అరిచినా మీకు ఎవరికీ విన్పించలేదు."

"పిల్లలు అర్థరాత్రివరకూ మేలుకుంటారా?"

"పిల్లలుకాకపోతే పిల్లలతల్లి మేలుకుండవచ్చుగా!" అన్నారు.

"రాత్రే కొంచెం చెవిబాధ తగ్గిందేమో నిద్రపట్టింది. మీరు తాగి వచ్చినట్లు తెలిస్తే మేలుకొనివున్నా తలుపు తీసిఉండను" అన్నాను.

"ముందే తెలిస్తే అక్కడే పడుకొని ఉండేవాడిని."

ఆ తరవాత నాలుగయిదురోజులకు మళ్ళీ తాగివచ్చారు. ఆ రోజు ఎనిమిదిగంటలకే ఇంటికి వచ్చారు. రాత్రి రెండుసార్లు

వాంతిచేసుకున్నారు. కాని నేను లేవలేదు. మా మరదలు ఆయనకు నీళ్ళు ఇచ్చింది. ఉదయం "నే నెంత బాధపడ్డాను రాత్రంతా. నువ్వు ఒకసారైనా లేచివచ్చావా!" అన్నారు నాతో.

"ఆ సంగతి నేను ఆరోజే చెప్పాను."

"నీ హృదయం చాలా కఠోరమైంది!"

"ఆ సంగతి మీకు ఈరోజే తెలిసిందా!"

ఆ రోజు తరవాత మళ్ళీ ఆయన తాగలేదు.

సాహసం:

1924 లో నా మొదటికథ 'సాహసం' ప్రచురించబడింది. ఆయనకు తెలియకుండా రాశాను. అప్పుడు 'చాంద్' సంపాదకుడుగా ఆర్. సైగల్ ఉండేవాడు. అతనే నా కథను సవరించి ప్రచురించాడు. నాకు పత్రిక కాపీ, ఆయనకు అభివందనాలు తెలియపరుస్తూ ఒక ఉత్తరం పంపించారు. ఆ ఉత్తరంలో "మీరు నవలా సామ్రాట్ అని తెలుసు! కాని మీ శ్రీమతిగారుకూడ కథలు రాస్తారని తెలియదు. ఆమె పురుష జాతిమీదనే చెప్పు విసిరారు. మన బలహీనతను చక్కగా బయటపెట్టారు. అయినప్పటికీ ఆమెకు నా అభివందనాలను తెలియపర్చకుండా ఉండలేకపోయాను."

ఆఫీసునుండి వచ్చి పత్రికకాపీని నాకిస్తూ "మీ కథ వచ్చింది. మీరుకూడ రచయిత్రిగారు కాబోలు! పురుషుల మీద నీ కెంత సద్భావం? ఆఫీసులో అందరూ ఒకేగోల పెడుతున్నారు!" అన్నారు.

"ఏదో సరదాగా రాశాను" అన్నాను.

"నీకు సరదాగా వుంది. కాని పురుషులంతా భుజాలు తడుముకుంటున్నారు."

"అలాంటి పనులు చేసేవాళ్ళే భుజాలు తడుముకుంటారు."

ఆ కథ ప్రచురించబడిన నాలుగయిదు నెలల తరువాత ఒక పంజాబీ మహాశయుడు మా ఇంటికి వచ్చాడు; "మీరు కథ రాసి మీ దేవిగారి పేరుతో ప్రచురించారే!" అన్నాడు అతను.

"నేను అలాంటి కథ రాయగలనా!" అన్నారు ఆయన.

"ఆ కథకు జవాబుగా 'హంసనడక నడిచే కాకి' అనే పేరుతో త్వరలోనే రాబోతుంది" అన్నారు ఆ పెద్దమనిషి..

"ఆమె రాసిన కథ ఒకటి కరెక్టుచెయ్యమని నాకు ఇచ్చింది. కావాలంటే చూపిస్తాను. మన దేశస్థుల హృదయాలు చాలా సంకుచితమైనవి. ముందూ వెనకా, ఆలోచనే ఉండదు. ఆలోచించకుండానే నోటికి వచ్చినట్లు మాట్లాడేస్తారు. అలాంటి కథను ఒక పురుషుడు రాయగలడా లేదా అనే ఆలోచనకూడా ఉండదు" అన్నారు.

ఆ పెద్దమనిషి వెళ్ళినతరువాత, ఇంట్లోకివచ్చి "నువ్వు కథలు రాయటంవల్ల నాకు పెద్దచిక్కు వచ్చింది! హాయిగా కాలంగడపక ఈ గొడవలన్నీ నీ కెందుకు? లేనిపోయింది పైన వేసుకోవటం కంటే ఏమీ చెయ్యకుండా ఉండటమే ఉత్తమం" అన్నారు.

"ఇప్పుడు మానేయటం మంచిది కాదు. అప్పుడేమంటారో తెలుసా? దొంగపట్టుబడేటప్పటికి మానేశాడు అంటారు. తన కొచ్చినపేరు చాలక, భార్యకుకూడ సంపాదించి పెట్టాలని ఆశ పడ్డాడు, అంటారు" అన్నాను.

"ఇందులో నీకు సుఖం ఏముంది చెప్పు? రాత్రింబవళ్ళు రక్తం ధారపోయటంకంటే!" అన్నారు.

"మీ రెందుకు మీ రక్తాన్ని ధారపోస్తున్నారు? మీ రక్తం కంటే నారక్తం విలువైనదని నేను అనుకోను. అదీ ఒక పిచ్చేనని మీ రే చెబుతుంటారుగా? నాకూ ఆపిచ్చే పట్టిందేమో?" అన్నాను.

"అవసరంగా లేనిపోని నిందలు ఎందుకు కొని తెచ్చుకుంటావు?"

"ఎవరికో భయపడి మన పనిని చెయ్యటం మానేస్తామా! నిజం ఎప్పటికైనా బయటపడుతుంది" అన్నాను.

'బన్నా' తప్పిపోయాడు :

1924 నాటి మాట. అప్పుడు 'బన్నా' వయస్సు మూడు సంవత్సరాలు. ఒకరోజు ఆయన మంచం కొనటానికి బజారుకు వెళ్ళారు. 'బన్నా' 'ఘన్నా' ఇద్దర్నీ తీసుకెళ్ళారు. ఇద్దర్నీ కింద వదిలి, ఆయన దుకాణం మెట్లెక్కి పైకివెళ్ళి మంచాలు బేరం చేస్తున్నారు. ఆయన వెనకాలే 'ఘన్నా' కూడ మెట్లెక్కి వెళ్ళాడు. 'బన్నా' ఒంటరిగా కిందనే వున్నాడు. ఆయన కిందకొచ్చి చూస్తే బన్నా కనిపించలేదు. నాతో చెప్పవద్దని ఘన్నాను హెచ్చరించి ఇంటికి పంపారు. ఘన్నా ఏడుపు ముఖం చూసి "మీనాన్న బన్నాను తీసుకొని ఎక్కడికి వెళ్ళారు?" అని అడిగాను.

"బన్నా తప్పిపోయాడు. నాన్న వెతుకుతున్నారు" అన్నాడు ఏడుస్తూ.

ఘన్నా జరిగిన సంగతంతా చెప్పాడు. కొంచెం సేపటికి ఆయన బన్నాను తీసుకొని ఇంటికి వచ్చారు.

"వీడు ఎక్కడ ఉన్నాడు" అని అడిగాను.

"ఇవ్వాళ వీడు దొరకకపోతే నేనూ ఇంటికి వచ్చేవాడినికాదు. మేము దుకాణంలో వున్నప్పుడు వీడు చిన్నగా వెళ్ళిపోయాడు. ఒక పాడుబడ్డ కొట్టు వెనుక నుంచొని ఏడుస్తున్నాడు. వెతుకుతున్నంత సేపూ నాకూ ఏడుపు వచ్చింది. వాడు లేకుండా నీ ముందుకు వచ్చేసాహసం నాకు లేదు. ఇవ్వాళ వీడు దొరకకపోతే నేనూ బతికి ఇంటికి వచ్చిఉండను" అన్నారు.

"చివరకు ఎలా కనుక్కున్నారు?"

"నాలుగువైపులా వెతికాను. కన్పించలేదు. ఎటునుంచి అయినా ఏడుపు వినిపిస్తుందేమోనని జాగ్రత్తగా ఆలకించాను. ఒక పాడుపడ్డకొట్టు వెనకనుంచి వీడి ఏడుపు వినిపించింది. వెళ్ళి చూస్తే పిల్లాడు ఏడుస్తున్నాడు. నేనూ ఏడుస్తూ ఎత్తుకున్నాను. ఎంతోసేపటికి కాని ఏడుపు మానలేదు" అన్నారు.

ఆ రోజునుండి చిన్నపిల్లల్ని ఆయన బజారుకు తీసుకెళ్ళలేదు.

పని మనిషి కొడుకు:

మా ఇద్దరుపిల్లలూ అలహాబాదులో చదువుతున్నారు. వాళ్ళిద్దర్నీ వేరువేరుగా ఉత్తరాలు రాయమని ఆయన ఆజ్ఞాపించారు. "ఘున్నా, బన్నామీద అధికారం చెలాయిస్తున్నాడేమో!" అని అప్పుడప్పుడు నాతో అంటుండేవారు.

"అయితే తప్పేమిటి? అన్నదమ్ములేగా?" అన్నాను.

"నీకు తెలియదు. ఇందువల్ల చాలా అనర్థాలు ఉన్నాయి. పిల్లలు ఆత్మవిశ్వాసాన్ని కోల్పోతారు. వాళ్ళలో దీనత్వం, ఆత్మహీనత, పిరికితనం ప్రవేశిస్తాయి. వాళ్లను అంతదూరంలో ఉంచటానికి కారణం, వాళ్ళ బాధ్యతలను వాళ్ళు అర్థం చేసుకోవాలనేగా? ప్రేమతో 'అదుపు'లో పెట్టటం మంచిదే కాని ఈ రోజుల్లో అది ఎక్కడ? కాలేజీలో చేరగానే కుర్ర కుంకల్లో మిథ్యాఅహంకారం తలఎత్తుతుంది. తమ వ్యక్తిత్వ ప్రదర్శన కోసం అయినదానికీ, కానిదానికీ, ఇతరుల మీద అధికారం చలాయించబోతారు. అందుకే ఇద్దర్నీ స్వతంత్రులుగా ఉంచాలని నా ఉద్దేశ్యం!" అన్నారు.

"అంతమాత్రాన వాళ్ళలోని అధికారప్రవృత్తి సమసి పోతుందా!" అన్నాను.

"ఎందుకుపోదు? చిన్నవాడిని పెద్దవాడు కష్టపెడితే వాడు నాకు రాస్తాడు. అందుకే ఇద్దర్నీ వేరు వేరు ఉత్తరాలు రాయమని చెప్పింది!" అన్నారు.

ఆయన స్వయంగానే పిల్లలకు చదువు చెప్పేవారు. ప్రవేటు మాష్టర్ను పెట్టటం ఆయనకు ఇష్టం ఉండేదికాదు.

ఒకసారి నేను కాశీలో ఉండగా మా పనిమనిషి కొడుకు కాలిపోయాడు. మలాంపట్టీల్లో ఒళ్ళంతా అసహ్యంగా వుంది. గుడ్డలుకూడా చాలా మురికిగా ఉన్నాయి

బన్నా వాడిని ఎక్కడో శ్మశానంలో, రెండు చేతులతో జాగ్రత్తగా పట్టుకొని పైకి తీసుకొచ్చాడు. "అమ్మా! పాపం! వీడికి

మిఠాయి పెట్టవే!" అన్నాడు. అది చూసి నావళ్ళు గగుర్పొడిచింది. వాడికి ఏ కొంచెం దెబ్బతగిలినా ప్రాణం కడబట్టి పోయేలాగుంది. కళ్ళుగాళా కాలి వంకాయలాగ కమిలిపోయి వుంది. బన్నూ వాడిని అంత జాగ్రత్తగా తీసుకురావటం చూసి ఆయన కళ్ళలో నీరుతిరిగింది.

"ఆలస్యం చెయ్యకు! త్వరగా మిఠాయి పెట్టిపంపు!" అన్నారు.

నేను మిఠాయిపెట్టి బన్నూతో "వీడిని ఎలా కిందకు చేరుస్తావో? నువ్వొచ్చి మిఠాయి తీసుకెళ్ళి వీడికి పెట్టకూడదూ? పైకెందుకు తీసుకొచ్చావు? ఏ కొంచెం దెబ్బతగిలినా అన్యాయంగా చచ్చిపోతాడు!" అన్నాను.

"నేను జాగ్రత్తగా చేరుస్తానమ్మా!" అంటూ రెండు చేతులతో పట్టుకొని వాడిని చిన్నగా మెట్లుదించాడు.

అదిచూసి ఆయన అన్నారు "బన్నూ హృదయం చాలా సున్నితమైంది. వీడు నీ పేరు బయటకు తెస్తాడు" అన్నారు.

పిల్లలందరినీ ప్రేమించేవారు. కాని బన్నూ అంటే ఆయనకు అమితప్రేమ.

ఒకసారి బన్నూకు మశూచికం వచ్చింది. పదమూడు ఏళ్ళ వాడిని ఎత్తుకొని మెట్లెక్కుతున్నారు ఆయన. కాస్త ఐతే ఇద్దరూ పడేవాళ్ళే! నేను వెనకనుండి పట్టుకున్నాను. "పిల్లడిని దింపండి! బాబూ! నడువు!" అన్నాను.

"నువ్వు రాకపోతే ఇద్దరం పడేవాళ్ళమే."

"నాకు ముందే తెలుసు!"

బన్నూ రాత్రిళ్ళు లేచివచ్చి నా పక్కలో పడుకొనేవాడు.

"చూడు బాబూ! అమ్మదగ్గిర పడుకోకూ! అమ్మకూడా జబ్బు చేస్తుంది" అంటున్నారు ఒకరోజు అదే సమయంలో నేను వెళ్ళాను.

"బాగా నేస్తుంది వరస! ఈ జబ్బు నాకేంరాదు! వాడిని భయపెట్టకండి!" అన్నాను.

"ఇది అంటుజబ్బు! నీకుమాత్రం ఎందుకురాదు?"

"సాధారణంగా పెద్దవాళ్ళకి రాదు."

"తీరా వచ్చినతరవాత ఏమనుకుంటే ఏముంటుంది! ముందే జాగ్రత్తపడటం మంచిది" అన్నారు.

"నా గురించినచింత నాకులేదు. నేను ఎలా అయితే ఏం?" అన్నాను.

"నీకేం? చివరకు కష్టపడేవాడిని నేనేగా?"

"నాకేం రాదులెండి. ఈ జబ్బు పెద్దవాళ్ళకు రావటం అరుదు" అన్నాను.

"ఇంట్లో ఎవరికి జబ్బుచేసినా ఆయనకంత బాధవుండేది కాదు. చిన్నచిన్నవాటికి నేనే ఏదో చిట్కాలతో బాధపడేదాన్ని. పెద్ద జబ్బులనుకూడ వీలయినంతవరకు ఆయనదగ్గర దాచేదాన్ని. అసలే గాబరా మనిషి. అదీగాక, రాయటానికీ, చదవటానికీ వీల్లేనిరోజు తన జీవితకాలంలో కొంతభాగం వ్యర్థంగా పోయిందని చింతించేవారు. అందువల్ల ఇంటి వ్యవహారాలన్నీ సాధ్యమయినంత వరకూ నేనే చూసుకొనేదాన్ని. ఒకసారి నాకు బాగా జబ్బు చేసింది ఆరు నెలలవరకూ మంచం దిగలేదు. ఆ ఆరునెలలూ ఆయన కలం పట్టుకోలేదు. ఇరుగుపొరుగు ఆడవాళ్ళు పొద్దస్తమానం వస్తూపోతూవుంటే, ఆయన బయట కూర్చొని విసుక్కొనేవారు"

"వీళ్ళు ఎప్పుడూ మన ఇంటిచుట్టూ తిరుగుతారు ఎందుకూ?" అన్నారు విసుక్కుంటూ. "పాపం! తమపనులుకూడా వదిలేసి నన్ను చూట్టానికి వస్తుంటారు. మీకెందుకంత విసుగు?" అన్నాను.

"ఏం ? నేపని బయట వంటరిగా కూర్చోవటం?"

"ఏదైనా రాసుకోండి. పనిలేకుండా ఎందుకు కూర్చుంటారు?"

"నువ్వు ఇలా ఉన్నంతవరకూ నేనేమీ రాయలేను."

"అదే తగ్గిపోతుంది. దిగులెందుకు?" అన్నానే కాని, నాకు ఈసారి నయమవుతుందో కాదోనని సందేహంగానే వుంది. ఆ రోజుల్లో నేను 'సంగ్రహణీ'తో బాధపడుతున్నాను.

"తగ్గే లక్షణాలేమీ నాకు కన్పించటం లేదు. నువ్వు నాదగ్గర దాస్తున్నావు" అన్నారు.

"ఆరోజువస్తే తప్పించుకోవటం ఎవరితరం? అయినా నేను పోయినంతమాత్రాన మీకేం మునిగిపోతుంది?"

"నాకేమీ మునిగిపోదు. నేనే మునిగిపోతాను" అన్నారు. కళ్ళల్లో గిర్రున నీరుతిరిగింది.

"అరే! నేను తమాషాగాఅంటే మీరు ఎందుకంత ఇదవుతారు?" అన్నాను.

"నువ్వేమన్నా చెప్పు! నాకేమో సందేహంగానే వుంది."

"లేదు. నాకు తప్పక నయమవుతుంది" అన్నాను.

ఆరోజుల్లో యింటిపని అంతా స్వయంగా ఆయనే చూసుకొనేవారు. కొంచెం తగ్గినతరవాత మా తమ్ముడువచ్చి తన ఇంటికి తీసుకెళ్ళాడు. ఆయనకూడా అక్కడే రెండు నెలలవరకూ ఉన్నారు. నాకు పూర్తిగా తగ్గినతరవాత వెళ్ళిపోయారు. నేనుమాత్రం మా తమ్ముడిదగ్గరే ఉన్నాను.

1924 నాటి విషయం. ఆయన పెద్ద మేనకోడలు వివాహం జరుగుతుంది. అదే సమయంలో బన్నాకు రక్తవిరోచనాలు అవుతున్నాయి. పెళ్ళికి వెళ్ళనా, లేదా అని అడిగారు. నేను వెళ్ళకపోతేనే మంచిది అన్నాను.

"తల్లిలేని పిల్లలు. పాపం! నేనుకూడ వెళ్ళకపోతే వాళ్ళు ఏడుస్తారు" అంటూ ఆయన వచ్చేఏడుపును ఆపుకోటానికి ప్రయత్నించారు.

"సరి వెళ్లండి! బన్నీను నేను చూసుకుంటాను. మీరు ఉండిమాత్రం చేసేది ఏముంది?" అన్నాను

ఆయన పెళ్ళికివెళ్లారు. నాలుగురోజులకు తిరిగి వచ్చారు. అప్పటికి బన్నీకు చాలావరకు తగ్గి ది. "భగవంతుని దయవల్ల తగ్గింది" అన్నాను.

"భగవంతునిమీదభక్తి ఎప్పటినుండి?" అన్నారు.

"బన్నీ ఎంతజబ్బులో ఉన్నాడు. నాలుగు రోజుల్లో తగ్గిపోయి ది. అది సరే! పెళ్ళి ఎలాజరిగింది?"

"పెళ్ళి బాగానే జరిగింది. అప్పగింతలుపెట్టేదృశ్యం చాలా హృదయ విదారకంగా ఉంటుంద" అన్నారు.

"మేనమామ లాంఛనాలన్నీ నేను చెప్పినట్లు జరిపారా?" అన్నాను.

"అవన్నీ నాకు తెలియవు. తీసుకెళ్ళినవన్నీ మా బావచేతికి ఇచ్చాను" అన్నారు.

23 ఆగష్టు 1924 నేను లహమీలో వున్నాను. ఆయన ఏదో ప మీద లఖ్నో వెళ్ళారు ఆయన తమ్ముని భార్యకు నిండు నెలలు. ఏ అర్ధరాత్రి మంత్రసానిని పిలవాల్సి వస్తుందోనని, మా నౌకర్ని అక్కడే పడుకోమన్నాను. పొద్దున్నే మా బావగారు నౌకర్ని మంత్రసానికోసం పంపారు. మంత్రసాని ఆరుగంటలకు వచ్చింది. నౌకరు ఇ టికి ఎనిమిదిగంటలకు వచ్చాడు. నేను వాడిని కోప పడ్డాను నేను కోపపడటం విని మా బావగారు కిందకూర్చొని నన్ను తిట్టసాగారు. నాకూ చాలా కోపంవచ్చింది. ఆ మాటలు వినిపించు కోకుండా ఉండటానికి ప్రయత్నించాను. చాలాసేపటివరకూ సాధి స్తూనే ఉన్నాడు. నాకు ఒకరిచేత మాటపడడం అలవాటు లేదు. ఏడ్చాను. సాయంకాలానికి కళ్లు వాచాయి, తలనొప్పి వచ్చింది.

ఆయన సాయంకాలం నాలుగు గంటలకు ఇంటికివచ్చి అలా గున్నావేమని అడిగారు. నాకు ఏడుపు పొర్లుకొస్తుంది. గబగబా

గదిలోకి వెళ్ళిపోయాను. నేను ఏడవటం ఆయన కళ్ళబడకుండా ఉండా లని నా ఉద్దేశం. కాని, ఆయన నావెంటనే గదిలోకి వచ్చి చెయ్యిపట్టుకొని అడిగారు: "ఏం లావున్నావు" అని. నాకు ఏడుపు ఆగేది కాదు. తనమీద ఒట్టు వేసుకున్నారు. చెప్పక తప్పిందికాదు.

"నేను ఇప్పుడే అడుగుతాను ఉండు! వాడికి నిన్ను కోప్పడే అధికారం ఏముందో?" అన్నారు.

"ఆయన అంటే వాళ్ళే అంత! మీ వదినను కూడ ఎప్పుడూ కోపపడుతూ నేఉంటా." అన్నాను ఆయన్ను శాంతపరచాలనే ఉద్దేశంతో.

"తన భార్యకాబట్టి కోప్పడే అధికారం ఉంది. ఇతర స్త్రీలను కోప్పడే అధికారం ఏముంది?"

"పోనివ్వండి! అలవాట్లను తప్పించటం తేలికకాదు"

"నేను ఇప్పుడే వెళ్ళి అడుగుతాను."

"పెద్దవారు పోనివ్వండి" అంటూ చేతులుపట్టుకొని బతిమాలాను.

"అసలు ఆ విషయం నాకు ఎందుకు చెప్పావు?" అన్నారు.

"మీరు ఒట్టు వేసుకున్నారు చెప్పక తప్పిందికాదు" అన్నాను.

"నేనూ నీకంటే పెద్దవాడనే. రేపటినుండి నేనూ తిడతాను!" అన్నారు.

"మీరు తిడితే నేను సహించలేను. అసలు నేను తప్పు చేస్తేగదూ మీరు తిడతారు!" అన్నాను.

"ఉదయం ఏం తప్పుచేశావని తిట్లుతిన్నావు?" అన్నారు.

1925

ఒకసారి 'రాయబరేలీ' స్కూల్లో జరిగిన ఒక 'గల్ప సమ్మేళనానికి' ఆయన్ను అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. ఒక్క రోజులోనే వస్తానని చెప్పిపోయిన మనిషి నాలుగురోజులైనా కాని రాలేదు. నాకు చాలా కోపంవచ్చింది.

"నేనేం చేసేది చెప్పు! నాకు మాత్రం ఇంటినిగురించిన ఆలోచన ఉండదనంటావా?"

"ఆచింతే ఉంటే ఇన్నిరోజులు ఎలా వుంటావు? నాలాగ ఇంట్లోనే కూర్చొనివుంటే మీకూ తెలుస్తుంది" అన్నాను.

"నేను పనిలేకుండా ఎప్పుడైనా ఎక్కడికైనా వెళుతున్నానా? ఊళ్లోకకూడా పనిలేకుండా ఎక్కడికైనా వెళుతున్నానా? నువ్వే చెప్పు!" అన్నారు.

"కాన్పూరులో ఉండగా రాత్రి పదిగంటలకు వచ్చేవారు ఇంటికి!" అన్నాను.

"ఆ రోజుల్లో నేను ఎన్నిగంటలకొచ్చినా, నీ కేమీ పట్టేదే కాదుగా? ఎప్పుడైనా నాకోసం ఎదురుచూసిన పాపాన పోయావా?" అన్నారు.

"టూర్ లోనే హాయిగా కాలమంతా గడిపివుండవచ్చుగా?"

"నువ్వు వట్టి పిచ్చిమొద్దువు అందువల్లనే అంత ఉపేక్షా భావంతో ఉండేదానివి. కాని, నేనుకూడా నీలాగే ఎలా ప్రవర్తించగలను!" అన్నారు.

"నేను పిచ్చిమొద్దునూ, తెలివితక్కువ దద్దమ్మనూ కూడ. అదిసరే! ఇన్ని రోజులు ఆలస్యం ఎందుకయిందో ముందు చెప్పండి!" అన్నాను.

"వాళ్లు రానివ్వకపోతే ఏంచెయ్యను? వాళ్లు అంత ప్రాధేయపడుతుంటేకూడా వచ్చేస్తే ఏమనుకుంటారో నువ్వే ఆలోచించు! ఇకనుంచి నువ్వుకూడా నాతో వస్తూఉండు! ఏగొడవా లేకుండా శాంతంగా ఉండవచ్చును" అన్నారు.

ఈరోజు ఆ విషయాలను గుర్తుచేసుకుంటూ ఏడుస్తున్నాను. నిజంగా నేను పిచ్చిమొద్దునే. ఆయన జైల్లోవున్నా 'కలం, కాగితం, నేనూ' కావాలి. కాని, నేను నాసర్వస్వాన్నీ కోల్పోయికూడా సుఖంగా ఉన్నాను.

బొండాం శాస్త్రుర్లు:

1926 నాటి విషయం. ఆరోజుల్లో ఆయన 'మాధురి' సంపాదకుడుగా పనిచేస్తున్నారు. 'మాధురి'లో బొండాంశాస్త్రుల్లు అనే ఒక కథ రాశారు. పండిత్ కృష్ణ బిహారీశర్మకూడ 'మాధురి'లోనే పని చేస్తున్నాడు. ఒక శాస్త్రుల్లు వీళ్ళిద్దరిమీదా కేసుపెట్టాడు. ఇద్దరూ ఐదేసివందలచొప్పున జామీనుకూడా కట్టారు. మాధురీ మేనేజరు విష్ణునారాయణకు ఆ కథ చాలా నచ్చింది. మేనేజరే ఆ కేసు కయిన ఖర్చునంతా భరించాడు. డెహరాడూన్ నుండి ఇద్దరు బారిష్టర్లను పిలిపించారు. వాళ్ళకు రోజుకు తొమ్మిదివందలు ఇచ్చేవారు. విచారణరోజు కాన్పూరులోఉన్న వకీల్లూ, బారిష్టర్లూ, అందరూ వచ్చారు. కోర్టులో జనం కిటకిటలాడుతుంది.

మాజిస్ట్రేటు కేసు కొట్టేశాడు. బొండాం శాస్త్రుల్లతో "మీ రింకేమయినా చెబుతారా? కుక్కిన పేనులాగ దొడ్డిదోవన జారు కోవటం క్షేమకరంఅని నా ఉద్దేశం" అన్నాడు మాజిస్ట్రేటు.

మాజిస్ట్రేటుమాటలకు అందరూ నవ్వుకుంటూ బయటకు వచ్చారు. ఆ నెల 'మాధురి' కాపీలన్నీ అమ్ముడుపోయాయి. "బొండాంశాస్త్రి" ఎవరో ఇప్పుడు ప్రపంచానికి తెలిసిందిఅని అందరూ ఆఫీసులో నవ్వుకున్నారు.

*  *  *

మా బావ రెండోపెళ్ళి చేసుకున్నాడు. మొదటిభార్యకు పిల్లలుఉన్నారు. అయినప్పటికీ ఆయన ఆస్తినంతా రెండోభార్యకు రాసేశాడు. దాదాపు మూడులక్షల ఆస్తివుంది అతనికి. ఆ విషయం విని నాకు చాలాకోపం వచ్చింది.

"అతను ఆస్తంతా భార్యకే రాశాడు. ఎలాంటిపనిచేశాడో చూశారా?" అన్నాను ఆయనతో.

"ఏం మంచిపనే చేశాడు! భార్యకు రాయక ఇంకెవరికి రాస్తాడు?" అన్నారు.

"బాగా నేవుంది మీావరస! పిల్లలుండగా భార్యకు రాయట మేమిటి?" అన్నాను.

"పిల్లల కేం? కాళ్లూ చేతులూ అక్కరకొచ్చినవాళ్ళు! వాళ్ళ బతుకులు వాళ్ళు బతుకుతున్నారు" అన్నారు.

"ఆస్థి లేకపోతే ఏంచేసేవాడు? అప్పుడు ఆమె భారాన్ని పిల్లలమీాదనే వేసేవాడుగా?" అన్నాను.

"ఉన్నప్పుడు అంతదూరం ఎందుకు ఆలోచించాలి? అయినా ఈ పిల్లలు తమ మారుటితల్లిని చూస్తారనిమాత్రం నమ్మకం ఏముంది?" అన్నారు.

"అందుకేనా 'పిల్లలుగల విధవ' అనే కథరాశారు?" అని అడిగాను.

"ఇలాంటివి రోజుకు ఎన్ని కేసులు చూడటం లేదు?"

"అందరి హృదయాల్లోకీ మీారు ఎలా ప్రవేశించగలుగు తున్నారు?" అన్నాను.

"నువ్వూ రచయిత్రివేగా? నువ్వే ఆలోచించుకో" అన్నారు.

"మీాకూ మారుటితల్లేగావుంది? మీారు ఆమెను ఎంత గౌర విస్తున్నారు?" అన్నాను.

"మన పిల్లలు మనలాగే ఉన్నారా! ఎన్నిసార్లు నిన్ను ఎదిరించటం లేదు? అంతకంటె కోపాన్ని కలిగించే విషయం నాకు ఇంకొకటి ఏమీాలేదు. పిల్లలను మనం 'అలా చెయ్యి, ఇలా చెయ్య'మని ఆజ్ఞాపించకూడదు. ఇదంతా తెలిసినవాడు కాబట్టే తన ఆస్థినంతా భార్యకు రాశాడు. ఆయన ఎంతో తెలివీ, దూరాలోచన గల వ్యక్తీ, పైగా వకీలు! పెద్దమనిషి అయినవాడు ఎవడైనా అపనే చేస్తాడు. చావుబతుకులు మన చేతుల్లో లేవు. లేకపోతే ఎవడికి తన జీవితభాగస్వామిని వదలాలని ఉంటుంది!" అన్నారు.

"మరి! బడితపూజ చేసేవాళ్ళ సంగతేమిటి?" అన్నాను.

"వాళ్ళు మనుషులుకారు పశువులు. గార్హస్థ్య జీవితంలోని ఎలాంటి రసానుభూతినీ వాళ్ళు పొందిఉండరు. మీా బావచేసిన పనిని

ప్రశంసించకుండా ఉండలేను. ప్రతిపురుషుని కర్తవ్యంకూడా అదే. భార్యను ఇతరుల ఆశ్రయంలో వదిలేసి పోయేటంత కృతఘ్నుడు ఈ ప్రపంచంలో ఇంకొకడు ఉండడు" అని అన్నారు.

"ఆడదానికి ఆస్తిపాస్తులను చూసుకొనేశక్తి ఉండొద్దా!" అన్నాను.

"ఎంత అమాయకురాలవు! అందుకని ఆడవాళ్ళకు ఆస్తిపాస్తులంటూ ఉండగూడ దంటావా? జడ్జీని ఎవరినైనా నియమించవచ్చును. మీ బావకూడ అలాగేచేశాడని విన్నాను" అన్నారు.

"మళ్ళీ పెళ్ళిచేసుకొని ఆయన అనుభవించిన సుఖంఏమిటి?" అన్నాను.

అదంతా వారి ఇష్టాయిష్టాలమీద ఆధారపడి ఉంటుంది. మానవుడు తన శ్రమఫలాన్ని అనుభవించగోరతాడు. పిల్లలకొరకు తమ సర్వసుఖాలను త్యజించాలని ఎక్కడవుంది! వాళ్ళకు విద్యాబుద్ధులు చెప్పించేంతవరకే పెద్దవాళ్ల కర్తవ్యం తరవాత వాళ్లే తమ జీవితాలను నిర్మించుకుంటారు" అన్నారు ఆయన.

"పిల్లలుమాత్రం పరాయివాళ్లా!" అన్నాను.

"భర్త చచ్చిపోతే భార్య విధవఅవుతుందికాని పిల్లలుకారు. ఒకరకంగా వృద్ధుడైన తండ్రి చచ్చిపోతేనే సంతోషిస్తారు కొడుకులు. న్యాయంగా ఆస్తినంతా చిన్నపిల్లలకూ, భార్యకూ రాయాలి" అన్నారు.

"అప్పులు తీర్చాల్సినబాధ్యత పిల్లలమీదనేగా పడుతుంది!" అన్నాను.

"ఇంత ఆస్తి కలవాళ్ళకు అప్పులు ఎందుకుంటాయి ?"

"అప్పులు లేకపోతే మీరుచెప్పేది బాగానేఉంది లెండి!"

"నిజంగా మీ బావను నేను ఎంతగా గౌరవిస్తున్నాను. ఆయన తన ఆస్తిని భార్యకు రాయకుండావుంటే 'మోసగాడు' అని ఉండేవాడిని. ఆయన చాలా మంచిపని చేశాడు" అన్నారు.

1928:

మేము లఖ్నోలో ఉన్నరోజుల్లో 'కాలాకాంకర్' రాజాగారు మాఇంటికి వచ్చారు. రాజాగారితో ఇంకా చాలామంది కూడా ఉన్నారు. తాంబూలం పంపించాను. వాళ్ళు వెళ్ళిపోయిన తరవాత ఆయన లోపలకువచ్చి రేపు 'కాలాకాంకర్' వెళుతున్నానని చెప్పారు.

"ఆ వచ్చిన పెద్దమనిషి ఎవరు?" అని నేను అడిగాను.

"ఆయనే రాజాగారు!" అన్నారు.

"వాళ్ళను ఎక్కడ కూర్చోపెట్టారు?"

"నేను కూర్చొనే చోటనే, ఇంకెక్కడ?" అన్నారు.

"నేను మీకు సవాలక్షసార్లు చెప్పాను రెండు మూడు కుర్చీలు తెప్పించి మీ గదిలో వేయించమని. వాళ్ళే మనుకుంటారు? మీకు బొత్తిగా సిగ్గులేదు" అన్నాను.

ఆయన పెద్దగా నవ్వుతూ అన్నారు. "రాజా మహారాజాలకు స్వాగతాలు ఇవ్వడమే నాకు పనా ఏమిటి? నేను కూలిపని చేసుకొనే వాడిని. నాకు కుర్చీలైనా, సోఫాలైనా భూదేవియే! ఎవరో ఏమో అనుకుంటారని తలకుమించిన పనులు చెయ్యమంటావా?"

"ప్రతివాళ్ళూ ఉన్నంతలోనే దర్జాగా కన్పించాలని చూస్తారు గదా!" అన్నాను.

"నువ్వుచెప్పేది బాగానేఉంది. కాని యిది యూరోప్ కాదు; భారతదేశం. ఈ దేశంలో నివసించే వ్యక్తి ఒకటింటికి సగటు ఆదాయం ఆరుకానులు. కొంతమందికి పొట్టనిండాతిండీ, వంటినిండా గుడ్డలూకూడా లేవు. అలాంటప్పుడు విలాసవస్తువులు ఎలాలభిస్తాయి? అదీగాక ఎంతోమంది ఆకలిజ్వాలలకు ఆహుతి అవుతూవుండగా, విలాసాలకు ప్రాకులాడినంత అధర్మం ఇంకోటిలేదు" అన్నారు ఆవేశంతో.

"మీరు ఒక్కరూ మడికట్టుకొని కూర్చోగానే సరిపోయిందా ఏమిటి ?" అన్నాను.

"అంటే నీ ఉద్దేశ ? అ దరితో పాటు నన్నూ గడ్డితినమనేనా ? ఎవరిసిద్ధాంతాలు వారివి ! నాకు ఇలా జీవించటంలోనే ఆనందం ఉంది. అదిలేదు, ఇదిలేదు అనే బెంగలేకుండా రోజులు గడిచి పోతున్నాయి. ఇవ్వాళ కుర్చీలూ, బెంచీలూ కొంటే, రేపు సోఫాలూ, తివాచీలూ లేవు అనిపిస్తుంది. ఇలాగే ఒకటి తరవాత ఒకటి కావాలనే కోర్కె జనిస్తూనే ఉంటుంది. ఒకసారి భ్రమలో పడ్డామా, ఇక ముక్తి అనేమాటే ఉండదు. ఈ విలాసాలవల్లనే ఈ రోజు మనం బానిసత్వంలో పడిఉన్నాము. మనపూర్వుల పాపఫలితాన్ని మనం అనుభవిస్తున్నాము. ఇక మనంకూడా ప్రారంభిస్తే మన దేశం అధఃపతనానికి అంతుఅంటూ ఉండదు" అన్నారు.

"చిన్న చిన్న వాటికికూడా ఏవో సిద్ధాంతాలను అంటగడ తారు" అన్నాను.

"మన దేశవాసులు నిరాడంబర జీవితాన్ని అలవరుచుకో వాలి. మనం చూడవలసింది మనకంటే పైన ఉన్నవాళ్ళను కాదు. కిందవాళ్ళను ! మనకంటే బీదస్థితిలో ఉన్నవాళ్ళను చూస్తూ, వాళ్ళతో కలిసి పోవటానికి ప్రయత్నించాలి" అన్నారు.

"ఈరోజు, స్వతంత్రం, స్వతంత్రం, అంటూ అరిచేవాళ్ళంతా డబ్బు ఉన్నవాళ్ళేగా ! తిండికి లేని వాళ్ళకు అంతతీరిక ఎక్కడఉంది ?"

"ఈ పెద్దవాళ్ళ కారణంగానే మనకు బానిసత్వం సంప్రాప్తిం చింది. మళ్ళీ వాళ్ళే దాన్ని తొలగించటానికి ప్రయత్నిస్తున్నారు. వాళ్ళు తమకోసమే ఇదంతా చేస్తున్నారు. అంతర్వాణిని ఎప్పటికైనా వినక తప్పదు. పెద్ద పెద్ద దుర్మార్గుల్లో, గజదొంగల్లోనే మార్పు రావటం చూస్తున్నాము" అన్నారు.

"అదంతా వాళ్ళవాళ్ళ కర్మ. భగవంతుడుకూడ నొసటి వ్రాతను తప్పించలేడు. మనం ఎంత బాధపడ్డా ప్రయోజనం శూన్యమే" అన్నాను.

"నేను యీ బీదవాళ్ళందర్నీ ఉద్ధరిస్తానని చెప్పటంలేదు. వాళ్ళలో శక్తి రానంతవరకూ ఎవరూ ఏమీ చెయ్యలేరు" అన్నారు.

"ఆసమయం వస్తే భగవంతుడే వాళ్ళకు ఆ శక్తిని ప్రసాదిస్తాడు" అన్నాను.

"భగవంతుడు మనసులోఉండే ఒక భూతం. ఆ భూతం మనలను పిరికిపందలను చేస్తున్నది. బలవంతులదే యీ ప్రపంచం. ఈ మూఢనమ్మకాలు ఉన్నకొద్దీ స్వశక్తినీ, బలాన్నీకూడ నాశనం చేస్తున్నాయి" అన్నారు.

"అయితే మహాత్మాజీ రాత్రింబవళ్ళు 'ఈశ్వర్! ఈశ్వర్!' అని అరుస్తుంటారేం?"

"ప్రజానీకంలో ఇంకా పూర్తిచైతన్యం రాలేదు. శతాబ్దాలుగా భగవంతునిమీద ఉంటూవచ్చిన నమ్మకాన్ని మానవుడు ఒక్కసారిగా ఎలా వదులుకోగలడు? ఒకేసారి ప్రజానీకాన్ని భగవంతునినుండి వేరు చెయ్యటానికి ప్రయత్నించటం, వినాశనానికి హేతువే కాగలదు. బహుశా అందువల్ల మహాత్మాజీ భగవంతుని అంత ఎక్కువగా గుర్తుచేస్తూ ఉండవచ్చును" అన్నారు.

"మీకు భగవంతునిలో నమ్మకంలేదని ప్రపంచమంతా నాస్తికులమయం కాదుగా?" అన్నాను.

"నేను నిరాధారంగా మాట్లాడటంలేదు. ఈ రోజు మతం పేరిటా, భగవంతునిపేరిటా, ఎన్ని అన్యాయాలూ, ఘోరాలూ జరగటంలేదూ? ముఖ్యంగా స్త్రీలే ఎక్కువగా ఈ మూఢనమ్మకాలకు గురి అవుతున్నారు" అన్నారు.

"అయితే స్త్రీలే మూర్ఖులు అంటారు?" అన్నాను.

"నిజ చెబితే కోపం ఎందుకు. స్త్రీలను నేను జన్మతా మూర్ఖులు అనటంలేదు. పురుషులే వాళ్ళను అలా తయారుచేశారు."

"మరి మీరు ఎందుకలా చేశారు?"

"బ్రిటిష్ ప్రభుత్వం మనలను మూర్ఖులను చేసి ఎలా లాభాలను పొందుతూందో, అలాగే పురుషులుకూడా, తమ స్వార్థపూర్తి కొరకు స్త్రీలను మూర్ఖులనుచేశారు, చేస్తున్నారు" అన్నారు.

"మనలను మూర్ఖులనుచేస్తే ఇంగ్లీషువాళ్లకు చాలా లాభాలు కలుగుతున్నాయి. కాని, మమ్మల్ని మూర్ఖుల్ని చేస్తే మీ కొచ్చే లాభంఏమిటి? స్త్రీ, పురుషులు సమాజంలో సమానభాగాలు. శరీరంలోని ఏఒక్క భాగానికి దెబ్బతగిలినా మిగిలిన అవయవాలు కూడా బాధపడతాయిగదా?" అన్నాను.

"అదంతా పూర్వకాలపుమాట. దేవాలయాలపేరుతో, మసీదులపేరుతో కొట్టుకునే మన మూర్ఖప్రజలను చూస్తుంటే ఇంగ్లీషువాళ్ళకు సరదాగా ఉండటంలేదూ? అలాగే స్త్రీల మూర్ఖత్వాన్ని చూస్తున్న పురుషులకుకూడా, సరదాగా ఉంటుంది" అన్నారు ఆయన.

"స్త్రీలను మూర్ఖులనుచేసిన పురుషులే మూర్ఖాతిమూర్ఖులు. ఇతరుల సుఖంచూడలేక ఏడ్చి కళ్లు పోగొట్టుకున్నట్లయింది మీపని" అన్నాను ఆవేశంతో.

"కాలంతోపాటు మీరుకూడా ఎందుకు మారలేక పోతున్నారు?" అన్నారు.

"మీరు మారని స్తేగదూ?" అన్నాను.

"స్త్రీలు తమ అభివృద్ధికి తామే ప్రయత్నించాలి" అన్నారు.

"చూస్తూఉండండి! చేస్తారోలేదో? మీరు విడదీసిన శక్తిని కూడదీసుకోవద్దూ?" అన్నాను.

ఇలాంటి విషయాలను చర్చించేప్పుడు ఆయన ముఖంమీద విషాదరేఖలు అలుముకొనేవి.

నేను ఏభయ్ రూపాయలుపెట్టి ఫర్నిచర్ కొన్నాను. ఆయన మాత్రం తన గదిలో కిందకూర్చొనే తన పని చూసుకొనేవారు. ఎవరైనా వచ్చినప్పుడుమాత్రం ఆ ఫర్నీచర్ ఉన్న గదిలోకి వచ్చే

వారు. ఆ గదినీ, గదిలోవున్న కుర్చీలనూ, టేబుల్‌నూ స్వయంగా తుడిచేవారు. ఆయనకు లేనిపోనిపని కల్పించానే అనిపించేది. ఒకో సారి ఆయన చేతిలోని చీపురు లాక్కొనేదాన్ని.

మహాత్మాజీ దర్శనం :

1928 నాటి విషయము. 'హిందుస్తానీ ఎకాడమీ' సమావేశం ప్రయాగలో జరిగింది. వర్కింగ్ కమిటీ మీటింగుకూడా రెండు రోజులముందు అక్కడే జరిగింది. మహాత్మాజీకూడ ఆ సభలలో పాల్గొన్నారు. ఆయనకు ఎన్నోరోజులుగా మహాత్మాజీని కలుసుకోవాలని ఉండేది. తన కోర్కెను సుందరలాల్‌కు తెలియపర్చారు. సుందర్‌లాల్ దానికి జవాబుగా రెండు రోజులు ముందేవస్తే మహాత్మాజీని కలుసుకోవచ్చునని రాశాడు. ఆయన సభలకు రెండుమూడు రోజులుముందే బయలుదేరటం చూసి ఇప్పటినుండే అక్కడకు వెళ్ళి ఏం చేస్తారని అడిగాను.

"మహాత్మాజీని చూడాలి.అందుకే ముందుగా వెళుతున్నాను" అన్నారు.

"ఎకాడమీ పూర్తిఅయేంతవరకూ మహాత్మాజీ ఉంటారుగా?" అన్నాను.

"ఎలా చెప్పగలం ? చివరివరకూ వుంటారో వుండరో ?"

"అయితే ముందే వెళ్ళి కూర్చోండి !" అన్నాను కోపంగా.

ఆయన రెండురోజులు ముందువెళ్ళి సభలు ముగిసిన తరవాత రెండురోజులకు వచ్చారు. అప్పటికీ ఆయనకు మహాత్మాజీ దర్శనం లభించలేదు.

"రెండురోజులు ముందు వెళ్ళినా మహాత్మాజీ దర్శనం లభించలేదేం ?" అని అడిగాను.

"పాపం ! ఆయనకు తీరిక ఎక్కడ ? వేలకొద్దీ జనం ఆయన దర్శనానికి వచ్చారాయె ! పైగా ఎన్నో ఉత్తరాలు చదువుకోవాలాయె !" అన్నారు.

"ఆయనకు ఆ పనులన్నీ ఎప్పుడూ ఉండేవేగా ? అంతమందికి ఆయనదర్శనంకాగా మీకుమాత్రమే ఎందుకు కాలేదు" అన్నాను విసుగ్గా.

"వాళ్ళందరకూ కావాల్సింది ఆయన్ను చూడటం. కాని, నేను పదిపదిహేను నిముషాలు ఆయనతో మాట్లాడా లనుకున్నాను. ఆయన ఎంతో చక్కగా మాట్లాడతారని విన్నాను. ఆ అభిలాష తోనే అక్కడకు వెళ్లాను. కేవలం రూపాన్ని చూట్టానికికాదు" అన్నారు.

"పాపం! నాలుగురోజుల సమయమూ వ్యర్థంగాపోయింది, పైగా దర్శనమూ లభించలేదు" అన్నాను నవ్వుతూ.

"అదంతా నా దురదృష్టమే!" అన్నారు.

తరువాత 1935 లో 'హిందీపరిషత్' వార్ధాలో జరిగింది. మహాత్మాజీ స్వయంగా, ఆయన్ను 'హిందీ, హిందుస్తానీ' సమస్యను గురించి చర్చించటానికి రమ్మని కబురుపంపించారు. ఆయనకు 'హంస'ను పరిషత్‌కు అప్పగించాలనే ఉద్దేశంకూడా ఉంది. నాలుగురోజులు వార్ధాలో ఉన్నారు.

వార్ధానుండివచ్చి నాతో అన్నారు: "మహాత్మాజీలో నేను ఊహించుకున్నదానికంటే కూడా ఎక్కువ గొప్పతనాన్నే చూడ గలిగాను. ఆయన రూపం, మాటలూ ఎదుటివారి హృదయాలను సూదంటురాయిలాగా ఆకర్షిస్తాయి. ఎంత అబద్ధాలకోరు అయినా ఆయనముందు నిజం చెప్పేస్తాడు. ఎలాంటి దురాత్ముడిలో కూడా ఆయనముందు ఉన్నంతసేపూ అణకువా, ప్రేమా ప్రవేశిస్తాయి. ఏదో అనూహ్యమైన ఆకర్షణను ఆయనలో చూశాను" అన్నారు.

"అలాగయితే మహాత్మాజీ జిన్నాను ఎందుకు మార్చలేక పోయారు!" అన్నాను.

"ఆ సమయమూ త్వరలోనే రావచ్చును" అన్నారు.

"ఆయన దర్శనంతో ఆయనకు శిష్యులయిపోయారన్న మాట!" అన్నాను.

"ఆయన్ను చూడకముందే నేను ఆయనకు శిష్యుడను. సహజంగానే నా సిద్ధాంతాలు ఆయన సిద్ధాంతాలకు అనుకూలంగా ఉన్నాయి. మహాత్మాజీకూడా కర్షక-కార్మికుల సమస్యలను పీడదీయటానికి పాటుపడుతున్నారు. నేనూ నా రచనలద్వారా అదే చేయాలని ప్రయత్నిస్తున్నాను. ఆయన హిందూ, ముస్లిముల ఐక్యతకొరకు పాటుపడుతున్నారు. నేనూ హిందీ, ఉర్దూలను ఐక్యంచేసి హిందుస్తానీని బలపరచటానికి ప్రయత్నిస్తున్నాను" అన్నారు.

"మీరు హిందూస్తానీని ఎలా బలపరచగలరు?" అడిగాను.

"నేను రాస్తున్నదంతా హిందుస్తానీలోనేగా!" అన్నారు.

"మీరు రాసినంతమాత్రంచేతనే దాన్ని హిందుస్తానీ అనగలరా!" అన్నాను.

"దేన్ని సాధారణ ప్రజలు తెలుసుకోగలరో, దేన్ని హిందూ, ముస్లిములు ఇద్దరూ అర్థంచేసుకోగలరో అదే హిందుస్తానీ, ఎప్పటికైనా హిందీ, ఉర్దూ కలిసినభాషే రాష్ట్రభాష కాగలదు" అన్నారు.

"హిందుస్తానీ ఎలా రాష్ట్రభాష కాగలదు? మన దేశజాతీయభాష కాగల అర్హత ఒక్క హిందీకే ఉంది" అన్నాను.

"మన దేశాన్ని హిందుస్తాన్ అని ఎందుకు అంటారో తెలుసా! ముస్లిములు వచ్చి మన దేశాన్ని ఆక్రమించుకున్న తరువాతే దీనికి ఆ పేరువచ్చింది. దేశాన్ని హిందుస్తాన్ అనటానికి మన కేమీ సందేహం లేదు. కాని, భాషను హిందుస్తానీ అనటానికి తలకాయలు పగలకొట్టుకొని చస్తున్నాము" అన్నారు.

"అయితే మీ ఉద్దేశం హిందీలో పారసీ శబ్దాలనూ, ఉర్దూలో సంస్కృత శబ్దాలనూ ఇరికించమనా?" అన్నాను.

"ఏభాషలో, ఏశబ్దాలనూ ఇరికించ నవసరంలేదు. జాతీయ భాష జనం సాధారణంగా మాట్లాడేది అయివుండాలి. అందులో ఏశబ్దాలు కలిసిపోయినా తప్పు లేదు. ఒక దేశంలోని ఎన్నోజాతులు కాలక్రమేణా కలసిపోతుంటే ఎవరు అడ్డుపడుతున్నారు? అలాగే భాషలోకూడ ఇతరభాషల శబ్దాలు కలిసిపోతాయి. అందులో కొట్టుకుచావాల్సినంత ప్రమాదం ఏముంది?" అన్నారు.

"రేపు హిందూ, ముస్లిములమధ్య ఇచ్చిపుచ్చుకొనే సమస్యలు వస్తే, దాన్నికూడా హిందువులు సహించగలరా?" అన్నాను.

"ముస్లిములు అధికారంలోఉన్న రోజుల్లో హిందువులు తమ కన్యలను పాదుషాలకు ఇవ్వలేదా? కాని ముస్లిములు వాళ్ళ కన్యలను హిందువులకు ఇచ్చినట్లు ఎక్కడైనా చదివావా! హిందువులచేత బహిష్కరించబడినవాళ్లు ఎందరు ఇస్లాంమతం పుచ్చుకోలేదు? నీ హిందూసోదరులు ఇదంతా ఎందుకు ఆలోచించరు?" అన్నారు.

"మీరు ముస్లిం పక్షపాతిలాగ ఉన్నారు" అన్నాను.

"నేను ఎవరి పక్షపాతినీ కాదు. శత్రువునుకూడా కాదు" అన్నారు.

"అయితే మీరు 'రాముడి' ని ఒప్పుకుంటారా లేక 'రహీమ్' నా?" అడిగాను.

"నాకు రాముడూ, రహీమ్, క్రీస్తూ అంతా శ్రద్ధాపాత్రులే" అన్నారు.

"అది సరే! ఇన్నిటికీ మీరు ఎవరు?" అడిగాను.

"నేను మానవుడిని, మానవత్వం ఎవరిలో కన్పిస్తుందో వాళ్ళనే నేను గౌరవిస్తాను, పూజిస్తాను. నాకు హిందూమిత్రులూ ఉన్నారు. ముస్లింమిత్రులూ ఉన్నారు. వాళ్లిద్దరిలో నాకు ఎలాంటి భేదమూ కన్పించదు" అన్నారు.

"భేదం ఎందుకు లేదు ముస్లిములు, హిందువులు పూజించే గోవును వధిస్తారు" అన్నాను.

"ముస్లిములు ఒక ముసలి ఆవును చంపితే మన హిందూ సోదరుల రక్తం కుతకుతలాడిపోతుంది. కాని ఇంగ్లీషువాళ్ళు వందల కొద్దీ ఆవులను చంపినా చూస్తూ ఊరుకుంటారేం? మనం మందిరాల్లో దేవతలకు మేకలను బలియెందుకు ఇస్తున్నాం? మేకమాత్రం ఆవు లాంటి ప్రాణి కాదా? హిందువులు మాంసాహారులైనా ఉదారులేనా? స్త్రీలను దుర్గతిపాలు చేసింది హిందూసమాజమే. స్త్రీ చేసిన ఒక చిన్నతప్పునుకూడా క్షమించరు. పురుషుడు ఎంత పెద్దతప్పు చేసినా పట్టించుకోరు. స్త్రీని సమాజం బహిష్కరిస్తుంది. ఇంటినుండి గెంటివేస్తారు. తిరస్కరింపబడిన హిందూ నారికి ఇస్లాంమతం ఆశ్రయాన్ని కల్పిస్తుంది. హిందూసమాజంలో పురుషులకు అన్నివిధాలా అవకాశాలు కల్పించబడ్డాయి. ముసలివాడు ముక్కుపచ్చలారని పసిబిడ్డను వివాహంచేసుకోవచ్చు, జీవించి భార్యవుండగానే, పునర్వివాహం చేసుకోవచ్చును. నిబంధనలన్నీ స్త్రీలకే ఏర్పరిచారు. సమాజ బహిష్కృతస్త్రీలు ఏఆశ్రయమూ లేక, అల్లాడి అలమటించి చచ్చిపోవాలనేగా నీ హిందూసోదరుల అభిలాష? భగవంతుడు ఏంచేస్తున్నాడో తెలియదు!" అన్నారు ఆవేశంతో.

"వేశ్యలను పట్టణంనుంచి వెళ్ళగొడుతున్నారుగదా? ఆ విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?" అడిగాను.

"స్వామీ దయానంద సరస్వతికి నేను హృదయాపూర్వక ధన్యవాదాలను అర్పిస్తున్నాను. ఇలాంటి అనాథ, బహిష్కృత, తిరస్కృత స్త్రీలకు, ఆర్యసమాజాన్ని స్థాపించి, ఆశ్రయాన్ని కలుగచేశాడు. శారదా బిల్లును ప్రవేశపెట్టిన మహానుభావుడికి కూడా మీరు ధన్యవాదాలు సమర్పించాలి" అన్నారు.

"ఈ మహానుభావు లందరకూ మేము ధన్యవాదాలు అర్పిస్తూ ఉండాలనా మీ ఉద్దేశం?" అన్నాను.

"అవును! లేకపోతే మిమ్మల్ని కృతఘ్ను లనాల్సివస్తుంది. స్త్రీల స్వాతంత్ర్యంకోసం మహాత్మాజీకూడా చాలా ప్రయత్నం చేశారు, ఇంకా కొంతకాలంవరకూ పురుషులు స్త్రీలను ఇలాగే హింసిస్తూవుంటే, హిందూకన్యలు తమ వివాహాలు తామే చేసు కుంటారు" అన్నారు.

"అలా ఎన్నటికీ జరగదు. తల్లిదండ్రుల బాధ్యత లేకుండా జరిగే పెళ్ళిళ్లు మొదట ఆకర్షణీయంగానే కన్పించవచ్చును. వాస్త వంగా చూస్తే అదంతా వట్టి భ్రమమాత్రమే" అన్నాను.

"నువ్వూ, నేనూ ప్రపంచమంతా ఏకమైకూడా దీన్ని ఆప లేము. పాశ్చాత్య సభ్యతగాలి మన దేశంలో ఎంత తీవ్రంగా వీస్తోందో యిప్పుడే తెలుస్తుంది. ఒకరోజుకు ఆ గాలిని ఆపేశక్తి ఎవరిలోనూ లేకుండాపోతుంది" అన్నారు.

"ఆ రోజు చూడకముందే నన్ను ఈ ప్రపంచంనుండి తీసు కెళ్ళమని భగవంతుని ప్రార్థిస్తున్నాను" అన్నాను.

"ఇందులో తప్పు ఏముంది? మన ప్రాచీన సభ్యతను చూసి కూడా ఇంత భయపడుతున్నావుగా?" అన్నారు.

"పూర్తిగా మన ప్రాచీన సభ్యతను రూపుమాపాలని నేను అనటంలేదే? దాన్ని సంస్కరించాలనే నా అభిమతం" అన్నాను.

"నువ్వు సంస్కరించ కోరితే, నీ పిల్లలు దాన్ని రూపుమాప గోరటంలో ఆశ్చర్యం ఏమీ లేదు. కాలానికి అనుకూలంగానే అన్ని కట్టుబాట్లూ మారిపోతాయి. అందులో ఆశ్చర్యపడవలసిందిగానీ, భయపడవలసిందిగానీ ఏమీ లేదు" అన్నారు.

ఈవిధంగా ఏదో ఒక విషయాన్నిగురించి మేము ఇద్దరం చర్చించుకుంటూనే వుండేవాళ్ళము.

### కూతురు వివాహము :

1928 లో మా అమ్మాయికి వివాహం చెయ్యాలను కున్నాము. ఆయనకు ఒక్క సంబంధమూ నచ్చటంలేదు. పిల్లవాడు

నచ్చితే పెద్దవాళ్ళు నచ్చరు, పెద్దవాళ్ళు నచ్చితే పిల్లవాడు నచ్చడు. ఒకసారి ఒక సంబంధం చూసిరాగానే, పిల్లవాడు ఎలా ఉన్నాడని, అడిగాను.

"బాగానే వున్నాడు. కాని చామనచాయగా వుంటాడు" అన్నారు.

"ఎరుపు కొరుక్కు-తింటామా ఏం?" అన్నాను.

"అయినా కొంచెం చూట్టానికి బాగా ఉండొద్దూ!" అన్నారు.

"ఈ సంబంధం తెచ్చినఅతను పిల్లవాడు బాగుంటాడనే చెప్పాడుగా!" అన్నాను.

"నేనుమాత్రం బాగా లేడన్నానా? నాకు నచ్చలేదు, అంతే!" అన్నారు.

"మీకు ఎవరు నచ్చుతారో నాకు అర్థంకావటంలేదు" అన్నాను.

"నీ వివాహం ఒక కుటుంబంతో అయివుంటే నీ కెలా ఉండేదో కొంచెం ఆలోచించు" అన్నారు.

రెండో సంబంధం ఫతేపూర్‌లో చూసివచ్చి, ఆ సంబంధం తనకు ఇష్టంలేదన్నారు. ఇంకొక సంబంధం బనారస్‌నుండి వచ్చింది. పిల్లవాడు స్వయంగా వచ్చాడు. చాలా అందంగా ఉన్నాడు. బాగా చదువుకున్నవాడు. అతను వెళ్ళిన తరవాత "పిల్లవాడికి కొంచెం చపలం ఉందిలాగుంది!" అన్నారు ఆయన నాతో. ఆయనకి అతనిలో స్థిరత్వం కన్పించలేదట. ఆ పిల్లవాడికీ, తల్లిదండ్రులకూ పడదని ఆ తరువాత తెలిసింది.

"తల్లి దండ్రులు మూర్ఖులయి ఉండొచ్చు. లేకపోతే కన్న బిడ్డలతో ఎందుకుపడదు!" అన్నాను నేను.

"నువ్వే మూర్ఖురాలులాగ కన్పిస్తున్నావు. తల్లి దండ్రులతోనే పడనివాడికి ప్రపంచంలో ఎవరితోనూ పడదు. తల్లి దండ్రులను ప్రేమించలేనివాడు ప్రపంచంలో ఇంకెవరినీ ప్రేమించలేడు" అన్నారు ఆయన.

మేము ఉన్న ఇంట్లోనే పక్క భాగంలో ఒక డాక్టరు ఉంటుండే వాడు. వాళ్లూ, మేమూ ఎంతో సన్నిహితంగా ఉండేవాళ్ళము. ఆ డాక్టరుతో మా అమ్మాయికి ఒక మంచి సంబంధం చూడమని చెప్పాను. నేను చెప్పిన పదిపదిహేను రోజులకు ఒక ఫోటో తెచ్చాడు. పిల్లవాడు బాగానే ఉన్నాడు. బి. ఏ. చదువుతున్నాడు. ఫోటో చూసి ఆయనకూడా బాగానేఉన్నాడు అన్నారు. సంవత్సరానికి అతనికి భూముల మీద దాదాపు మూడువేల రూపాయల ఆదాయం వస్తుందట.

ఎలాగయితేనేమి చివరకు ఆ సంబంధమే నిశ్చయమయింది. ఆయన పిల్లవాడిని చూసివచ్చి "పిల్లవాడు బాగానే వున్నాడు. వాళ్ళనాన్నకూడా నాలాంటి భావాలు కలవాడే!" అన్నారు.

కన్యాదానం సమయంలో ఆయన అన్నారు: "కన్యాదానం ఏమిటి? వస్తువులను దానం ఇస్తారు. ప్రాణుల్లో గోవును దానం ఇస్తారు. ఆడపిల్లలను దానం ఇవ్వటం ఏమిటి? అవన్నీ నాకు ఇష్టం ఉండవు?" అన్నారు.

"ఇదిమాత్రం మీరు చెయ్యక తప్పదు" అన్నాను నేను.

"అయితే నన్ను, నా బిడ్డను దానం చెయ్యమంటావా? అలాంటిపని నేను చెయ్యలేను" అన్నారు.

"చిన్నపిల్లవాడిలాగ మొండిగా మాట్లాడకండి! కన్యాదానం చేస్తారా చెయ్యరా," అన్నాను.

"నేను చెయ్యను! కావాలంటే నువ్వు చేసుకో!" అన్నారు.

చివరకు ఎలాగయితేనేమి మండపంలోకి వచ్చి కూర్చున్నారు. కన్యాదానం నేనే చేశాను.

జూలైలో వాసుదేవప్రసాద్ (మా అల్లుడు) బి, ఏ. తరువాత ఏం చదవమంటారని, ఆయనకు ఉత్తరం రాశాడు. ఆయన 'లా' చదవమని రాశారు.

వాసుదేవ్‌ను తన కొడుకులాగ చూసుకొనేవారు. అతని అవసరాలను జాగ్రత్తగా పరిశీలించేవారు. ఒకసారి వాసుదేవ్ లక్నో వచ్చాడు. అతను రోజూ కాలేజీకి రెండుమైళ్ళు నడిచిపోతాడని తెలిసింది. వెంటనే ఆయన ఒక సైకిల్ కొనుక్కొని వచ్చి నాతో అన్నారు– "వాసును పిల్చి సైకిల్ ఎలాఉందో చూసుకోమను !"

వాసుదేవ్ సైకిల్ చూసి 'బాగుంది' అన్నాడు. అతనికి మామగారంటే తగని భయం. అడిగిన ప్రశ్నలకుమాత్రమే జవాబు చెప్పేవాడు. ఆ పిల్లవాడికి తనంటే భయం అని ఆయన నాతో అంటుండేవారు. వాసుదేవ్ రాసిన ఉత్తరాల్లోని ఇంగ్లీషులో తప్పులు దిద్ది, ఆ ఉత్తరాలను తిప్పి పంపించేవారు.

ఒకరోజు అది చూసి నేను "అలా చేస్తే ఆ అబ్బాయి ఏమయినా అనుకుంటాడు" అన్నాను.

"ఏమనుకుంటాడు ? తప్పులు తెలుసుకుంటాడు. ధున్నూకు రాయటంలేదూ ? నాకు వాళ్ళిద్దరిమధ్యా ఎలాంటి భేదం కన్పించదు" అన్నారు.

ఒకసారి వాసుదేవ్ పిల్లను తీసుకెళ్ళటానికి వచ్చాడు. అతను భార్యను పంపమని అటగటానికి సిగ్గుపడి మా పురోహితుడిచేత చెప్పించాడు.

"ఇప్పుడే పంపనని చెప్పు. ఇప్పటినుంచే సంసారబాధ్యతలు నెత్తిన వేయటం నాకు ఇష్టంలేదు. అతని అక్కగారు ఏమయింది" అన్నారు.

"తనకు వచ్చే 'మనోవర్తి' తెచ్చుకోవటానికి ఆమె భోపాల్ వెళ్ళిందట. ఆమె వాసుదేవ్‌కు పినతల్లికూతురు. మనోవర్తి తీసుకుంటుంది కాబట్టి అక్కడ కొద్దిరోజులైనా ఉండి చాకిరీ చెయ్యొద్దూ ! పాపం !" అన్నాను.

"మనోవర్తి ఎంత ఇస్తారో ?" అన్నారు.

"సంవత్సరానికి ఇరవయ్ ఐదు రూపాయలట!" అన్నాను.

"ఆ డబ్బు మనమే ఇద్దామని చెప్పు."

"ఒకనాటిది కాదు. జీవితమంతా ఉండేది."

"పరవాలేదు. ఆమె జీవించి ఉన్నంతవరకూ నేను ఇస్తాను" అన్నారు.

లఖ్నోలో హోళీపండగ:

పండగరోజు పెద్దవాడు ఎక్కడికో పారిపోయాడు. చిన్నవాడూ, వాసుదేవ్, ఇద్దరూ పైన ఒక గదిలో తలుపులు బిగించుకొని కూర్చున్నారు. ఒక్కొక్కరూ వచ్చి ఆయన్ను రంగు నీళ్ళతో స్నానం చేయిస్తున్నారు. అప్పుడు ఆయన ఆరోగ్యంకూడా బాగా లేదు. "మీకు దగ్గు వస్తుందని అయినా భయం లేదు" అన్నాను కోపంగా.

"ఇద్దరు కొడుకులూ, అల్లుడూ దాక్కున్నారు. నన్నుకూడా దాక్కోమంటావా? అందరూ ఎక్కడకు వెళ్ళారు?" ఆయన అడిగారు.

"ఘున్నా బయటకు వెళ్ళాడు. వీళ్ళిద్దరూ గదిలో తలుపులు బిగించుకొని కూర్చున్నారు" అన్నాను.

ఆయన కిందనుండే ఇద్దర్నీ కేక వేశారు. ఇద్దరూ వచ్చారు. "ఎందుకు అంతభయం? రంగును చూస్తేనే అంతభయమా? ఈ ఒక్కరోజునేకదా ఇలా రంగునీళ్ళు పోసుకొనేది? మీరు దాక్కుండా ఉండిఉంటే నామీద పోసిఉండరు. మీరు యువకులు. ఇలాంటి సమయాల్లో ఎంతో ఉత్సాహంగా ఉండాల్సినవాళ్ళు. నాకు ఆరోజుల్లో హోళీఅంటే ఎంత సరదాగా ఉండేది?" అన్నారు, వాళ్ళతో. వాళ్ళిద్దరూ తలవంచుకున్నారు.

మధ్యాహ్నంవరకూ ఎవర్నీ స్నానం చెయ్యనివ్వలేదు.

'లఖ్నోలో 'వైస్‌రాయ్'

1928 ఆ ప్రాంతంలోనే అనుకుంటాను. లఖ్నోకి వైస్‌రాయ్ వచ్చాడు. ఆరోజు ఆయన ఆఫీసునుండి వస్తూనే అన్నారు:

"ఇవ్వాళ లఖ్నోలో నలభైవేల రూపాయల మందుసామాను కాలుస్తారు! ఇంత బ్రహ్మాండమైన ఉత్సవాన్ని నువ్వు నీ జన్మలో చూసి వుండవు."

"ఎవరికంత ఉచితార్థంగా వచ్చిపడింది, ఇంత ఖర్చు పెట్ట టానికి?" అన్నాను.

"ఎవరికి వచ్చిపడిందో చూద్దువుగాని పద! పిల్లల్నికూడా తీసుకురా!" అన్నారు.

"మీరు కూడా వస్తారా!" అన్నాను. ఆశ్చర్యంగా.

"ఎందుకు రాను? దరిద్రుల కొంపలుఅంటించి కనుల పండు వుగా ఆనందించవచ్చును. బహుశా, మన సిగ్గులేనితనానికి నవ్వు కుంటానుకూడా నేమో? అంతకంటే నేను చెయ్యగలిగింది ఏముంది?" అన్నారు బాధగా.

ఆయన మాటలు నాకు అర్థంకాలేదు. "ఇంతవరకూ కథలు రాస్తారని మాత్రమే తెలుసు, కాని కవిత్వంలో మాట్లాడతారని తెలియదు" అన్నాను నవ్వుతూ.

"నేను కవిత్వంలో మాట్లాడటంలేదు. బీదవాళ్ళ రోదనను విన్పిస్తున్నాను. అంతే!" అన్నారు.

"మీకు పుణ్యముంటుందిబాబూ! ఆ చెప్పేదేదో కొంచెం విప్పిచెప్పండి" అన్నాను.

"చెబుతాలే! ముందు కొంచెం మంచినీళ్ళు ఇవ్వు!"అన్నారు.

మంచినీళ్ళుతాగి అన్నారు "రాజా, మహారాజాలు, వైస్ రాయ్‌లూ, యువరాజులూ, రాజులూ వచ్చినప్పుడు వారి గౌర వార్థం ఇలాంటి వేడుకలు జరుపుతారు. ఈ డబ్బంతా రక్తం ధార పోసి సంపాదించే బీదరైతులదే. తలకు ఆరుకానుల ఆదాయంగల మనదేశంలో ఈవిధంగా వేలకొలది రూపాయలను వ్యర్థంగా ఊదేస్తున్నారు. తింటానికి తిండీ, కట్టటానికి గుడ్డాలేక ఒకవైపు మానవులు అల్లాడిపోతుంటే ఇంకోవైపు ఈ లావులావు

సేఠ్లనూ, వైస్‌రాయ్‌లనూ సంతోషపెట్టటానికి, సిగ్గుఎగ్గులు లేకుండా ఇంతధనాన్ని నాశనం చేస్తున్నారు" అన్నారు ఉద్రేకంతో.

"ఈ బీదవాళ్ళకు తినటానికే లేనప్పుడు ఇంతడబ్బు ఎందుకిస్తారు?" అన్నాను సందేహంవచ్చి.

"ఇవ్వకపోతే వాళ్ళను బతకనిస్తారా ఈ లావులావు వాళ్ళు" అన్నారు.

"తిండిలేక చావటం కంటే అలా చావటం ఉత్తమంకాదూ? కనీసం జీవితంలో దేన్నో సాధించినవాళ్ళు అవుతారు" అన్నాను.

"మన దేశంలో నూటికి ఎనభైమంది రైతులు. చదువుకున్నవాళ్ళూ, ధనవంతులూ ఇరవైమంది వుంటారు. మనలో అంతశక్తీ, వివేకమూ ఉంటే నూటఏభైఏళ్ళనుండి ఇంగ్లీషువాళ్ళు రాజ్యం చేస్తారా? వీరిలో శక్తీలేదు, బుద్ధీలేదు" అన్నారు.

"అయితే వీళ్ళంతా ఎందుకూ పనికిరారంటారు?"

"చూస్తుంటే అలాగే అనిపిస్తుంది. ఎంత దుఃఖకరమైన విషయం?"

"ఇందులో ఎవరూ దుఃఖిస్తున్నట్లు కన్పించటం లేదే?"

"దాని అర్థం చైతన్యం పూర్తిగా నశించిపోయిందని. మనలో నానాటికీ జడత్వం పెరిగిపోతోంది. జడపదార్థాలకు సుఖదుఃఖాలు ఏం తెలుస్తాయి!" అన్నారు.

"దీనికి చికిత్స ఏమిటి?" అన్నాను.

"మానవుడు చావుకు తెగించనంతవరకూ ఏమీ చెయ్యలేడు."

"చచ్చేవాడు చేసేదేమిటి!" అన్నాను.

"చావుకు సిద్ధంగా ఉన్నవాడు చెయ్యలేనిదంటూ ఏముంది? దేనికైనా తెగిస్తాడు. జీవితంలో ఏ కొంచెం సుఖం మిగిలివున్నా బతకాలనే ఆకాంక్ష ఉంటుంది. చావుకంటే గత్యంతరంలేదని తెలుసుకున్నప్పుడు మానవుడు దేనికైనా సిద్ధపడతాడు" అన్నారు.

"అయితే ఇంగ్లీషువాళ్ళు వీళ్ళదగ్గర డబ్బు వసూలు చెయ్యటానికి వస్తున్నారా?" అన్నాను.

"ఇంగ్లీషువాళ్ళే అవసరంలేదు. బలవంతుడు బలహీనుడి రక్తం పీలుస్తున్నంతకాలం ఇది తప్పదు. ఆ పీల్చేవాడు మన దేశపువాడుకావచ్చు; లేక విదేశంవాడు కావచ్చు. కాస్తోకూస్తో, బలవంతుడు బలహీనుని రక్తంపీల్చటం అన్ని దేశాల్లోనూ ఉంది. కాని, రష్యాలోమాత్రం ఈలాంటివాళ్ళ రోగం బాగా కుదిర్చారు. అక్కడ బీదవాళ్ళు ఈరోజు ఎంతో సుఖపడుతున్నారు. కొంతకాలం తరవాత మన దేశంలోకూడా అలా జరగవచ్చును" అన్నారు.

"అది ఎలా సంభవం?" అన్నాను.

"ఇప్పట్లో అలాంటి ఆశ లేమీ లేవనుకో!" అన్నారు.

"అలాంటి రోజువస్తుందే అనుకోండి! అప్పుడు మీరు ఎవరి పక్షం వహిస్తారు?" అడిగాను.

"కార్మిక కర్షకుల పక్షం. నేనూ కూలివాడినేగా! కూలివాడు పారను ఉపయోగిస్తే, నేను కలాన్ని ఉపయోగిస్తాను!" అన్నారు.

"ఆ పప్పులు ఏమీ ఉడకవు! వాళ్లు మిమ్మల్ని నమ్మరు" అన్నాను.

"అప్పుడు విద్య అందరికీ అందుబాటులో ఉంటుందికాబట్టి అందరూ చదువుకొని వివేకవంతు లవుతారు. రష్యాలో రచయితలు మన దేశంలోకంటే వెయ్యిరెట్లు సుఖంగా జీవిస్తున్నారు. ఆ రోజు ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూస్తున్నాను" అన్నారు.

"రష్యావాళ్ళు మన దేశంకూడా వస్తారా?"

"వాళ్ళు రారుకాని మనలోకి వారి శక్తి ప్రవేశిస్తుంది. కూలి, రైతులరాజ్యం వచ్చినప్పుడే మన దేశం భూతలస్వర్గం కాగలదు. అప్పుడు మన దేశవాసుల జీవితపరిమాణంకూడా రెట్టింపు కాగలదు."

"అది ఎలాగ?"

"విను ! రాత్రింబవళ్ళు ఎముకలు విరుచుకొని పనిచేసినా, వంటినిండా గుడ్డా, పొట్టనిండా తిండీ లేదు. అర్థాకలితో అలమ టించే అభాగ్యులకు జీవితంలో విశ్రాంతి, సుఖం ఎక్కడ ? ఎప్పుడూ ఏదో ఒక చింతతోనే క్రుంగి కృశించిపోతున్నారు."

"చింతలూ, విచారాలూ మానవ కల్పితాలే ! కూలీల రాజ్యం వస్తేమాత్రం ఇవి ఎలా పోతాయి ?" అన్నాను.

"ఎందుకు పోవు ? మనం చచ్చిపోయిన తరవాతకూడా, మన భార్యాబిడ్డలు, ఆప్తులు సుఖంగా బతకగలరనే నమ్మకం ఉంటే, అవసరాలను తగ్గించుకొంటూ బాధపడటం, డబ్బు పోగుచేయాలనే తాపత్రయం, ఇవన్నీ ఎందుకుంటాయి ?" అన్నారు.

"పిల్లలు ఉన్నా, ముసలితనంలో పెళ్ళిచేసుకున్నవాళ్ళనూ, ఉన్న డబ్బంతా తమ విలాసాలకే ఖర్చుపెట్టుకొని, చచ్చేనాటికి కట్టెలకుకూడా లేకుండా చేసుకున్నవాళ్ళనూ ఎంతమందిని చూడటం లేదు ? పిల్లలు లేకపోయినా డబ్బు పోగుజేయటమే లక్ష్యంగా పెట్టుకున్న పిసినారులను ఎంతమందిని చూడటంలేదు ! చింతించటానికి ఏ కారణమూ లేనివాళ్ళు ఎంతమంది, ఏదో ఒక చింతను కల్పించుకొని రాత్రింబవళ్ళు ఏడుపుముఖంతో తిరగటం చూడటంలేదు ?" అన్నాను.

"నాలుగువైపులనుండి ఆకలికడుపుల ఆర్తనాదాలు వింటూ కూడా, తమ విలాసాలకు డబ్బును నీళ్ళలాగ వ్యయపరిచేవాడు మానాభిమానాలూ, సిగ్గుఎగ్గులూ లేనివాడు ! పిల్లలు ఉన్నా ముసలి తనంలో మళ్ళీ పెళ్ళిచేసుకొనేవాడిని ఏమనాలో నాకు అర్థంకావటం లేదు. ఇతరుల దుఃఖాలను చూసి బాధపడే వ్యక్తికంటే, నా దృష్టిలో గొప్పవాడు ఎవడూ లేడు. మహాత్మాజీని చూడు !" అన్నారు.

ఇంతలో పిల్లలు వచ్చి, అందరూ సంబరం చూట్టానికి వెళ్ళి పోతున్నారని తొందర పెట్టారు. అందరం వెళ్ళాము. అక్కడ చేరిన వాళ్ళంతా ఆ మందుసామాను కాల్చటం చూసి ఆనందిస్తున్నారు.

ఆయనమాత్రం ఒక పక్కన. కూర్చొని ఏదో ఆలోచిస్తున్నారు. పిల్లలు ఇంకా ఉందామని మారాం చేసినా తలనొప్పిగా ఉందని తీసుకొని వచ్చేశారు. ఎన్నో నెలలవరకూ ఆయన ఆ మందు సామానులు కాల్చటం మర్చిపోలేదు. ఎన్నోసార్లు మన దేశంలోని ధనం అంతా ఇలాగే వ్యర్థం అయిపోతుంది అని అన్నారు.

"మీకు వ్యర్థం కాకుండా ఆపరాదూ ?" అన్నాను.

"నేను ఆపగలిగితేనా ? చెప్పి ఏంలాభంలే ? అది నా శక్తికి మించిన పని" అన్నారు నిట్టూరుస్తూ.

"శక్తికి మించిన పని అని తెలిసివుండే విచారించటం దేనికి ?" అన్నాను.

"మనకు బాధకలిగించిన విషయాలను మరచిపోవటం అనుకున్నంత తేలిక పని కాదు."

"కనులపండువగా ఉన్న ఆ ఉత్సవాన్ని ఆరోజు ఎంతోమంది చూశారు. దాని బాగోగులగురించి కూడా మాట్లాడుకొని ఉంటారు. కాని, మీలాగా ఎవరూ దానికి ఎంత డబ్బు ఖర్చయిందీ ఆలోచిస్తూ కూర్చోరు" అన్నాను.

"దానిపేరే జడత్వం. ఈ జడత్వం మనలో ఎంతగా పేరుకుపోయిందంటే, ఇంటికి నిప్పు అంటించుకుని ఆనందిస్తున్నాము" అన్నారు.

"మీకంటే ఆ జడులే నయం. కనీసం ఆనందాన్ని అయినా పొందగలుగుతున్నారు" అన్నాను.

ఇ ం ట రు క్లా సు :

1929 నాటి విషయం. నేను ప్రయాగనుండి వస్తున్నాను నాతో ఆయనా, బన్నూ ఉన్నారు. ఇంటరులో ప్రయాణం చేస్తున్నాము. చైత్రమాసము. పెట్టె కిక్కిరిసి నట్లుంది. ఒక స్టేషన్‌లో ఒక పల్లెటూరివారిగుంపు ఎక్కింది. ఇది ఇంటరనీ, డబ్బు ఎక్కువ కట్టాలనీ ఆయన చెప్పారు.

"ఏం చెయ్యమంటావు బాబయ్యా! రెండురోజులుగా పడి ఉన్నాము" అన్నారు వాళ్ళు.

"ఎక్కడినుండి వస్తున్నారు, ఎక్కడికి వెళ్ళాలి?" అన్నారు.

"అమ్మవారి దర్శనానికి వెళ్ళివస్తున్నాము బాబూ?" అన్నారు వాళ్ళు.

"అమ్మవారి దర్శనంవల్ల మీకు ఏమివచ్చింది? నిజంచెప్పండి! మీకు ఒక్కొక్కళ్ళకు ఎంత ఖర్చు అయింది?" అని ఆయన అడిగారు.

ఒక్కొక్కళ్ళకు కనీసం పదిహేను రూపాయలు ఖర్చు అయాయని వాళ్ళు చెప్పారు.

అది విని ఆయన - "అంటే, మీరంతా నాలుగు నెలలకు సరిపడే ధాన్యం అమ్ముకున్నారన్నమాట? అమ్మవారి పూజ ఇంట్లోనే చేసుకోవచ్చుగా? అమ్మవారు లేనిచోటు ఏముంది? మీరు సంతోషంగా ఉండటమే అమ్మవారు కోరేది?" అన్నారు.

"మొక్కు, బళ్ళు తీర్చుకోకపోతే అమ్మవారికి కోపంరాదూ?" అన్నారు ఆ అమాయకులు.

పెట్టెనిండా జనం కిక్కిరిసి ఉన్నారు. వేసవికాలం కావటంవల్ల ఉక్కగా ఉంది. ఊపిరాడక చిరాకుగా ఉంది. "వాళ్ళను దిగమనండి మీ ఉపదేశాలు వాళ్ళ చెవులకు ఎక్కవులే!" అన్నాను.

"చెవికి ఎక్కేలాగ చెప్పటం మన కర్తవ్యం!" అన్నారు.

"ఆ పని తరవాత చూసుకోవచ్చు. నా ప్రాణం పోతుంది. ముందు వీళ్ళను దించెయ్యండి!" అన్నాను.

"వీళ్ళకోసమే జైలుకు వెళతావు; యుద్ధం చేస్తానంటావు. కాని, వీళ్ళకోసం ఈ కొంచెం కష్టాన్ని సహించలేనంటావు. వీళ్ళ స్థితి చూస్తుంటే కడుపు తరుక్కుపోతుంది. అర్థాకలితో ఉంటూకూడా, మతంపేరుమీద ఇంత ధనాన్ని వ్యయపరుస్తున్నారు" అన్నారు.

"వీళ్లు తమ మూర్ఖత్వంవల్ల అలా చేసుకుంటుంటే మనం ఏం చెయ్యగలం? ఒక రూలు పెట్టి బలవంతంగా ఆపితేగాని వీళ్లు వినరు" అన్నాను.

"నిదానంగా వాళ్లే అర్థంచేసుకుంటారు. బలవంతంమీద ఏ పనీ జరగదు."

"బండిలో కూర్చోపెట్టి చెప్పగానే సరిపోతుందా?"

"అవకాశం చిక్కినప్పుడు చెప్పకపోతే ఎలా?"

"మీరు రాసే ఇంతంత లావు పుస్తకాలన్నీ వీళ్ళకోసమేగా!" అన్నాను.

"వీళ్ళకు పుస్తకాలు చదివే చదువు ఎక్కడిది? ఆఁ, సినిమాలు తీస్తే కొంతలాభం కలుగవచ్చు."

ఇంతలో ఒక రైల్వేపోలీసు వచ్చి వాళ్ళను టిక్కెట్లు చూపించమని బెదిరిస్తున్నాడు. ఇంటరులో ఎక్కినందుకు డబ్బు కట్టమంటున్నాడు. ఆ పోలీసుదౌర్జన్యం చూసి ఆయనకు చాలా కోపం వచ్చింది. "నువ్వు పశువువా? మనిషివా?" అన్నారు కోపంతో.

"నే నెందుకు పశువు నవుతాను? మూడోతరగతి టిక్కెట్టు కొని ఇంటరులో ఎక్కిన వీళ్ళు పశువులు కారా?" అన్నాడు పోలీసు.

"మూడోతరగతిలో కూర్చోవటానికి చోటు లేకపోతే ఏంచేస్తారు? టిక్కెట్లు ఇవ్వగానే మీపని తీరిపోయిందా? చోటు చూపించ నవసరం లేదూ? వీళ్ళందర్నీ పశువులను చేస్తున్న మిమ్మల్ని ఏమనాలో నాకు బోధపడటంలేదు. పద! నేనుకూడా వస్తాను! వీళ్ళకు మూడోక్లాసులో చోటు చూపించు!" అంటూ వాళ్ళతో ఆయనకూడా దిగి వెళ్ళారు.

పోలీసు ఎలాగో అందర్నీ బండిలో ఎక్కించేంతవరకూ ఉండి వచ్చారు. "వీళ్ళ దౌర్జన్యం చూశావా?" అన్నారు నాతో.

"అనవసరంగా మీరెందుకు పోట్లాటలు తెచ్చిపెట్టుకుంటారు" అన్నాను.

"నేనేమిటి! మనిషి అనేవాడు ఎవడైనా ఇలాంటి అన్యాయాన్ని చూడలేడు" అన్నాను.

"కాంగ్రెసు నాయకులుకూడా ఫస్టు, సెకండ్ క్లాసుల్లో తిరుగుతుంటారు. థర్డ్ క్లాసువాళ్ళగతి ఏమిటోకూడా చూడరు" అన్నాను.

"మన దేశంలోనివాళ్ళంతా తమ తమ కర్తవ్యాలను తెలుసుకుంటే, దేశం ఇలా దుర్గతిపాలు ఎందుకు అవుతుంది!" మనలో ఆత్మబలం, చరిత్రబలం లేనందువల్లనే తెల్లప్రభుత్వం ఇన్నిరోజులుగా ఈ దేశంలో ఉంది" అన్నారు.

"ఇది ఒక్కరోజులో తీరిపోయే సమస్యకాదు" అన్నాను.

"అలాగని మనం కాళ్ళూ, చేతులూ ముందుపెట్టుకొని కూర్చొంటామా? మన ప్రయత్నం మనం చెయ్యాలి!" అన్నారు.

"ఆరోజు వస్తే అంతా సవ్యంగానే జరిగిపోతుంది!" అన్నాను.

"అయితే నువ్వు జైలుకు వెళ్ళటం వ్యర్థమే. కాంగ్రెసుకోసం పాటుపడటం అంతకంటే తెలివితక్కువే అవుతుంది. స్వాతంత్ర్యం చింతచెట్టులాంటిది. తాత మొక్క నాటితే, దాని పళ్ళను మనుమడు అనుభవిస్తాడు" అన్నారు.

'రా య సా హె బీ'

ఆరోజుల్లో 'హేలీ' మహాశయుడు గవర్నరుగా వచ్చాడు. అతను తన హిందూమిత్రునితో "ధనపత్ రాయ్‌కి ఉత్తరం రాయండి. ఆయన పుస్తకాలంటే నాకు చాలా యిష్టం. హిందూ దేశంలో ఇప్పుడున్న అందరిలోకీ పెద్ద రచయిత. ఆయనకు 'రాయసాహబీ' బిరుదును ఇవ్వదలచాను" అని అన్నాడట.

ఉత్తరం అందగానే నా దగ్గరకు వచ్చి గవర్నరుదగ్గిరనుండి ఉత్తరంవచ్చింది అని చెప్పారు. నేను ఏం రాశాడని అడిగాను.

"నాకు 'రాయసాహబీ' ని ప్రసాదిస్తానన్నాడు!" అన్నారు.

"స్వయంగా గవర్నరే రాశాడా, లేక ఎవరిచేతనైనా రాయించాడా ?" అన్నాను.

"ఎవరిచేతనో రాయించాడు. ఆ ఉత్తరం రాసిన మహాశయుడుకూడా 'సర్' అనే బిరుదును సంపాదించాడు" అన్నారు.

"ఇంకేం ? కేవలం 'రాయసాహబ్'ని మాత్రమే ఇస్తారా, లేక ఇంకా ఏమయినాకూడా ముట్టజెపుతారా ?" అన్నాను.

"చూస్తే ఇంకా ఏదో ఇచ్చే వ్యవహారంగానే ఉంది."

"అయితే ఇంకేం ? ఒప్పుకోండి !" అన్నాను.

"ఇదంతా ఎందుకో తెలుసా ? నేను ప్రజలకు దూరమై, ఛత్రాజుపొగడ్తలు ప్రారంభించాలని అతని ఉద్దేశం" అన్నారు.

"ఛత్రాజు పొగడ్తలా ?" అడిగాను ఆశ్చర్యంగా.

"అవును ! అందరూ చేయటంలా ? ఇప్పుడు నేను స్వేచ్ఛగా నాకు ఇష్టంవచ్చినట్లు రాయగలుగుతున్నాను. రేపటినుండి ప్రభుత్వాన్ని సంతోషపెట్టటానికి రాయాలి. అది నీకు ఇష్టమేనా ?"

"నాకు ఇష్టమే !"

"ఆలోచించి చెప్పు ! ఉత్తరం రాస్తాను !" అన్నారు.

కొంపతీసి నిజంగా ఒప్పుకోరుగదా అని భయపడ్డాను. "చాలా లాభకరమైన వ్యాపారంలాగనే కనబడుతుంది" అన్నాను.

"నా గొంతులో ఊపిరిఉండగా ఇలా కక్కుర్తికి లోనుగాను !" అన్నారు.

"ఏం రాస్తారు ?"

"ధన్యవాదాలు రాస్తాను. నేను ప్రజల తుచ్ఛమైన సేవకుడను. ప్రజలు నాకు 'రాయసాహబ్'ని ఇస్తే కళ్ళకద్దుకొని స్వీకరిస్తాను. ప్రభుత్వంవారి బిరుదులు పొందాలనే అభిలాష నాకు ఎంతమాత్రమూ లేదు. అని రాస్తాను'' అన్నారు.

లఖ్నో లో

మొట్టమొదట జూలై నెలలో కాంగ్రెసులో పని చెయ్యటం ప్రారంభించాను. నేను కాంగ్రెసులో పనిచేస్తున్నట్లు ఇంట్లో తెలియ

నివ్వలేదు. ఆయనకు తెలిస్తే నన్ను బయటకు వెళ్ళనివ్వరనీ, తను ముందే జైలుకు వెళ్ళి కూర్చుంటారనీ నాభయం. ఆయన జైలుకు వెళ్ళాలని అంటుండేవారు. ఆ సందర్భంలోనే ఒకరోజు అన్నారు. "నేను లేకపోయినా మీకు పుస్తకాలమీద వచ్చే 'రాయల్టీ'తో గడిచి పోగలదు. కనీసం నెలకు వందరూపాయలు వస్తాయి."

"ఇప్పటివరకూ, వంద దమ్మిడీలుకూడా రాలేదు. వందరూపా యలమాట అలాఉంచండి" అన్నాను.

"జీవితం సాఫీగా గడిచిపోతుంటే డబ్బుసంగతి ఎవరు ఆలో చిస్తారు ?" అన్నారు.

నేను క్రమంగా అన్నిసభలకూ వెళ్ళసాగాను. అప్పుడప్పుడు మాట్లాడుతూ ఉండేదాన్ని. కాని ఆయనకు తెలియనిచ్చేదాన్ని కాదు. పేపర్లలోకూడా నా పేరురాకుండా వీలయినంతవరకూ ప్రయత్నించేదాన్ని. రాత్రిళ్ళు భయపడుతూ పిల్లిలా ఇంట్లో దూరే దాన్ని. ఆ రోజుల్లో నా ఆరోగ్యం ఏమీ బాగాలేదు. రోజూ జ్వరం వస్తూఉండేది. కాని నా అనారోగ్యంవిషయం ఆయనకు తెలియ నిచ్చేదాన్ని కాదు. అప్పుడప్పుడూ ఆయనకు సందేహంకలిగి నాతో పోట్లాడేవారు. విసుక్కునేవారు. అప్పటి నా ఆ సేవ అంతా దేశంకోసం కాదు, నా స్వార్థంకోసమే చేశాను. ఆయన్ను జైలుకు వెళ్ళకుండా ఆపాలనే ఉద్దేశంతోనే నేను జైలుకు వెళ్ళాను.

ఆయనకు ఎవరైనా పూలమాలలు వేస్తే ఇంటికివచ్చిన తర వాత వాటిని నా మెళ్లో వేసేవారు. నేను – "ఈ మాలలతో ప్రజలు మిమ్మల్ని సత్కరించారు. వారి ప్రేమానురాగాలు ఈ మాలల్లో ఇమిడిఉన్నాయి. అందువల్ల ఇవి చాలా విలువైనవి. వాటిని నా మెళ్లోవేసి, ప్రజలు మీకు అర్పించిన ప్రేమనూ, ఆద రాన్నీ కించపరుస్తున్నారు" అనేదాన్ని.

దానికి ఆయన "ప్రజలు వీటిని నాకు ఇచ్చారు కాబట్టి ఇవి నా వస్తువులు అయిపోయాయి. వీటిని నా ఆరాధ్యదేవత కంఠంలో వేసి, ప్రజల ప్రేమనూ, ఆదరాన్నీ గౌరవిస్తున్నాను" అన్నారు.

"అయితే, ప్రజలు మీమీద వేసిన కర్తవ్యభారాన్ని, నా నెత్తిని వేస్తున్నారన్నమాట! నా ఈ దుర్బల భుజస్కంధాలు ఆ గురుతరభారాన్ని మోయగలవో లేవో!" అన్నాను.

"నీ సహకారం లేకుండా నేను ఏ భారాన్నీ మోయలేనని నాకు తెలుసు!, నేనే కాదు. ఏ పురుషుడూ స్త్రీల సహకారం లేకుండా ఏపనీ చెయ్యలేడు. స్త్రీ, పురుషుల ఇద్దరికృషి ఫలితం గానే, ఎప్పటికైనాసరే మన దేశం బాగుపడగలదు" అన్నారు.

"ముఖస్తుతి నేర్చుకోవాలంటే, మీదగ్గరే నేర్చుకోవాలి. అలా పొగిడేస్తే స్త్రీలలో అహంకారం తలఎత్తగలదు జాగ్రత్త!" అన్నాను.

"ఇతరుల విషయం నాకు తెలియదు. నీవిషయంలో మాత్రం నాకాభయం ఎప్పుడూ లేదు!" అన్నారు.

"నేను దేవతను కాను. నాకూ గర్వం రావచ్చు" అన్నాను.

"నీ గర్వంవల్ల మేలే కలుగుతుంది. అలాంటి గర్వం మనలో ప్రవేశించనప్పుడే మనం మానవులము కాగలము. తను త్యాగంచేసి తద్వారా ఇతరులకు గర్వకారణమైన వ్యక్తియే ధన్యుడు" అన్నారు.

ఉ ప్పు స త్యా గ్ర హ ము:

1930 లో గాంధీజీ ఉప్పుసత్యాగ్రహం చెయ్యటానికి 'దండీ' వెళ్ళారు. దేశం నలుమూలలనుండి 'మహాత్మాగాంధీకిజై' అంటూ నినాదాలు వినిపిస్తున్నాయి. అప్పుడు మేము లఖ్నోలో ఉన్నాము. మా ఇంటికి ఎదురుగా ఒక పార్కు ఉంది. అక్కడే రోజూ స్వచ్ఛంద సేవకులు ఉప్పు చేసేవారు. లఖ్నోఅంతా అక్కడే చేరిందా అనిపించేది. సాయుధులైన పోలీసులు వాలంటీర్ల వెంట వెంటనే ఉండే వాళ్ళు. ఎంతోమంది యువకులు సత్యాగ్రహం చెయ్యటానికి వెళ్ళే ముందు, మా ఇంటికివచ్చి మా ఇద్దరికీ నమస్కరించి, మా ఆశీర్వాదాలను పొందటానికి వచ్చేవాళ్ళు. వాళ్ళను ఆశీర్వదిస్తుంటే నా కళ్ళలో గిర్రున నీరు తిరిగేది.

నేను జైలుకు వెళ్ళవలసిన సమయం ఆసన్నమైంది. నేను ఆలస్యం చేస్తే ఆయన వెళతారు. అప్పటికే ఆయన ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. జైలుకు వెళితే మళ్ళీ తిరిగివస్తారా? అని పించేది. ఈ విషయాన్ని ఆయనముందు చర్చించాలంటేనే భయంగా ఉండేది. ఈ విషయంలో నా పిరికితనాన్ని నేను అర్థం చేసుకోలేక పోలేదు. ప్రతిస్త్రీకి, తనభర్తా, బిడ్డలూ, ప్రియమైనవాళ్ళని కూడా నాకు తెలుసు. స్త్రీలు అందరూ నాలాగే అనుకుంటే మరి జైలుకు వెళ్ళేవాళ్ళు ఎవరు? అనికూడా అనుకునేదాన్ని. పిల్లలు ఇంకా చిన్నవాళ్ళు. ఆయన్ను జైలుకు పోనివ్వటం నాకు సుతలామూ ఇష్టంలేదు. అందువల్లనే ఆ బాధ్యతను నా నెత్తిన వేసుకోవటమే నాకర్తవ్యంగా తోచింది.

జూలై 20 వ తేదీన 'స్వరూపరాణీ నెహ్రూ' లఖ్నో వచ్చింది. ఆమె ఉపన్యాసం వినటానికి వెళ్ళాను. ఆమె మాటల్లో ఆవేశంఉంది, ఉద్రేకం ఉంది, బానిస శృంఖలాల్లో నలిగిపోతున్న భారతమాత ఆక్రందన ఉంది. ఆమె ఉపన్యాసం మార్గాన్ని వేసి ఎత్తించింది. ఆమె ఉత్సాహం నిరాశాపూరితాలైన మా హృదయాల్లో ఆశా జ్యోతి వెలిగించింది. మేము అప్పుడే లఖ్నోలో 'మహిళాశ్రమాన్ని, స్థాపించాము. మొదట్లో మాకు బయటకు వెళ్ళటానికీ, మాట్లాడటా నికీ గాబరాగా ఉండేది. రోడ్డుమీద నడుస్తుంటే బెరుకు బెరుగ్గా ఉండేది. ఒకోసారి ఆయన దారిలో తటస్థపడి "ఎందుకంత గాబరాగా నడుస్తావు?" అనేవారు. నాకుచచ్చేసిగ్గు వేసేది. "ఏంచెయ్యమంటారు? ఏ పోకరీ వెధవ అయినా ఎదురుపడతాడేమో నని భయంగా ఉంటుంది అనేదాన్ని." "పోకిరీవాడు ఎదురుపడతాడే అనుకో! వాడు ఏన్నేం చేస్తాడు? నీ దారిన నువ్వు వెళ్ళితే, వాడిదారిన వాడు వెళతాడు!" అనేవారు. నన్ను ఇంటివరకూ దిగబెట్టి, మళ్ళీ వెళ్ళేవారు బజారు పని చూసుకోవటానికి.

## జైల్లో

1931 నవంబరునెల. ఆయన అప్పటికి మూడునాలుగురోజుల క్రిందట బనారస్ వెళ్లి ఉన్నారు. నాకు కాంగ్రెసు ఆఫీసునుంచి పిలుపువచ్చింది. విదేశీవస్త్రాలు అమ్మవద్దని పికెటింగుచేస్తున్న పదిమంది వాలంటీర్లను అరెస్టు చేశారట.

మేము పదకొండుమందిమి కారులో పికెటింగ్ జరిగేచోటుకు వెళ్లాము. మేమువెళ్ళిన పదినిముషాలకల్లా పోలీసువాన్ వచ్చింది. ఇన్‌స్పెక్టరు నాతో "మిమ్మల్ని అరెస్టుచేస్తున్నాము" అన్నాడు.

నేను వారెంట్ చూపమన్నాను. "ఇప్పుడు వారెంట్ లేకుండానే అరెస్టుచెయ్యవచ్చును" అన్నాడు.

మేము నినాదాలుఇస్తూ వాన్ఎక్కాము. లారీలో ఒక ఇన్‌స్పెక్టర్ ఏడుగురు పోలీసులూ, ఉన్నారు. మేము ఏడుగురము స్త్రీలము ఉన్నాము. మేమంతా జాతీయగీతాలు పాడుతున్నాము. కొంతదూరం వెళ్ళినతరవాత వాన్ఆపించి ఇన్‌స్పెక్టరు దిగి వెళ్ళిపోయాడు. అంతకుముందు ఇలాగే స్త్రీలను తీసుకెళ్ళి ఊరిబయట ఎక్కడో చాలాదూరంలో వదిలివచ్చారని విన్నాము. అయినప్పటికీ మేము ధైర్యంగానే ఉన్నాము. లారీలోఉన్న పోలీసుల కళ్లలో నీరుతిరిగి ఉండటం చూశాము. అందులో ఒకడు "అమ్మా! మాకు నెలకు ఇరవయ్‌రెండు రూపాయలు వస్తాయి. ఇంకేదైనా పది రూపాయలపని దొరికినా ఈ పాపిష్టిపని వదిలేసిఉందును" అన్నాడు.

"దానికేంలే నాయనా! మీ కర్తవ్యాన్ని మీరు గుర్తించాల్సిందే! ఈ పనిలో ఉన్నంతవరకూ మీకు విశ్వాసఘాతం చెయ్యకూడదు" అన్నాను.

"మీరు అంత ఉదాసులు కాబట్టే జైలుకు వెళుతున్నారు. తల్లుల్లాగా, అక్కచెల్లెళ్ళలాగ చూసుకోవలసిన, మిమ్మల్ని జైలుకు తీసుకెళుతున్నాము" అన్నాడు ఇంకో పోలీసు.

"కర్తవ్య నిర్వహణకు తగిన శక్తిని ప్రసాదించమని భగవంతుని ప్రార్థించండి. ఇప్పుడు కూడా, నువ్వు నాకు బిడ్డవే, నేను

నీకు తల్లినే, మనం భిన్నమార్గాల్లో నడుస్తున్నాం, అంతే తేడా!" అన్నాను.

జైల్లో వున్న సోదరీమణులు మాకు స్వాగతం ఇచ్చారు. బయటి విశేషాలను చెబుతుంటే, ఎంతో కుతూహలంతో విన్నారు. మాటల్లో ఐదుగంటలు అయిపోయింది. మమల్ని చూట్టానికి నాలుగయిదు వందల మంది వచ్చారు. మా అమ్మాయీ, అబ్బాయిలు కూడా వచ్చారు. అప్పుడు బన్నూనకు తొమ్మిదేళ్లు. రోజూ బడికి వెళుతూ "అమ్మా! బయటకు వెళ్ళబాకు! నిన్ను కూడా పోలీసులు పట్టుకెళతారు" అనేవాడు. "నన్ను పట్టుకెళితే నువ్వు ఏడుస్తావా?" అని అడిగితే తన చిన్న చిన్న చేతులను నా మెడకు చుడుతూ "లేదమ్మా! ఏడవను!" అనేవాడు. ఆ రోజు వాడిని చూడగానే ఏడుపు వచ్చింది. ఆయన వచ్చేంతవరకు పిల్లల్ను చూసుకోమని పక్కింటి ఆమెకు చెప్పాను.

రెండవరోజు ఆయన ఇంటికి వచ్చారు. నేను జైలుకు వెళ్ళిన సంగతి బనారస్‌లోనే విన్నారు. మధ్యాహ్నం నన్ను చూట్టానికి వచ్చారు. నన్ను చూడగానే "జైలుకు వచ్చావా?" అన్నారు. కళ్ళలో నీరు తిరిగింది.

"అవును! వచ్చాను. మీరు ఎలా వున్నారు?" అడిగాను.

"నాకేం? నీ సంగతి చెప్పు!" అన్నారు.

నేను ముఖంలోకి లేని సంతోషాన్ని తెచ్చుకుంటూ "నాకు ఇక్కడ ఎలాంటి కష్టమూ లేదు" అన్నాను.

ఆయన తన స్వభావసిద్ధమైన చిరునవ్వుతో "ఇక్కడ నువ్వు ఖైదీవి అయావు అక్కడ నన్ను బందీని చేశావు" అన్నారు.

అప్పుడు నాకు ఆయన ఒకరోజు అన్నమాటలు– "మనఇద్దరం ఒక నావలో ప్రయాణం చేసేయాత్రికులము. మన ఇద్దరి గమ్యస్థానం ఒక్కటే"–గుర్తువచ్చాయి. ఆ మాటలనే ఆయనతో అంటే "అప్పుడు నేను అన్నమాటను ఇప్పుడు నువ్వు సార్థకం చేశావు" అన్నారు.

"సార్థకం చెయ్యలేదుకాని ప్రయత్నంమాత్రం చేస్తున్నాను" అన్నాను.

ఐదారుసార్లు వచ్చి నన్ను చూశారు. ఆయనకు నన్ను జైల్లో చూడటం బాధాకరంగా ఉండేది. అనుకున్నదాని కంటే ఒక రోజుముందే నన్ను విడుదలచేశారు. నేను ఒంటరిగానే ఇంటికి వచ్చాను. సాయంకాలం ఇంటికివచ్చి నన్ను చూసి చిరునవ్వు నవ్వారు. నేను ఆయన పాదాలకు నమస్కరిస్తుంటే, ఆయనకళ్లనీళ్లతో నన్ను పైకిఎత్తారు.

చెప్పొద్దూ, నాకూ ఏడుపువచ్చింది! "నేను బాగానే ఉన్నాను. మీరు ఎలాఉన్నారు!" అని అడిగాను.

"నాకేం? ఇంట్లో కులాసాగానే ఉన్నాను" అన్నారు.

అప్పుడు మా వదిన మా ఇంట్లోనేఉంది. ఆమె అన్నది: "ఏం కులాసా? నీవు జైలుకువెళ్ళినప్పటినుంచీ మానవుడు నవ్విన పాపాన పోలేదు."

"మావదిన పళ్లూ, ఫలహారం తెచ్చి మాముందు పెట్టింది. అవి తింటున్నంతసేపూ ఆయన నేను జైల్లోఉండగా జరిగిన విశేషాలు చెబుతూనే ఉన్నారు. ఆరోజు ఇంట్లోకి కొత్త జీవితం, కొత్త వెలుగూ వచ్చినట్లు అనిపించింది.

జైలునుండి వచ్చిన తెల్లవారి నేను ఆయనగదిలోకి వెళ్ళాను. అక్కడ నా ఫొటో ఒకటి తగిలించివుంది దానికి మాలలుకూడ వేసి ఉన్నాయి.

అదిచూసి అన్నాను - "ఈ ఫొటోను ఇక్కడెందుకు తగిలించారు? ఈ గదికి రకరకాల వాళ్ళంతా వస్తుంటారు! ఇక్కడ నా ఫొటో వుండటం బాగాలేదు. అది ఇలా తీసి ఇవ్వండి."

ఆయన: "వేసింది తియ్యటానికా?"

నేను: "ఎవరైనా చూస్తే బాగుండదు."

ఆయన: "చూట్టానికేగా? రహస్యంగా వుంచాలనే ఉద్దేశం నాకు లేదు."

నేను: "నాకు సిగ్గుగావుంది."

"దీంట్లో సిగ్గుపడాల్సిందేముందో నా కర్థంకావటంలేదు. నాకేం సిగ్గుగా లేదు. నా ఫొటో నీ గదిలో ఎందుకుంది?" అన్నారు.

"మగవాళ్ళ గదిలో ఆడవాళ్ళ ఫొటోలు వేసుకోవటం బాగుండదు" అన్నాను.

"నీ ఫొటో ఎవరిగదిలో, ఎక్కడుంటే, నీకు సిగ్గులేకుండా వుంటుంది?"

"నా ఫొటో నా గదిలోనే వుండాలి. నా సోదరులు, కానీ కొడుకులుగానీ తమ గదిలో వేసుకుంటే బాగానే వుంటుంది" అన్నాను.

ఆయన: కాని నావుద్దేశం నీ ఫొటో వేసుకొనే అధికారం అందరికంటే నాకే ఎక్కువవుందని, సరి! నువ్వు ఇప్పుడు చెప్పిన వాళ్ళు నీ ఫొటోను తమగదుల్లో వేసుకున్నా నాకేం అభ్యంతరం వుండదు. కాని నావయస్సు వాడెవడయినా పరాయివాడు నీ ఫొటో తన గదిలో వేసుకొంటే వాడి ప్రాణాలు తీసేస్తాను."

నేను: "దీంట్లో అంత కోపం రావాల్సింది ఏముంది? మీరు మీగదిలో, మీస్నేహితుల ఫొటోలు వేసుకోవట లేదూ!"

ఆయన: "నేను స్నేహితుల ఫొటోలు వేసుకుంటాను. కాని స్నేహితుల భార్యల ఫొటోలుకాదు.

నేను: "తల్లిలాగా, సోదరిలాగ, చూసుకుంటే ఇందులో నాకేం తప్పు కన్పించటంలేదు."

ఆయన: "నువ్వొట్టి పిచ్చిదానవు, ఏమీ తెలియదు."

నేను: "అవును నాకే తెలియదు. నేను వట్టి పిచ్చి మొద్దునే. ముందు నా ఫొటో నాకిలా ఇచ్చెయ్యండి."

ఆయన: "ఫొటో వేసింది తియ్యటానికి కాదు. నీకిష్టం లేకపోతే నీ గదిలోనుండి నాఫొటో తీసి ఇలా పారేయ్. తరువాత నీ ఫొటో నీ కిచ్చేస్తాను."

"నాదేం పోయింది ? మీ ఇష్టంవచ్చినట్లుచేసి నలుగురిచేత నవ్వించుకోండి. నే నేం వినబోయూరా ఏం ?" అన్నాను కోపంగా.

"ఇతరులు నవ్వుతారని వులిక్కిపడేవాణ్ని కాను నేను. నేను మాత్రం నవ్వలేనా ఏం ? అయినా ఎవరో నవ్వుతారని నీ కెందుకంత బాధ ?"

"మీ మొగవాళ్ళు ఇలాంటివాటిని తుడిచేసుకుంటారు. ఎవరైనా ఎగతాళిచెయ్యటం ఆడవాళ్లు సహించలేరు" అంటూ అక్కడనుండి విసురుగా వెళ్లిపోయూను.

## 1931 సి. క్లాసు

ఆ రోజులలో సి. క్లాసు ఖైదీలస్థితి చాలా బాధాకరంగా వుండేది. కప్పుకోటానికి కంబళ్ళు లేవు, పొట్టనిండా తిండిలేదు. పైగా అప్పుడప్పుడు దెబ్బలుకూడా తగులుతుండేవి. ఇదంతాచూసి నేను చాలా బాధపడేదాన్ని. జైలునుండి ఇంటికొచ్చిన తరువాత ఆయనతో అన్నాను – "ఎ., బి. క్లాసులవాళ్లకు అన్ని అవకాశాలు కలుగజెయ్యటం, సి. క్లాసు వాలంటీర్లను మాత్రం బాధపెట్టటం ఎంత అన్యాయం ? ఎ., బి. క్లాసులవాళ్ళు దీన్ని ఎందుకు నిరసించరో నాకు అర్థంకావటంలేదు. అక్కడకు వెళ్ళికూడా పెద్దవాళ్లలాగానే వుండాలనుకొనేవాళ్ళు జైలుకు వెళ్ళటం ఎందుకో ? ఈ పెద్దరికమే ప్రజలలో ద్వేషాగ్నిని రగుల్కొల్పుతోంది.

"ఈ పెద్దరికమే హిందూదేశాన్ని ఈ స్థితికి తెచ్చింది" అన్నారు.

"ఈ విషయంలో ఆందోళనజరగాలి, న్యాయంకోసంపోట్లాడక తప్పదు" అన్నాను.

"ఈసారి నన్ను జైలుకు పోనివ్వు!" అన్నారు.

ఈ విషయంలో నేను విప్లవం లేవదీయదల్చుకున్నాను. ఈ సమస్య ఒక్కరిద్దరివల్ల తీరేదికాదని నాకు తెలుసు. కాంగ్రెసు కూడ ఈ విషయంలో తటస్థంగానే వున్నది. ఈ విషయంలో నేను

కాంగ్రెసు ఆఫీసుకు వెళ్లి మాట్లాడాను. కాని వాళ్లు 'ఇది సమయం కాదు' అని అన్నారు. రెండు మూడు రోజులలో 750 మంది స్త్రీలము సమావేశమయాము. అందులో నలుగురం మాత్రం నాయకత్వం వహించాము. అందరం వూరేగింపుగా అసెంబ్లీకి బయలుదేరాం. ఒకవైపు ప్రజలు, ఇంకోవైపు పోలీసులు, మధ్య మేము మహిళలము వున్నాము. మేము నినాదాలుయిస్తూ అసెంబ్లీ వైపు వస్తున్నామని తెలిసి అసెంబ్లీ మూసివేసి, ఎవరిదారిన వాళ్ళు పారిపోయారు. అప్పుడు మేమంతా అరిచాము. 'ఇలా ఎన్నిరోజులు పారిపోతారో చూస్తాం' అని. మళ్ళీ రెండో రోజు వుదయం బయలు దేరాము. నాలుగువందలమంది కానిస్టేబుల్సు అస్త్రశస్త్రాలు ధరించి మాతో వున్నారు. ఈ విషయం ఆయనకు ఆఫీసులోనే తెలిసింది. నలుగు రయిదుగురితో కలిసి మేమున్న చోటుకు వచ్చారు. పోలీసులు మా వూరేగింపును అడ్డగించారు. ఐదుగు రయిదుగురంగా ముందుకు వెళ్ళవలచాము. మొదటి అయిదుగురిలో నేను వున్నాను. సక్సేనా అన్నారు – "మీరు ఇప్పుడే జైలునుండి విడుదలయారు. అందువల్ల వెనుక గ్రూపులో వుండండి" అని.

"ఇది నామర్యాదకు భంగం." అన్నాను నేను.

కిందకాళ్లూ, పైన నెత్తీ మండిపోతున్నాయి. ఎండ తీక్షణంగా వుంది. చాలాసేపు నిల్చున్న తరువాత హోమ్‌మెంబరు 'ఛతారీ' అడిగాడు– "మీ వుద్దేశం ఏమిటి?" అని.

"సి. క్లాసు ఖైదీల యెడల మానవుల్లాగ ప్రవర్తించాలి. పశువుల్లాగ ప్రవర్తించటం మానుకోవాలి"

ఛతారీ– "అలాగే" అన్నాడు.

"మీవల్ల కాకపోతే స్పష్టంగా చెప్పెయ్యండి. ఈ మాత్రపు సమస్యను తమ చేతులలోకి తీసుకోలేని అసెంబ్లీని మార్చదల్చు కున్నాము" అన్నాము మేము.

"ఈ విషయాన్ని వెంటనే సరిచేస్తాము. కావాలంటే రేపు మీరే చూసుకోండి" అన్నాడు ఛతారీ.

"అయితే రేపేచూస్తాం" అన్నాము.

మా పూరేగింపు వెనక్కు మళ్ళింది. ఆయనకూడ మాతోనే వున్నారు. సాయంకాలం పబ్లిక్ మీటింగు వున్నందువల్ల నేను ఇంటికి వెళ్ళకుండా 'మహిళా ఆశ్రమా'నికే వెళ్ళాను. కాంగ్రెసు స్టేజీని గవర్నమెంటు నిషేధించింది. మీటింగుకు 12,000 మంది ప్రజలు వచ్చారు. చాలామంది పురుషులు మాట్లాడారు. తరువాత నాపేరు చెప్పబడింది. నా రక్తం వురకలుతీస్తుంది. చాలా ఆవేశ పూరితంగా వున్నదన్నారు నా వుపన్యాసం. ఆరోజు దాదాపు 50 మంది వలంటీర్లు కాంగ్రెసులో చేరారు. మీటింగు పూర్తి అయిం తరువాత ఆయన నా దగ్గరకొచ్చి అన్నారు– "భగవంతుడికి కొబ్బరి కాయ కొట్టు. లేకపోతే ఈపాటికి సెంట్రల్ జైల్లోనో, హాస్పటల్ లోనో వుండి వుండాల్సింది. గవర్నమెంటు కాంగ్రెసు వేదికని నిషేధించిందని తెలియదు లాగున్నది."

"నాకెందుకు తెలియదు."

"అయితే తెలియటంవల్లనే నిప్పులుగురిపించావన్నమాట!" అన్నారు.

"ఏం చెయ్యమంటారు. తీరా నిల్చున్నతరువాత మాట్లాడ కుండా ఎలా వుండను. చావు ఎప్పుడో ఒకరోజు తప్పదు. ఏదైనా చేసి చావటం వుత్తమంకదూ!" అన్నాను.

"నువ్వు మొదటినుండీ నన్ను మోసంచేస్తూనే వున్నావు. నేను జైలుకు వెళ్ళాలనుకున్నప్పుడంతా నువ్వు తయారు! చివరకు నేను చేతులు ముందుపెట్టుకు కూర్చోవటం జరుగుతుంది."

"మనిద్దరం పిల్లల్ని వదిలి ఎలా వెళ్ళగలం? మనం లేక పోయినా వాళ్ళు సుఖపడేంత ధనవంతులం అంతకంటేకాదు. అదీ కాక మీరు సాహిత్యసేవ చేస్తూనేవున్నారు. ఇంట్లో వూరికేతిని కూర్చునేది నేనేగా? కీర్తంతా మీరే సంపాదించుకోవాలా ఏం?" అన్నాను.

"ఆకీర్తిని పంచుకొనేరోజు వస్తే అంతా నీకే ఇస్తాలే, నాకేం అక్కర్లేదు" అన్నారు.

"ఆహా ఎంత దానశీలురు? పనిచేసికూడ ఎక్కడో చాటున పడివుండేది స్త్రీలు. పిల్లల్ని కనటం, పెంచటం స్త్రీలవంతు. కాని పేరుమాత్రం పురుషులది!"

ఇలాగే సరదాగా వాదించుకొనేవాళ్లము.

♦ ♦ ♦

మున్సిపాల్టీవాళ్ళు వేశ్యలను పట్టణంనుండి వెళ్ళగొడతారని విన్నాను. 'పాపం, వీళ్ళు ఎక్కడ కెళతారు? ఎలా జీవిస్తారు? ప్రపంచంలో వాళ్ళకు తిరస్కారం, అవమానం తప్ప ఏం లభించింది? పురుషసమాజము దీనికి కారణంకాదా? సమాజం వాళ్ళపాపంలో భాగస్వామికాదా! ఇలాగే ఎన్నో ఆలోచనలతో వ్యాకులి బిక్క రవుతున్న సమయంలో ఆయనవచ్చి 'అలాగున్నావే, మని అడిగారు.

"ఆడవాళ్ళు ఎలావుంటేనేమిటి?" అన్నాను.

"ముందు విషయమేమిటో సెలవివ్వండి!" అన్నారు.

"అడిగే చేస్తారు? భగవంతుడు స్త్రీల బరువూ భారం అంతా పురుషులమీద వేశాడు. కాబట్టి వాళ్ళు ఎలాగయినా ప్రవర్తించవచ్చు. అసలు ఆడవాళ్ళను ఆ భగవంతుడు ఎందుకు సృష్టిస్తున్నాడో తెలియదు!"

నా మాటలకు ఆయన పెద్దగా నవ్వుతూ - "అసలు సంగతేమిటో చెప్పు!" అన్నారు.

పక్కనేవున్న పత్రికతీసి ఆయనకిస్తూ "చదవండి, మీ పురుషుల ఘనకార్యాన్ని" అన్నాను.

చదువుతుంటే ఆయన ముఖం గంభీరంగా మారింది. "నేనేం చెయ్యగలను. రాణీ! ఇది నావల్లకాని పని. నువ్వు అనవసరంగా మనస్సు పాడుచేసు కుంటున్నావు."

"మీరు ఈవిషయంమీద రాయండి. కష్టం కలిగించే విషయాలు విన్నప్పుడు మరి బాధకలగకుండా ఎలావుంటుంది!"

"రాయటానికి నేనెప్పుడూ జంకలేదు. ఇలాంటి సమస్యను విడదీయాలనే ప్రయత్నంలోనే 'సేవాసదన్' రాశాను. రాయటం వరకే నావంతు, దాన్ని అమలులోకి తీసుకురావటం ప్రజలవంతు" అన్నారు.

"ఏదైనా వుపాయం చెప్పండి. ఇది విన్నప్పటినుంచీ నాకు పిచ్చెత్తినట్లుంది" అన్నాను.

"మన దేశం స్వతంత్ర మయేంతవరకూ ఈ సమస్యలు తీరవు. శతాబ్దాలుగా పేరుకుపోయిన సమాజంలోని మురికి, అనుకున్నంత త్వరగా వదిలేది కాదు".

"మా మగవాళ్ళు ప్రపంచంలో తమకు మాత్రమే గౌరవంగా బతికే హక్కు వుందనుకుంటారు ఎందుకో? అసలు ఆడవాళ్ళు చెడిపోయేది వీళ్ళమూలంగానేగా! చెడగొట్టి, చెడిపోయారని అసహ్యించుకోవటమా!" అన్నాను వుద్రేకంగా,

"దీనికంతా కారణం నేనేలాగుంది!" అన్నారు ఆయన.

"అవును, నాకు మీమీదనే కోపంవస్తుంది. ఇదంతా చూస్తూ కూర్చుంటున్నారు."

"నిజంగా నేనేం చెయ్యగలను చెప్పు? ఈ విషయంలో స్త్రీలెంత వివశులో పురుషులూ అంతే!" అన్నారు.

"గాంధీజీ అయినా ఈ విషయంలో ఏమీ రాయరేం!"

"ఆయన చెప్పినదంతా వీళ్ళు వింటున్నారా?" అంటూ ఆయన నవ్వారు.

ఆయన నవ్వు చూస్తుంటే నాకు మండిపోయింది. "పాపం, ఆ నిర్భాగ్యురాళ్ళు చస్తుంటే మీకు నవ్వువస్తుంది!" అన్నాను.

"బుర్ర పాడుచేసుకోవటంకంటే మనం చెయ్యగలిగిం దేమీ లేదు."

"ఇలాంటి సమాజాన్ని పూర్తిగా నాశనం చెయ్యాలి, భగవంతుడు వున్నాడో లేడో? వుంటే ఇలాంటి అన్యాయాన్ని ఎలా చూస్తున్నాడో! బహుశా ఆ భగవంతుడు కూడ మగవాడేనేమో?" అన్నాను.

"నేనూ అదేగా చెబుతున్నాను? భగవంతుడుకూడ స్త్రీలకు అన్యాయమేచేశాడు. ప్రపంచంలోని కష్టమైన పనులన్నీ స్త్రీల నెత్తినే వేశాడు. అయినా అందరికంటే మీరే ఎక్కువ ఈ భగవంతుని మాయలోపడి కొట్టుకుంటున్నారు. అందుకేగా నిన్ను నాస్తికురాలు కమ్మంటుంటాను!" అన్నారు ఆయన.

"వుండుమీద కారంచల్లకండి!" అన్నాను.

ఆరోజులు ఎక్కడకు పోయాయో? ఆయన ఎక్కడకు వెళ్ళిపోయారో? ఎక్కడున్నారో? ఆయన్ని ఈరోజు ఎక్కడున్నారని వెతుక్కోను?

ఆయన్ను అయినదానికీ కానిదానికీ వేధించేదాన్ని. నా బరువు భారమంతా ఆయన నెత్తినే వేసేదాన్ని. బహుశా అందువల్లనే నాకు ఆయనమీద అంత అధికారం వుండేది? అందరికీ అన్నివిషయాలూ చెప్పలేము. పరాయివాళ్ళు పరాయివాళ్ళే. ఆయనమాత్రమే పూర్తిగా నావాడు. బహుశా అందువల్లనే ఆయనకు నాగురించిన అంత విచారం గలిగేదేమో? మాటమాటకూ మూతిముడుచుకొనేదాన్ని. కాని ఈరోజు నేనుపూర్తిగా మారిపోయాను. మారిపోక ఏంచేస్తాను పరిస్థితులు మారినప్పుడు? నావను నడిపేవాడే లేనప్పుడు నావ ఎక్కినవాడి రక్షణ ఎవరు చేస్తారు? నేను పూర్తిగా మునిగిపోయాను. ఆయన కళ్ళు మూసిన రోజునే ప్రపంచమంతా నాకు చీకటిమయం అయిపోయింది.

'విశ్వమిత్ర'లో ఒక వ్యాసము :

సాధారణంగా మేము సామాజిక, సాహిత్య, రాజకీయ, విషయాలను చర్చించుకొనేవాళ్ళము. నేను స్త్రీలపక్షం వహించే

దాన్ని. స్త్రీలనుగురించి ఎవరైనా చెడుగా వ్యాసం రాస్తే నాకు చాలా కోపంవచ్చేది. దానికి ఆయన్ను జవాబు రాయమనేదాన్ని. లేకపోతే నేనే రాస్తానంటే ఆయన వద్దనేవారు. స్త్రీలపక్షం స్త్రీలే వహిస్తే బాగుండదనేవారు. 15 సంవత్సరాలనాటి మాట. ఒకసారి 'విశ్వమిత్ర'లో ఒక మహాశయుడు స్త్రీలమీద ఒక వ్యాసం రాశాడు. ఆ మహానుభావుడికి స్త్రీలంటే అంతమంట ఎందుకో నాకు అర్థంకాదు. అది చదివి ఆయనతో అన్నాను— "మీరు దీనికి జవాబు రాయండి. లేనట్లయితే చెప్పండి నేనే రాస్తాను".

"రాయటానికి చాలామంది స్త్రీలువున్నారు."

"మీరు ఇలా అనటం నాకు చాలా బాధాకరంగావుంది!" అన్నాను.

"పురుషులు జవాబిస్తే బాగుంటుంది. స్త్రీలను స్త్రీలే సమర్థించుకోవటం ఏమిటి?" అన్నారు.

"పురుషుల్లోకల్లా పెద్ద రచయిత మీరే ఎందుకు రాయరు?" అన్నాను.

"ఎవరిచేతనైనా రాయించమంటే రాయిస్తాను. శాస్త్రిగారిని పిలవనా!" అన్నారు.

"పిలవండి"! అన్నాను.

పక్కింటిలోనేవున్న శాస్త్రి వస్తూనే అన్నారు — "ఎందుకు పిల్చారు?"

"నేను కాదు. వీరు పిలిపించారు" ఆయన అన్నారు నన్ను చూపిస్తూ.

నేను పత్రికను శాస్త్రిచేతికి ఇస్తూ అన్నాను — "కొంచెం ఈ వ్యాసంచదివి చూడండి; వ్యాసం శీర్షికపేరు 'మహిళామణులు ఏవైపుకు వెళుతున్నారు?' దీన్ని చదివి జవాబురాయండి. ఈ మహాశయునికి ఆడవాళ్ళంటే ఎందుకో అంతకసి! ఆడవాళ్ళు సరియైన వైపుకే వెళుతున్నారు. మగవాళ్లెలా వెళుతున్నారో, ఎక్కడి

చెబుతున్నారో ముందు తెలుసుకోవాలి. పురుషుల్లో రాసేవాళ్ళు ఎక్కువ కాబట్టి ఇష్టమొచ్చిన రాతలు రాస్తున్నారు. స్త్రీల అధోగతికి కారకు లెవరు? వాళ్ళను తప్పుదోవల్ని పట్టించిం దెవరు? కొంచెం బుర్ర వుపయోగించి ఆలోచించివుంటే ఇలాంటి రాతలు రాయరు. ఈ మహాశయుడు బహుశా స్త్రీకి పుట్టివుండడు! లేక స్త్రీప్రేమను పొందలేకపోయి వుంటాడు" అన్నాను వుక్రోషంతో.

నా మాటలు వింటున్న ఆయన కళ్ళలో నీరు తిరిగింది. శాస్త్రికికూడ కష్టంకలిగింది. జవాబు రాస్తానన్నాడు. ఆయన 'మాధురీ'లో ప్రచురిస్తానన్నారు. "ఆ మహాశయుడు రాసి దూరం గానే వున్నాడు. ఆ ఫలితం మనం అనుభవిస్తున్నాము" అన్నారు ఆయన.

నాలుగయిదు రోజుల్లోనే శాస్త్రి జవాబు రాసుకొచ్చాడు. నాకు చాలా నచ్చింది. 'మాధురీ'లో ప్రచురించబడింది. అది చదివిన చాలామంది స్త్రీలకు సంతోషం కలిగింది. 'మాధురీ' బహుమానం కూడా ఇచ్చింది.

*　　　*　　　*

మా ఇంట్లో ఒక ముసలి పనిమనిషి వుండేది. రాత్రింబవళ్ళు మా ఇంట్లోనే వుండేది. ఆ ముసల్దానికి నలుగురు కొడుకులున్నారు. ఒక కూతురుకూడ వున్నది. నెలకాగానే నలుగురు కొడుకుల్లో ఎవరో ఒకడువచ్చి జీతం తీసుకెళ్ళేవాడు. ఇది చూసి ఒక రోజు ఆయన అన్నారు – "ఈ ముసలిదాని కొడుకులు మనుషులో పశువులో నా కర్థంకావటంలేదు. ఈ ముసలిముండ పని చెయ్యటం, రాళ్లలాగవున్న కొడుకులు జీతంపుచ్చుకు పోవటం, చాలా బాగుంది" అన్నారు దిగులు ముఖంపెట్టి.

"ఇన్నిటికీ మీ రనేదేమిటి?" అన్నాను.

"దీని కొడుకులకు సిగ్గులేదంటున్నాను. ముసలిదాని కష్టార్జితం తింటున్నారు."

"పిల్లకు సిగ్గేమిటి ? పెద్ద పెద్ద వాళ్ళకే సిగ్గులేదు."

"అసలు ఈ ముసల్ది ఎందు కిస్తుంది వాళ్ళకు ?"

"వచ్చేడిస్తే ఇస్తుంది. ఎంతకాదన్నా తల్లి ముండామె ! మీారు 'పిల్లలుగల విధవ' అనే కథకూడా రాశారుగా !"

"ఇంగ్లీషు చదువుకున్న వాళ్ళలోనే ఎక్కువస్వార్థం వుంటుం దనుకొనేవాడిని. కాని చూస్తున్నకొద్దీ ఈజబ్బు అందరిలో ప్రవే శిస్తున్నది. బీదవాళ్ళలో తల్లిని ప్రేమించేవాళ్ళు ఎక్కువగా వుండే వాళ్ళు. ఇప్పుడు వాళ్ళుకూడా మారిపోతున్నారు. రానురాను స్వార్థం పెరిగిపోతూంది. కనిపెంచిన తల్లినికూడా మర్చిపోతున్నారు. కుక్కముందు వేసిన రొట్టెముక్కను దానిపిల్లలు తినేస్తాయి. తల్లి తింటుందా లేదా అనేది వాటి కుండదు. మానవుడుకూడా మొదట పశువులాగనే జీవించాడు. ఈనాటి మానవుడు ఎంతోకాలంగా చేసిన ఎన్నో ప్రయత్నాల, పరిణామమే ! కాని స్వార్థం మళ్ళీ మానవుడిని ఆ మొదటిదశ వైపుకే తీసుకెళుతూవుంది" అన్నారు ఆయన.

"మీారు కొత్తకొత్త విషయాలన్నీ మాట్లాడుతున్నారు."

"పాపం ! ఆ ముసలిముండ బకెట్‌నిండా నీళ్ళు తేవటానికి ఎంత కష్టపడుతుంది ! కాళ్లూ, చేతులూ వణుకుతుంటాయి. చూస్తే జాలేస్తుంది. అందుకే వీలయినంతవరకు నాపనేదీ దాన్ని చెయ్య నివ్వకుండా నేనే చేసుకుంటాను" అన్నారు.

ఈవిషయంమీాద ఆరోజు ఎంతోసేపు వాదించుకున్నాము.

ఆయన అన్నారు: "స్త్రీల విషయంలో ఇంకో విచిత్రమైన అభిప్రాయంవుంది. భర్త గౌరవించినా లేకపోయినా బతికుంటే సౌభాగ్యవతిగా గణించబడుతుంది. భర్త చనిపోతే అభాగ్యురాలు గావించబడుతుంది."

నేను : "అవును ! భర్త చనిపోయిన స్త్రీ అభాగ్యురాలే."

ఆయన : "నువ్వు పొరపడుతున్నావు."

నేను : "నేనేం పొరపడటంలేదు."

ఆయన : "నేను దాన్ని ఒప్పుకోను."

నేను : "మీరు ఒప్పుకోపోతే ఏమయింది?

ఆయన : "భార్య బతికుండగానే పురుషుడు రెండో పెళ్ళి చేసుకున్నా, భార్యను అసహ్యించుకున్నా, అవమానిస్తున్నా, తిరస్కరిస్తున్నా, అతనిభార్య సౌభాగ్యవంతురాలా? ఆమె జీవితంలో ఏం అనుభవిస్తుంది? అంతకంటే భర్తను కోల్పోయిన స్త్రీయే సుఖపడగలదు. కనీసం ఆమె తన భర్త జీవించి వుండగా లభించిన ప్రేమనూ, ఆదరణనూ, గుర్తుచేసు కొంటూనైనా ఆనందించగలదు. అదే ఆమె హృదయంలో పదిలంగా దాచుకొన్న సంపత్తి. ఆమె హృదయఫలకంలోని ఆ మధురస్మృతులే ఆమె అమూల్య ఆభరణాలు. కాని భర్తచేత తిరస్కరింపబడి, అవమానింపబడిన స్త్రీ విషయం కొంచెం ఆలోచించిచూడు.

ఈ మాటలన్నీ గుర్తుచేసుకుంటూ ఒకరోజు నేనే ఏడవాల్సి వుంటుందని ఆరోజు నాకేం తెలుసు? ఆయనకు సంబంధించిన స్మృతులను హృదయంలో ఎంతో జాగ్రత్తగా పదిలపర్చుకుంటున్నాను. స్మృతి ఒక్కటే చిరస్థాయి అయినదని నా స్వామి చెప్పారు, ఆరోజుల్లో. ఆయనతో వాదించిన విషయాలన్నీ చాలా చిన్నవిగా కన్పించేవి. ఈ రోజు కూర్చుని వాటినే గంటలకొద్దీ ఆలోచిస్తున్నా, రాస్తున్నాను. గుర్తుచేసుకోవటం బాధాకరమైనా, గుర్తుచేసుకోకుండా వుండలేను. నేను ఈ విషయాలను పాఠకుల వినోదంకొరకు రాయటం లేదు. ఎందుకు రాస్తున్నానో నాకే తెలియదు. మానవునికి ఏడవాలని పించినప్పుడు, దుఃఖకరమైన విషయాలను గుర్తుచేసుకోవటంలోనే ఆనందం కలుగుతుంది. అందువల్లనే గుర్తు చేసుకుంటాడు, ఏడుస్తాడు.

అన్నగారి (పెదనాన్న కొడుకు) స్వర్గవాసం

1932 లో ఆయన అన్నగారు స్వర్గస్థులైనారు. ఆయన చాలా బాధపడ్డారు. స్త్రెగ్గడలు లేచివుండటంవల్ల ఆయన అన్న జబ్బులోవుండగా చూట్టానికి వెళ్ళలేకపోయారు. చనిపోయిన నాల్గవరోజు వెళుతూ నాతో అన్నారు. – "వారంటు లేకుండా అరెస్టు చేస్తున్నారు. జాగ్రత్త! నేను తిరిగి వచ్చేంతవరకూ నువ్వు ఇల్లు కదలొద్దు."

బనారస్ వచ్చిం తరువాత నాకు తెలిసింది. ఆయన్ను చూడగానే వాళ్ళ వదిన ఏడ్చిందట. ఆయన అన్నారట– "ఏడవ బాకు వదినా! నేనున్నాగా! నాకు అన్న లేడు. కాని పిల్లలకు మాత్రం వాళ్ళకు నాన్నలేడని చెప్పకు. ఇప్పటివరకూ నేను ముగ్గురు పిల్లల తండ్రిని, కాని ఈ రోజునుండి ఐదుగురు పిల్లల తండ్రి నయాను." వందరూపాయలు వదిన కిస్తూ అన్నారు – "త్వరలో నేను మళ్ళీవస్తాను. ఈ కర్మకాండంతా ఆడంబరంగా చేయటం నాకిష్టంలేదు, శివరాణీని అరెస్టుచేస్తారేమో? నేను వెంటనే వెళ్ళిపోవాలి".

'ఆజ్'లో వ్యాసం

ఈసంఘటనకాశీలో జరిగింది. 'ఆజ్'లో ఆయన ఒకవ్యాసం రాశారు. అది చదివి కాశీలోని హిందువులకు చాలా కోపం వచ్చింది. హిందూమహాసభవాళ్ళ ప్రతాపం ఎక్కువగావుంది. కాంగ్రెసువాళ్ళుకూడ హిందూమహాసభను సమర్థిస్తున్నారు. ఒక రోజు కొంతమంది మా ఇంటికి వచ్చారు. అందులో కాంగ్రెసు వాళ్లుకూడ వున్నారు. ఆ వ్యాసం రాసినందుకు హింవులకు కోపంగా వుందని ఆయనతో అన్నారు. ఆయన లోపలకు రాగానే నేను అడిగాను – "ఏమటి వాళ్ళంటున్నారు!"

ఆయన: "ఏంలేదు. ఆ వ్యాసం చాలాబాగుందంటున్నారు."

నేను: "ఏదో బెదిరిస్తున్నారు లాగుంది!"

ఆయన: "అదంతా హిందూమహాసభ ప్రభావం."

"ఇక్కడకివచ్చినవాళ్ళంతా కాంగ్రెసువాళ్లలాగుంది?"

"వీళ్ళుకూడ వాళ్ళనే సమర్థిస్తున్నారు. ఈరోజు."

"ఇలాంటి రాతలెందుకు రాస్తారు? గవర్నమెంటుకో, ప్రజలకో ఎవరో ఒకరికి కోపం తెప్పిస్తూనే వుంటారు! తీరాచూస్తే మీరు రెండున్నర వెముకలమనిషి!"

"పబ్లిక్, గవర్నమెంటూ, రచయితను తమబానిస అనుకుంటుంది. ఇతరులను సంతోషపెట్టేవాడు రచయిత ఎలా అవుతాడు? గవర్నమెంట్ జైల్లో వేస్తామని బెదిరిస్తుంది; పబ్లిక్ కొడతామని భయపెడుతుంది. వీటన్నింటికీ భయపడేకంటే రాయటం మానుకోవటం వుత్తమం" అన్నారు.

"ఏదైనా చెయ్యండి కాని శత్రువులను పెంచుకోకండి."

"రచయిత అంతఃప్రేరణవల్ల రాస్తాడు?"

"అది నిజమేకాని అనవసరంగా పోట్లాటలు తెచ్చుకోవటం ఎందుకు?"

"ఈ ప్రపంచమే పోట్లాటలమయం. పారిపోతే లాభంలేదు: యుద్ధభూమిలో నిలబడి వున్నవాడే వీరుడు."

"వీళ్ళు ఒకరోజు కాంగ్రెసునూ, ఇంకోరోజు హిందూమహాసభనూ, ఎలా సమర్థిస్తారో?"

"అయితే నన్నేవర్ని సమర్థించమంటావు?"

"నేను అలా ఎప్పటికీ చెప్పను. వీళ్ళంతా మిమ్మల్ని ముసల్మాను అయూవంటున్నారు. మీరు ముసల్మానయితే వీళ్ళకెందుకో, క్రిస్టియన్లయితే ఎందుకో?"

"అదంతా వీళ్ళ భ్రమ! తమ హృదయకవాటాన్ని మూసి వుంచుతారు. ప్రతిచోట, ప్రతిపనిలో మోకాలడ్డం పెట్టడమే వీళ్ళపని. వీళ్ళకు నేనెంతవరకని చెప్పగలను?"

"వీళ్ళకు చెప్పటానికి ప్రయత్నించారా?"

"తెలుసుకోవటానికి ప్రయత్నించినప్పుడుగదా మానవుడు తెలుసుకో గలుగుతాడు. అయినా నీ వెందుకంత దిగులు పడ తావు?

"శత్రువులమధ్య వుండాల్సివస్తే దిగులుగ దూ?"

నేను నిశ్చింతగా వున్నాను. నాకు హిందువులూ, ముస్లి ములూ, ఇద్దరూ ఒక్కటే. రచయిత ఇలాంటి విషయాలకు భయ పడితే ఇక రాసినట్లే! ప్రజలకు నాయకత్వాన్ని వహించగలడు?

"ప్రజలు మీరు చెప్పేది వినరు. రాసేది చదువరు; చది వింది అసహ్యించుకుంటారా. అలాంటప్పుడు మీ అభిప్రాయాలవల్ల కలిగే ఫలితం?

"రచయిత ప్రతిఒకరికీ అనుకూలంగా ఎలా రాయగలడు! తన అభిప్రాయాన్ని ధైర్యంగా చెప్పటమే అతని కర్తవ్యం. ప్రజలకు కూడ వాళ్ళ వాళ్ళ అభిప్రాయాలుంటాయి. గొర్రెమందలాగ ఒకరు చెప్పిందాన్ని అనుకరిస్తే లాభం? ప్రజలే తమ మంచిచెడ్డలను నిర్ణ యించుకోగలరు. ఈ పెద్దవాళ్లందరికూ నాయకులు కావాలనే తాపత్రయమేగానీ, ప్రజలను బాగుచేయాలనే ఆదుర్దా ఎక్కడ వుంది! హిందూ ముస్లిముల్లో బేధాలు కల్పించి తమ నాయకత్వా నికి మెరుగులుదిద్ది ప్రయత్నించేవాళ్లే."

"అయితే వీళ్ళను సరైనమార్గంలో పెట్టటం ఎలా?

"భగవంతుని దయవల్ల ఎప్పుడు ఈ బేధభావాలు సమసి పోతాయో? అంతవరకూ మనకు స్వాతంత్రం లభించదు. గాంధీకి వీళ్ళిద్దరూ సమానులే. ఆయన ముందు మానవత్వాన్ని చూస్తారు. మానవుడ్ని మానవుడుగా చెయ్యటమే ఆయన మొదటికోర్కె."

"గాంధీజీ అంటే అందరికీ ఇష్టమే. ఆయన సర్వప్రియులు."

"గాంధీని తిట్టేవాళ్ళెంతమంది లేరు? ఆయన కొడుకే ముస్లిం మతాన్ని స్వీకరించాడు. కస్తూరిబా ఏడుస్తుంటే ఆయన ఆమెను ఓదారుస్తూ అన్నాడు. 'మతం మార్చుకున్నంతమాత్రాన మనిషిలో

ఏం మార్పువచ్చింది!' ఆయన యానాదిపిల్లను పెంచారు. తన పళ్ళేంలోనే తినిపించారు."

"మీరు కూడ గాంధీ కావాలనుకుంటున్నారా?"

"గాంధీకూడ మానవుడే. ప్రయత్నిస్తే ఎవరైనా గాంధీ కాగలడు. ఒకప్పుడు గాంధీకూడ సాధారణ మానవుడే. అప్పుడు ఆయన్ను ఎవరూ 'మహాత్మా' అని పిలవలేదు. ప్రయత్నించి ఆయన 'మహాత్మా' అయ్యాడు. అంతేకాని ఎవరూ ఆయన్ను మహాత్మాను చెయ్యలేదు."

"మీరు అందుకే రోజుకొక పోట్లాట కొనుక్కొచ్చు కొంటున్నారా? పోట్లాటుంటేగాని మహాత్ములు కారా!" అన్నాను.

"నేను పనిచేస్తున్నాను, గాంధీ పనిచేస్తున్నాడు. ఆయన క్కూడా ఎన్నో కష్టాలు వస్తుంటాయి. కాని ఆయన ఎప్పుడైనా చింతిస్తున్నారా? అదే జీవితము." అన్నారు.

"గాంధీకి జబ్బుచేస్తే దేశమంతా కలవరపడుతుంది, ఇక్కడ చస్తున్నా తొంగిచూసే దిక్కులేదు"

"దానిక్కారణం మన సంకుచిత పరిధి. ఆయన ప్రపంచ మంతటికీ చెందిన వ్యక్తి. అందుకే ఆయన్ను అంతమంది ప్రేమిం చటం జరుగుతుంది."

"ఇంకేం మీరూ పెళ్ళాంబిడ్డల్ని వదిలేసి మహాత్మా అయ్యే ప్రయత్నంలో బయలుదేరండి."

* * *

"స్త్రీ స్వాతంత్ర్యం విషయంలో మీ అభిప్రాయం ఏమిటి?"

"స్త్రీ పురుషు లిద్దర్నీ సమానంగా చూడగోరతాను."

"మరి మీరు దానికోసం ఆందోళన ఎందుకు లేవదీయరు?"

"నేను ఆ శక్తులను సాహిత్యంలో నింపగోరుతున్నాను."

"ప్రజానీకం దాన్ని చదువుతుందా?"

"ప్రజలు విద్యావిహీనులుగా వున్నారనీ, సాహిత్యహీనుల్ని కూడ చెయ్యమంటావా? నిదానంగా అంతా బాగుపడుతుంది. రష్యాలో రెండువందల సంవత్సరాలకు ముందే రచయితలు నేటి పరిస్థితులను రాశారని నీకు తెలుసా?"

"అంతవరకూ నేను బతికుంటానా ఏ-?"

"తత్కాలంలో ఫలితం రావాలంటే ఎలా? బహుశా మనం కూడ ఆరోజు చూడవచ్చు. గత 25 సంవత్సరాల్లో ఎంత మార్పు కనిపించింది?"

"ఏం మార్పు"

"మార్పు లేకపోవటం మేమిటి? మీ అమ్మ తన జన్మలో, జైలుకు వెళ్ళాలని ఆలోచించి వుండదు? మరి నువ్వు జైలుకు ఎలా వెళ్ళావు? నువ్వేంటి? ఇరవై వేలమంది జైలుకు వెళ్ళారు. స్త్రీలలో ఎంతో అలజడి కన్పిస్తుంది. ఇది భవిష్యత్తుకు శుభచిహ్నం"

"ఇంకా ఎంతమందో స్త్రీలను ఘోషాలోనే వుంచటం మంచి దనుకుంటున్నారు?

"తరతరాలగా వస్తున్న అలవాట్లను ఇంత త్వరగా ఎలా వదలగలరు?"

"మన దేశంలోని ఎక్కువమంది ప్రజలు గ్రామాల్లోనే నివసిస్తున్నారు. వాళ్ళ జీవితాల్లో ఏంమార్పు కన్పిస్తుంది?"

"వాళ్ళను బాగుజేసే ప్రయత్నం మీస్త్రీలే చెయ్యాలి?"

"మేమెంతమందిమున్నాము?"

"అరణ్యాన్ని కాల్చటానికి ఒక్క నిప్పురవ్వచాలు."

"కాంగ్రెసుకు చందా అడగటానికి వెళ్ళినప్పుడు గ్రామస్తులు ఎంతోమంది మమ్మల్ని తిట్టారు. అలాంటప్పుడు మేమేం చెయ్యగలం?"

"ప్రజల కల్యాణానికి పాటుపడే వ్యక్తిని బతికుండగా ఎవరూ గౌరవించరు. చచ్చిపోయిన తరువాత పూజిస్తారు. వాళ్ళు తిడితే

మీరు పుడుకోవడం ఎందుకు ? వాళ్ళ తిట్లను నవ్వుతూ స్వీకరించ గలిగినప్పుడే మీకు గౌరవం లభిస్తుంది."

"మీరు చందా అడగ్గలరా ?

"ప్రయత్నించాను. కాని నా వల్ల కాలేదు."

"మేము నెలకు పదేసివేల చొప్పున చందా వసూలు చేశాం ?"

"మీ ఆడవాళ్ళు ఇలాంటి విషయాల్లో చాలాగట్టివాళ్లే. ఇతరులను ఆకర్షించేశక్తి మీలోవుంది."

"లక్షలకొద్దీ చందావసూలు చేసిన పురుషులెంత మంది లేరు?"

"వాళ్ళకు ఎలా అడగాలో తెలుసు. అదికూడ ఒక కళే! నువ్వురోజూ వుపన్యాసాలు దంచేస్తున్నావు. నాకు చాతకాదు."

"ఉపన్యాసం ఇవ్వటం కాదు, గొంతు చించుకోవటంఅనండి."

"పని జరిగిపోతుందిగదా ?"

## అక్టోబరు 1932

మేము 'బెసయా'లో వున్నాము. దీపావళి మూడురోజులుంది. 'జాగరణ్' సంపాదకత్వంలో మునిగివున్నారు. ఆయనకు దీపావళి దగ్గరకొస్తుందనికూడ గుర్తులేదు. ఆరోజు మూడు గంటలకు ఇంటి కొచ్చిఅన్నారు-"దీపావళి ఇంకా మూడు రోజులే వుందనుకొంటా?"

"మీకు ఇవ్వాళ తెలిసిందా?"

"ఇవ్వాళే బజాల్లో కొట్లన్నీ అలంకరిస్తున్నారు. అందరూ ఇళ్ళు బాగుచేసుకుంటున్నారు. మరినువ్వు నీఇంటిని అలాగే వుంచుతావా?"

"మీకు 'జాగరణ' 'హంస'ల పనినుండి తీరిక చిక్కితే కదూ రెండోపని చూట్టానికి ?"

"నామీద కోపం వచ్చిందా ? నిజంగా నాకు గుర్తేలేదు. అలిగావా ?"

"నేను అలిగితే ఎవరికొక్కావాలి? నేను ఎప్పుడో చెప్పాను పండగ దగ్గరకొస్తుందని." "నాకు తీరిక లేదు. 'జాగరణ'ను త్వరగా తీసుకు రావాలన్నారు."

"ఆ తరువాత నాకు గుర్తేలేదు. నువ్వుకూడ పలక్కుండా వున్నావు."

"ఎన్నిసార్లు చెప్పను?"

"పని తొందరలో పూర్తిగా మర్చిపోయాను. ఇంకా ఆలస్యం ఎందుకు? డబ్బు ఇవ్వు! సున్నమదీ కొనుక్కొస్తాను. మన ఇల్లు కూడ ఎంతదూరం వుందికనక? గుర్రబ్బండిలో వెళదాం."

బారెడు పొద్దుండగానే మా గ్రామం చేరుకున్నాము. పదిహేను మంది కూలీలను పెట్టి ఇల్లు బాగుచేయించాము. రెండో రోజు సున్నం కొట్టటం, దర్వాజాలకు రంగులు వేయటం కూడ అయిపోయింది. ఆయనకూడ పగలంతా కూలి వాళ్ళతో పనిచేశారు. సాయంకాలం అందరితోపాటు ఆయనకూడ దీపాలు వెలిగించారు. రాత్రి వూళ్ళో రైతులు చాలమంది ఆయన్ను మాట్లాడానికి వచ్చారు. వాళ్ళందరకూ కూర్చుని దీపావళీ విశేషాలు విన్పించారు. ఆయన పరుగెత్తుతూ దీపాలు వెలిగిస్తుంటే నాకు నవ్వు ఆగిందికాదు.

"ఇవ్వాళ మీరు పిల్లవాడిలాగ వుత్సాహంగా వున్నారు," అన్నాను.

"ఈ రోజుల్లోని కుర్రాళ్ళలో వుత్సహం కూడవుందా?"

"ఈ రోజుల్లోని కుర్రాళ్ళు చదువుకొనేది పండగలు చెయ్యటానికేనా? పండగల్లో ఏముంటలే అనుకోవచ్చు."

"అదేంకాదు నేటి యువకుల్లో వుత్సాహమంటూనే కన్పించటంలేదు. పండగల్లో సంతోషంగా వుండటం జీవిత లక్షణము. ఎవరిలో ఎంత వుత్సాహమూ, జీవమూ వుంటుందో వాళ్ళంత సుఖపడగలరు" అన్నారు.

ప్రెస్‌లో హర్తాళ్

మా ప్రెస్‌లో హర్తాళ్ జరుగుతోంది. ఆయన ఇంటికొచ్చి అన్నారు. - "ఈ ప్రెస్ నా ప్రాణం తీస్తుంది."

"సంగ తేమిటో చెప్పండి?"

"ఏం చెప్పను? మేనేజరుకూ, పనివాళ్ళకూ బొత్తిగా పడటం లేదు."

"వాళ్ళు పని సరిగా చెయ్యకపోతే; పాపం! మేనేజరు ఏం చేస్తాడు? చస్తాడా ఏం!"

"మేనేజరుకూడ తనను ఆ సాక్షాత్తు భగవంతునికంటే తక్కువగా ఏం భావించుకోవటంలా."

"భగవంతుడి నని ఎలా అనుకుంటాడు? అతను సరిగా పని చేయించకపోతే మీరు మాత్రం వూరుకుంటారా ఏం?"

"చిన్న చిన్నవాటికి పనినుండి సస్పెండ్ చెయ్యటం, డబ్బు విరగ్గొయ్యటం, ఇదంతా ఏమిటి?"

"అందులో అతని తప్పేముంది?"

"ఈ మేనేజరూ టక్కరితనం చేస్తున్నాడు. గడియారంలో టైమ్ ఒకసారి తగ్గిస్తాడు, ఇంకోసారి ఎక్కిస్తాడు. నేను ఎన్నో సార్లు అలా చెయ్యవద్దని హెచ్చరించాను. వింటేగదూ? పైగా అన్నీ నష్టాలే! కూలీలను అన్యాయం చేసి ఏం బాగుపడతాం? ఇంత సంపాదిస్తూ మనమే డబ్బుకు ఇబ్బంది పడుతుంటాం. పాపం! ఆ బీద వాళ్ళకు ఇచ్చే ఆ నాలుగు డబ్బుల్లో మాట మాట్లాడితే విరగ్గొయ్యటం చేస్తుంటే, వాళ్లుమాత్రం బతకక్కరలేదూ? చిన్న పొరపాటు జరిగితే ఒకణ్ని తీసెయ్యటం, ఇంకొకడిని పెట్టటం. మన వాళ్ళలో చదువుతోపాటు స్వార్థంకూడ పెరిగిపోతున్నది" అన్నారు దిగులుగా ముఖంపెట్టి.

"అయితే ఆ తప్పంతా మీదే మేనేజర్నెందుకంటారు?"

"నా కింద వాళ్ళతో పోట్లాడే అలవాటు నాకు లేదు. తన కింద వాళ్ళను తనతో సమానంగా చూసుకున్న రోజు ఈహర్తాళ్ళూ జరగవూ, పోట్లాటలూ జరగవు. మేనేజరువల్ల హర్తాళ్ జరుగుతుంది. ఆ చెడ్డపేరు నాకు వస్తుంది. పని పూర్తిగా ఆగిపోయింది."

"మీలాగే మేనేజరూ చేతులు ముందు పెట్టుకొని కూర్చుంటాడు. ఆ కూలివాళ్ళమాత్రం తక్కువతిన్నారా!"

"లేదమ్మా తల్లీ కూలీలతో మెరుగు. ఈ మేనేజరు పలక్కుండా కూర్చున్నాడు. నష్టం ఎవరికి?"

"అయితే మీరే ఆ మేనేజరు పని కూడ ఎందుకు చూసుకోకూడదూ?"

"నేను వీళ్ళను అసలు పనేచేయటం లేదనటం లేదుగా! చేయించే పద్ధతి తెలియదంటున్నాను."

"అసలు ఈ ప్రెస్ ఎందుకు మనకు? దాంట్లో వచ్చేదీచచ్చేదీ ఏమీ లేకపోయినా, ఇకొక పితలాటకంపైగా."

"అది నా దురదృష్టం. నాకు ఈ పనివాళ్లచింతే పట్టుకున్నది. ఇవ్వాళంతా కూలిలేదు. వాళ్ళేకాదు. వాళ్ల కుటుంబాలన్నీ పస్తులుపడి వుండాల్సిందే."

"అయితే కానివ్వండి. వూళ్ళో వాళ్ళందరికోసం మీరేం చెయ్యగలరు. అంతబాధ పడేవారు మీరే వాళ్లనుపిల్చి ఎందుకు చెప్పకూడదు?" అన్నాను.

"ఆవేశంలో వున్నవాళ్లు ఇప్పుడు ఎవరిమాటా వినే పరిస్థితిలో లేరు."

"రెండు రోజులుపోతే వాళ్లకే తెలిసొస్తుంది. మీరెందుకు అనవసరంగా బాధపడతారు!" అన్నాను.

"నాకు మేనేజరు మీద కోపం వస్తుంది. ఆ దుష్టుడే ఇదంతా తెచ్చిపెట్టాడు. నేను స్వయంగా కూలీలతో మాట్లాడినా అతడిని అవమానించినట్లేగా!" అన్నారు.

"దీని కేదో చికిత్స చెయ్యండి!"

"ఏం చెయ్యను?"

"లేచి కాళ్లూ చేతులూ కడుక్కొని మంచినీళ్ళు తాగండి."

"అరే నే నివ్వాళ ఏమీ తొనుక్కు రాలేదు. సంచి ప్రెస్ లోనే మర్చిపోయి వచ్చాను." అన్నారు.

"పర్వాలేదు, లేవండి. ఇంట్లో అన్నీ వున్నాయి." అన్నాను.

ఆ రోజుల్లో ఆయన చేసే ప్రతిపనీ విమర్శించేదాన్ని. ఆయన తన కింద పనిచేసే వాళ్లను ఎప్పుడూ హీనంగా చూడలేదు. ఆయన తనపని కూడ కూలిపనేనని చెబుతుండేవారు.

## 1 9 3 2

ఢిల్లీలోసాహిత్యసభ జరుగుతుంది. మూడునాలుగు రోజుల్లో వస్తానని వెళ్ళినమనిషి ఏడో రోజుకు వచ్చారు. ఆయన అక్కడ జబ్బుపడ్డారేమోనని నాభయం. నేను ప్రెస్ మేనేజర్ను పిలిపించి టెలిగ్రాం ఇవ్వమన్నాను.

"మీరు అంత భయపడాల్సిం దేమీ లేదు. అక్కడ వాళ్ళు రానిచ్చివుండరు. ఇంకా రెండురోజులు చూసి టెలిగ్రాం ఇద్దాం!" అన్నాడు మేనేజరు.

ఏడోరోజుకువచ్చారు. "ఎక్కడపోతే అక్కడే! ఇంటి ఆలోచనే వుండదు. నాలుగురోజులకు వస్తానన్న మనిషి ఏడురోజుల వరకూ రాకపోతే ఇంటిదగ్గరవాళ్ళు ఏమనుకోవాలి?" అన్నాను కోపంగా.

"ముందు నా కథ విని తరవాత కోప్పడు", అన్నారు నవ్వుతూ.

"రాత్రింబవళ్ళు కథలు రాస్తూనే వున్నారుగా! అందులో ఇదొకటి?"

నా చెయ్యి పట్టుకొని కూర్చోపెడుతూ అన్నారు. "ఇక్కడ నుండి 'జైనేంద్ర' ఇంటికి వెళ్ళాను. నేను వెళ్ళకముందే పండిత సుందరలాల్ వచ్చివున్నారు. మూడురోజులు మీటింగులోనే సరిపో

యింది. నాలుగోరోజు ఒక పంజాబీ మహాశయుడు నన్ను వాళ్ళింటికి రమ్మని పట్టుపట్టాడు. అతను నన్ను ఎన్నోరోజులుగా కలుసుకోవా లనుకుంటున్నాడట. ఆయన భార్యకు నన్ను చూడాలని అభిలాషగా వుందట. ఆమె జబ్బులోవుండటంవల్ల మీటింగుకు రాలేకపోయిందట. అలాంటప్పుడు నేనేం చెయ్యాను చెప్పు?"

"ఊం తరవాత?"

"నా 'మంత్రము' అనే కథ చదివినప్పటినుండీ నన్ను వెతుకు తున్నాడట. తీరా దొరికిన తరువాత వదలనంటూ బలవంతం చేసి తన ఇంటికి తీసుకెళ్ళాడు. నిజంగా వాళ్ళ భార్యాభర్తలకు నేనంటే ఎంతో భక్తి. వాళ్ళ శ్రద్ధాభక్తులముందు నేను తలవొగ్గాను. ఇదీ నా తప్పు. అపరాధిని ఎలా శిక్షిస్తావో శిక్షించు!" అన్నారు.

ఒకరోజు నాస్వామి నాముందు అపరాధిలాగ నిల్చున్నాడు. ఏడురోజులు దూరంగా వున్నందువల్ల ఎంతో బాధపడ్డాను. భయ పడ్డాను. కాని ఈరోజు? ఇప్పుడు ఆ భయమూ లేదు చింతా లేదు! ఈ ఆలోచనల్లోనే రాత్రింబవళ్లు మునిగి తేలుతున్నాను.

శారదా బిల్లు :

స్త్రీలయెడల ఆయనకున్న అభిప్రాయాలు పాఠకులకు ఈపా టికే తెలిసివుంటాయి.

స్త్రీల సమానాధికారాలమీద 'హరవిలాస్ శారదా'గారు పెట్టిన బిల్లును సమర్థిస్తూ 'జాగరణ'లో రాశారు.

"నేను హృదయపూర్వకంగా మీ బిల్లును సమర్థిస్తున్నాను. స్త్రీలు మీకు కృతజ్ఞులై వుంటారు. స్త్రీ, పురుషు లిద్దరూ కష్టపడి ఆర్జించిన ఆస్తి భర్త చనిపోగానే బిడ్డల చేతుల్లోకి వెళ్ళిపోతుంది. ఈ బిల్లు పాసయిన రోజు స్త్రీజాతే మిమ్మల్ని ఆశీర్వదిస్తుంది. హిందూ 'లా' స్త్రీని వ్యర్థజీవిగా ఎంచుతుంది'-ఇలాగే శారదాగారికి అభినంద నాలు తెలియజేస్తూ రాశారు.

నేనూ చదివాను. నేను ఆయనకు అభినందనాలు చెప్పాను. ఆయన అన్నారు – "నా కెందుకు శారదాగారికి చెప్పాలిగాని!"

"మీరు ఆయన్ను సమర్థించారుగా ?"

రాత్రి భోజనాలు అయింతరువాత నేను మళ్ళీ అన్నాను: "మీరు శారదాగారిని చాలా అభినందించారు." "స్త్రీల విషయంలో శారదాగారు ఇంత శ్రద్ధ తీసుకోవటం నాకూ ఆనందంగానే వుంది. ఈ మహామహా పండితు లెవరైనా ఈ మాత్రం శ్రద్ధ చూపించారా!" అన్నారు ఆయన.

"ఏమనువు రాశాడుగా !" అన్నాను.

"రాస్తే ఏంలాభం? దాన్ని చట్టంకింద మార్చితేగదా లాభం!"

"చట్టం ఏర్పడినంత మాత్రానే జరుగుతుందా!"

"నువ్వు పొరపడుతున్నావు. శాసనదండము చాలా బలమైనది."

"ప్రపంచంలో వున్న పిల్లలంతా చెడ్డవాళ్లేనా?"

"ఒకవేళ అందరూ అలాంటివాళ్ళే అవుతారనుకో అప్పు డేం చేస్తావు?"

"మీ నాన్న ఏం వదిలిపోయారు. మీకు స్వంత తల్లికూడా కాదు, సవతితల్లి. ఆమె మీ మీద ఎంత అధికారం చెలాయించేది!"

"నన్ను వదిలేయ్. నీ కొడుకులవైపు ఒక్కసారి చూసుకో. నువ్వు వాళ్ల మంచికే కొట్లాడుతుంటావు కాని వాళ్లు నీ మాట లక్ష్య పెడుతున్నారా? నాకు వాళ్లమీద చాలాకోపం వస్తుంది. నీకు ఎన్నోసార్లు చెప్పాను వాళ్లకేమీ చెప్పటానికి ప్రయత్నించవద్దని. మనం వాళ్లను ఎంత ముద్దుగా చూసుకుంటున్నామో కూడ వాళ్లకు తెలుసు. 'పిల్లలుగల విధవ' అనే నా కథ కేవలం కల్పన కాదు."

"పోనివ్వండి నాకేం ? మీ రున్నంతవరకూ నా కేదిగులూ లేదు."

"ఏది నా ఫీజు ? నీకు ఎన్ని విషయాలు చెప్పాను ? కనీసం తాంబూలమన్నా ఇవ్వు" అన్నారు.

ఈ రోజు ఆయన లేకపోవటం నాకంటే ఎక్కువ దేశానికే హానికలిగింది. ఆయన నా వారుమాత్రమే కాదు. కాని అలాంటి మహాపురుషుడు నావాడై వున్నందుకు నేను గర్విస్తున్నాను. నేను ఆయన జీవించివుండగా ఆయన్ను సరిగా అర్థం చేసుకోలేక పోయినమాట వాస్తవమే. ఆయన నాస్వజనుడు కాబట్టి పూజించి వుండలేక పోవచ్చు. ప్రేమా, శ్రద్ధాభక్తులు ఒక్కచోటున వుండ లేవు. శ్రద్ధాభక్తులు తలవంచితే, ప్రేమ హృదయాన్ని వంచుతుంది. నేను ఆయన్ను పూజించటానికి పళ్ళూ పూలతో పరుగెత్తుకెళితే ఆయన నాకోసం మిఠాయి తీసుకురావటానికి బజారుకు పరుగెత్తివెళ్ళి వుండరు. నిద్రపోతున్న నన్ను లేపి మంచినీళ్ళు ఇచ్చి వుండరు. జబ్బు చేసివున్న నాకు, విసనకర్ర చేత్తో పట్టుకొని విసిరివుండరు. ఈ రోజు ఆయన నాకు చాలా దూరం అయిపోయారు. అందు వల్లనే నాకు ఆయన పూజనీయమైన వస్తువయారు. శారదాబిల్లు ఆయన చనిపోయిన తరువాత త్వరలోనే పాసయింది. ఆయన వుంటే ఎంత ఆనందించి వుండేవారో!

కాశీ విశ్వవిద్యాలయం :

కాశీ విశ్వవిద్యాలయంలో వార్షికోత్సవం జరిగింది. గల్ప-సమ్మేళనకు ఆయన్ను అధ్యక్షులుగా ఎన్నుకున్నారు. నేనుకూడ మీటింగుకు వెళ్ళాను. రెండవ సమావేశం 2-30 గంటలకు ప్రారంభం. మధ్యలో గంటన్నర టైమ్ వుంది. ఇద్దరం బయటకువచ్చాము. ఆ పక్కనే ఒక కాలువ ప్రవహిస్తున్నాది. ఒక చెట్టుక్రింద కూర్చున్నాము. ఆయన తనకు వేసిన పూలమాలను నా మెళ్లోవేసి "మనం ప్రేమ వివాహం చేసుకున్నాము" అన్నారు.

"పాపం! ఇప్పటివరకూ మీరు బ్రహ్మచారులే కాబోలు!" అన్నాను.

"ఇప్పుడు మనల్ని చూసినవాళ్ళు ఏమనుకుంటారో చెప్పు?" అన్నారు కొంటెగా.

"ఏమనుకుంటారు. గంగాస్నానానికి వచ్చారు లాగుంది, అనుకుంటారు."

"నన్ను చూసినవాళ్లెవరూ గంగాస్నానం చేయవచ్చానను కోరు. నేను అన్నదే అనుకుంటారు" అన్నారు నవ్వుతూ.

ఆ కాలువ బడ్డున ఎంతో మంది యువతీయువకులు పకపక లాడుతూ, వయ్యారాలుబోతూ, పచ్చపచ్చగా తిరుగుతున్నారు. పుస్తకాల్లో చదివే ఇంగ్లీషు వాతావరణం కళ్ళముందు కన్పిస్తుంది. ఆయన ముఖం గంభీరంగా మారిపోయింది. "మన దేశం ఎప్పటికి బాగుపడుతుందో తెలియదు. ఇతరులను అనుకరించటంలోనే గొప్ప తనం, విద్వత్తు వుట్టిపడుతుం దనుకొంటున్నారు నేటి యువతీయువ కులు. ఆ అనుకరణకూడ పూర్తిగా కాదు సగం సగమే! ఇంగ్లీషు వాళ్ళలోవున్న మంచితనాన్నిమాత్రం వదిలి, చెడ్డభాగాలను మాత్రమే అనుకరిస్తున్నారు. ఇంగ్లీషువాడు పంకాలకింద విశ్రాంతి తీసుకోనూగలడు, అవసరమైతే ఆ ఎండలోనే ఎన్ని మైళ్ళు అయినా పరుగెత్తనూ గలడు. అపాయాలను ప్రేమిస్తారు వాళ్ళు – ఒక రాష్ట్రాన్ని సుదృఢంచేసుకోవటానికి అవసరమైన గుణాలన్నీ వాళ్ళలో వున్నాయి" అన్నారు.

"వీళ్ళంతా చిన్నవాళ్ళు. ఈ వయస్సులోనే అభిలాషలు ఎక్కువ వుంటాయి."

"వీళ్ళు చిన్నవాళ్ళా? అసలు ఈ రోజుల్లో మానవుడి జీవిత కాలం ఎంత? వీళ్ళ చుట్టూవున్న ప్రజలు ఆకలిమంటలకు ఆహుతి అవటం చూట్టంలేదూ? వీళ్ళు చూడు, రాజకుమారుల్లాగ, రాజ కుమార్తెల్లాగ ఎలా విహరిస్తున్నారో! సీతాకోకచిలుకల్లాగ ఎగురు తున్న ఆ ఆడపిల్లల్ని చూడు! వీళ్ళ పెళ్ళిళ్ళు చేసేప్పటికి తల్లి దండ్రుల తలప్రాణం తోకకు వస్తుంది."

చాలామంది ఆరోజు మీటింగులో కథలు చదివారు. ఆయన వుపన్యాసంలో ఆనాటి మామధ్యజరిగిన విషయాన్ని గురించే ఎక్కువ మాట్లాడారు. యువకులంతా వుత్సాహంతో వింటున్నారు. నాకు వాళ్ళ తప్పును వాళ్ళు గ్రహించుకోటం లేదనిపించింది. వాళ్ళ తప్పు మాత్రం ఏముంది? యవ్వనం నీటి ప్రవాహంలాంటిది. ఎటు పల్లంగావుంటే అటే ప్రవహిస్తుంది. దాన్ని మనం ఎటుకావాలంటే అటే తిప్పుకోవచ్చును. అలాగే మన దేశపు యువకులనుకూడ మార్గదర్శకులుంటే మంచిమార్గంలోనే పెట్టవచ్చును. ఆ తరువాత కూడ ఎన్నోరోజులు మేము ఆ విషయాన్నే చర్చించుకునేవాళ్ళం. ఇప్పుడు ఆయన లేరుకాని ఆయన అన్నమాటలు అలాగే వున్నాయి. ఆయన పాఠకులకు ప్రియమైనవారు. అందువల్ల వారి మాటలను పాఠకులకే బహుమానంగా అర్పిస్తున్నాను.

## 1934 - కాశీ:

'హంస', 'జాగరణ' అనే రెండు వారపత్రికలను నడుపుతున్నారు. ఖర్చు పెరిగిపోయింది. ఆయనకు బొంబాయినుంచి ఒక సినిమాకంపెనీ కబురు పంపింది. ఆయనమిత్రుడు 'చంద్రభాల్ జౌహారీ' స్వయంగా వచ్చి చెప్పాడు. పైకివచ్చి నాతో అన్నారు. "పద, బొంబాయి చూపించుతాను!"

"బొంబాయి చూపిస్తారా? ఏం విశేషం?"

"ఫిలిమ్ కంపెనీవాళ్ళు పిలుస్తున్నారు" అన్నారు.

"కాని ఆ నీరూ, వాతావరణం మీకు పడదు."

"బొంబాయిలో ఎంతమంది వుండటంలేదు?"

"ఉండొచ్చు. ప్రతివ్యక్తీ పరిస్థితులకు లొంగవలసిందే. కాని మీరు అక్కడకు వెళ్ళటం నాకేమాత్రం ఇష్టంలేదు"

"నా పరిస్థితీ ప్రస్తుతం అలాగేవుంది. మనకొచ్చేది కుటుంబ ఖర్చులకే సరిపోతుంది. 'హంస', 'జాగరణ'లను ఎలా పోషించటం!"

"ఈ పత్రికకోసం బొంబాయి వెళ్లటాన్ని నేనసలు సమర్థించను."

"రెండు ఏనుగులను మెడకు కట్టుకున్న తరువాత వాటికి తిండి పెట్టవద్దంటావా? అవిమాత్రం ఎలా బతకటం?" అన్నారు.

"మీ రేపనిచేసినా ప్రాణంమీదకు వచ్చేదే!"

"ఈ ఏడుపు నీ దగ్గర ఎన్నోసార్లు ఏడ్చాను. వీటిని ఒక్కసారి మెడను కట్టుకున్న తరువాత వదిలించుకోవటం అంత తేలిక పనికాదు. అదీకాక, నేను కథలూ, నవలలూ రాసిందానికంటే ఫిల్ముద్వారా ఎక్కువ చెయ్యగలను. పుస్తకాలు చదవలేని, చదవనివాళ్ళు కూడ సినిమాలు చూస్తారు" అన్నారు.

"ప్రజలు సినిమాచూస్తే నాకొచ్చేలాభం ఏమిటి? ఆ లాభం ఏదో ప్రజలే పొందుతారు" అన్నాను.

"నేను నీకు ఎన్నోసార్లు చెప్పాను. ప్రజలను బాగు చెయ్యాలని నేను రాయటంలేదు. నా ఆత్మశాంతికి రాసుకుంటున్నాను. నా రచనలను ఎంత ఎక్కువమంది చదవగలిగితే, అర్థంచేసుకోగలిగితే నా కంతఆత్మకుశాంతి కలుగుతుంది. అదీగాక 'హంస', 'జాగరణ'లకు ఎక్కువ డబ్బు ఇవ్వగలుగుతాను.

"సంవత్సరానికి 9 వేలు ఇస్తామన్నారు. ఒక సంవత్సరం బొంబాయిలోవుంటే చాలట. తరువాత ఇంటి దగ్గరనుండే రాసి పంపిస్తే చాలునట. సంవత్సరానికి పదివేలు రూపాయలు ఇస్తారట. ఒక సంవత్సరం కష్టపడితేమాత్రం ఏం? ఆ తరువాత ఇంట్లో కూర్చొని సంపాదించుకోవచ్చును" అన్నారు.

అలాగయితే సరే, అన్నాను.

"ఇంకెన్ని రోజులు నేను పనిచేస్తాను. మహాచేస్తే ఐదారు సంవత్సరాలు చేస్తానేమో!" అన్నారు ఆయన.

"ఇంత త్వరగా పెన్షన్ పుచ్చుకుంటారా?"

"ఒకపనిని వదిలేస్తే ఇంకోపని మొదలుపెడతాను. ఈ రాయటం, చదవటం వదిలేసి గ్రామంలో ఏదైనా చెయ్యాలనివుంది" అన్నారు.

"మీరు గ్రామం వెళ్ళిపోతే మరి ఇక్కడి పని ఎవరుచూస్తారు!" అన్నాను.

"అప్పటికి ఘన్నా పెద్దవాడయిపోతాడు. వాడు ఇదంతా చూసుకుంటాడు. ఈరోజు రైతుల స్థితి చాలా అధ్వాన్నంగా వుంది. వాళ్ళమధ్యకువెళ్ళి పనిచేసేవాళ్ళు లేనంతవరకూ, వాళ్ళు బాగుపడే లక్షణాలేమీ కన్పించటంలేదు. రెండుమూడు సంవత్సరాలు వాళ్ళ మధ్యవుండి చెయ్యగలపని రచనలతో, వుపన్యాసాలతో చెయ్యటం అసంభవం!"

"మీ రొక్కరూ పనిచేసి ఎంతమంది రైతుల్ని బాగు చేస్తారు?"

"వాళ్ళను బాగుచెయ్యటానికి నేను వెళ్ళటంలేదు. ఆ పని వల్ల నా ఆత్మకు శాంతి కలుగుతుంది. అంతే!"

"ఘన్నా ఈ ప్రెస్‌పని చెయ్యడనుకోండి? అప్పుడేం చేస్తారు."

"ఏదొకపని చెయ్యాలిగా! ఎవరిదగ్గరో పనిచేసేకంటే ఇంటి పని నయంకాదూ! అయినా ఈ రోజుల్లో వుద్యోగాలెక్కడ దొరుకు తున్నాయి!"

"ఒకవేళ చెయ్యనంటాడే అనుకోండి. మీ తమ్ముణ్ని చూడ రాదూ! పెళ్ళయిందీ, వుద్యోగం వచ్చిందీ, ఇంకేం మిమ్మల్ని వదిలే శాడు" అన్నాను నేను.

"అన్నదమ్ము లెందుకు చేస్తారూ? అందులో మారుటి తమ్ముడు?" అన్నారు ఆయన.

"మీరు అతన్ని మారుటితమ్ముడిలాగ చూశారా? స్వంత బిడ్డలాగ చూసుకొన్నారే!"

"సోదరుని యెడల చూపించిన ప్రేమ దయవల్ల కలిగింది. కొడుకులమీది ప్రేమ రక్తసంబంధమైనది. సోదరుడు ఇతరుల కొడుకు

కొడుకు తన రక్తంనుండి వుద్భవించిననాడు. తల్లిదండ్రుల్లాగనే బిడ్డలూ తయారుకావాలని ఆశిస్తాము" అన్నారు.

"ఈనాటి జుల్లో ఎవర్నుండీ దేన్నీ ఆశించటమంత తెలివితక్కువ ఇంకోటి వుండదని నా వుద్దేశం'' అన్నాను.

"మనకు మాత్రమేం? 'లహొ మీ'లో స్వంత ఇల్లుకట్టుకున్నాము. మధ్యమధ్య వచ్చి ప్రెస్ విషయం చూసుకు పోతుండవచ్చు. ఇద్దరు పిల్లలూ చూసుకుంటారు. ఏదైనా రాయగలిగితే, వాళ్ళకే పంపిస్తాను."

"మన పిల్లలైతే మాత్రం అనుకోరా ఏమిటి. మనం సంపాదిస్తున్నాం, వీళ్ళు కూర్చొని తింటున్నారని!"

"ప్రెస్ నా పేరుమీదనే వుంటుంది. నాబిడ్డలంత కృతఘ్నులుగా తయారవుతారని నేను కల్లోకూడ తలచను. అదీకాక అడివిలోవుంటే మాత్రం మనిద్దరి పొట్టలనూ పోషించలేనా ఏం?'' అన్నారు.

"మీరు బొంబాయికి ఎప్పుడు బయలుదేరుతున్నారు?"

"జూన్ మొదటి తారీఖుకు అక్కడ మనం వుండాలి''అన్నారు.

"ఇక్కడ అలహాబాద్‌లో రెండు పెళ్ళిళ్ళకు వెళ్లాలి. అదెలా?" అన్నాను.

"ముందు నేను ఒక్కడ్నే వెళతాను. నువ్వు పెళ్ళి సంబరాలన్నీ ముగించుకొని తరువాతరా!"

"పిల్లల్ని బొంబాయిలోనే చదివిస్తారా?" అన్నాను.

"ఆ విషయం తరువాత ఆలోచించవచ్చులే!"

తరువాత బొంబాయి ప్రయాణానికి ప్రయత్నం ప్రారంభమయింది. తీరాచూస్తే వెళ్ళటానికి డబ్బులేదు. ప్రెస్‌లో కూడ అకౌంటులో లేదన్నాడు మేనేజరు. బ్యాంకులోవున్న డబ్బు సంవత్సరం చివర్లోకాని తియ్యటానికి వీల్లేదు. నా దగ్గర ఎవరో దాచుకున్న డబ్బువుంది, అందులో రెండువందలు ఇవ్వమన్నాను. దాంట్లో

ఒకకానీ కదిలించవనీ, నా దగ్గర వున్న వందరూపాయలు ఇస్తాననీ అన్నాను.

"నీ దగ్గర డబ్బు ఎక్కడుంది?" అడిగారు ఆశ్చర్యంగా.

"ఇంట్లో నేవు ది, ఇ కెక్కడ!" అన్నాను.

"నాలుగయిదు రోజుల్నుండి నాకు డబ్బు దిగులే. ఎవర్నయినా అడగాలంటే, ఎలా అడగాలో తెలియలేదు."

"డబ్బులేదని నాతో ముందే ఎందుకు చెప్పలేదు?"

"నీ కోపాన్నంతా 'హంస' మీాదా, 'జాగరణ' మీాదా చూపిస్తావేమోనని నా భయం!" అన్నారు.

"మీా 'హంస'కూ, 'జాగరణ'కూ నేను సవతితల్లి నన్నట్లు మాట్లాడుతున్నారే!" అన్నాను.

"ఏం చేసేది. ఎప్పుడూ ఏదోఒక బెడద మెడకు తగిలించుకొని బాధపడుతూనే వుంటాను. పైగా నిన్నుకూడ బాధ పెడుతుంటాను. ఇది నా కొక అలవాటుగా తయారయింది. ప్రెస్‌లో మేనేజరు చేతిమీాదుగా నెలకు ఏడువందలు ఖర్చవుతున్నాయి. ఈ రోజు కావాలంటే ఒక్కదమ్మిడీ మా దగ్గర లేదు ఇట్లో ఇచ్చే ఆ కొద్దిడబ్బులోనే నువ్వు వందరూపాయలు మిగల్చగలిగావు. ఎంత పొదుపుగా వాడివుంటావో నాకు తెలుసు. కాని ఆ పని మావల్ల కావటంలేదు" అన్నారు.

"ఇందులో నా గొప్పేముంది? ఎక్కువ వున్నయ్యి కాబట్టే మిగల్చగలిగాను" అన్నాను.

ఆయనకు వెళ్ళటానికి ఇరవై రూపాయలు ఖర్చయాయి. ఎనభయ్ దగ్గర వున్నాయి. ఆయన వెళ్ళిపోయారు. నెలన్నర వియోగం. కొంతసేపు ఏడ్చాను. వుత్తరాలు రాస్తూనే వున్నారు. కాని ఎంతో బాధపడేదాన్ని; కాని ఇప్పుడో? ఇది శాశ్వత వియోగం! అయినప్పటికీ సుఖంగా కూర్చుని గతాన్ని స్మరించుకుంటున్నాను.

ఆయన వుత్తరం జూన్ నాలుగో తేదీన అందింది.

"ప్రియరాణీ,

నేను బొంబాయి క్షేమంగా చేరుకున్నాను. స్టూడియో పని చూసుకుంటున్నాను. నువ్వూకూడ పిల్లల్ని తీసుకొని 'గాలబన్‌సోరామ్' క్షేమంగా చేరుకున్నా వనుకుంటాను. మనమ్మాయీ, జ్ఞానూ కూడ నీ దగ్గరకు వచ్చివుంటారు. నువ్వూ, నీవాళ్ళమధ్యలో సుఖంగా వున్నావనుకుంటాను. నాకు ఇంత పెద్ద బొంబాయిలో కూడ వూపిరాడటం లేదు. పనీ సనీ వదిలేసి అక్కడకువచ్చి వాలిపోదా మని పిస్తుంది. విసుగ్గావుంది. ఇంకా ఇక్కడ ఇల్లు దొరకలేదు. నేను సుఖంగానే వున్నాను. నా గురించి విచారించవద్దు.

నీ—

ధనపత్ రాయ్—"

రెండో వుత్తరం జూన్ 15 వ తేదీన వచ్చింది. మూడోది 24 జూన్‌న వచ్చింది. జూలై 1-1934,

"ప్రియరాణీ,

నేను కులాసాగా వున్నాను. మీరంతా కులాసా అని ఆశిస్తున్నాను. జూలై 15 కు నేను అక్కడకు వచ్చెయ్యవచ్చును. అమ్మాయి ఇప్పుడే అత్తగారింటికి పంపవద్దు. నేను బొంబాయి తీసుకు రావాలనుకుంటున్నాను. పిల్లల చదువు ప్రయాగలోనే అయితే మంచిదని నా వుద్దేశం. వాళ్ళను ఇక్కడ చేర్పిస్తే నేను కట్టుబడి పోతాను. ఒకచోట కట్టుబడటం నాకు ఇష్టంలేదు. మధ్యలో ఏ కారణంవల్లనైనా మనం బొంబాయి వదలాల్సివస్తే వాళ్ళచదువులు పాడవుతాయి. నువ్వూకూడ పిల్లలతోనే వుండిపోతానని అనవచ్చు. కాని ఈ రోజుల్లో పిల్లలకు కావాల్సింది ముఖ్యంగా డబ్బు! డబ్బు పుష్కలంగా పంపినంతవరకూ మనం లేకపోయినా వాళ్ళు వుత్సాహంగానే వుంటారు. నేనుమాత్రం మీ దగ్గర ఎందుకుండాలని నువ్వు

రాయవచ్చు. నువ్వు నా దగ్గరే వుండాలని నేను ఎందుకు కోరతానో నాకే తెలియదు. నేను నీ వుపాసకుడను. నువ్వు లేకుండా నాకు బ్రతుకే భారంగా తోస్తుంది. నువ్వు వెంటనే అలహాబాద్‌లో పిల్లల పేరు రాయించు.

నీ—

ధనపత్ రాయ్—"

25 జూలై కాశీవచ్చారు. జోరునవర్షం కురుస్తోంది. పూర్తిగా తడిచివచ్చారు. నేను నమస్కారంచేస్తూ అడిగాను "తడిచివచ్చారేం?"

"నువ్వు ఇంట్లోకూర్చొని తడవకపోతే, బయట వాళ్ళుకూడ తడవకుండా పందిళ్ళువేసి వున్నాయను కుంటున్నావా?" అన్నారు నవ్వుతూ.

"సరే! త్వరగా గుడ్డలుమార్చండి, జలుబుచేస్తుది. ఆరోగ్యం ఎలావుంది?" అడిగాను.

"నేను బాగానే వున్నాను. ఇక్కడి విశేషాలు చెప్పు" అన్నారు.

"పిల్లలపేర్లు అలహాబాద్‌లో రాయించాము. అమ్మాయీ, జ్ఞానూ ఇక్కడే వున్నారు. మీరు ఎన్ని రోజులు సెలవు తీసుకున్నారు?"

"నాలుగైదు రోజులు."

"బొంబాయిలో ఎలావుంది?"

"బొంబాయిలో ఎలావుందా? బాగానేవుంది."

"కంపెనీవాళ్ళు మంచివాళ్ళేనా?"

"సినిమా ప్రపంచం చాలా విచిత్రమైనది. అక్కడ వున్న వాళ్లంతా బాబుగార్లే. వాళ్ళవేషాలూ వాళ్ళూ బలేవుంటారులే. నన్నుమాత్రం చాలా గౌరవంగానే చూస్తున్నారు. నా పని స్టూడియోలో, తప్పితే ఇంట్లో. అంత పెద్ద బొంబాయిలో కూడ బయటకు ఎక్కడకు వెళ్ళాలో, ఎంతకాలం గడపాలో నాకు తెలియదు.

'సాయిబుగారి పరుగు మశీదు వరకే' అన్నట్లు నా సంగతి నీకు తెలిసిందేగా! ప్రెస్ వదిలితే ఇల్లేనని. అక్కడ వంటరిగా చాలా కష్ట పడుతున్నాను. మీరంతా వస్తారు కాబట్టి ఇక బాగానే వుండవచ్చు. ఇల్లుకూడా దొరకిందని రాశానుగా!'' అన్నారు ఆయన.

"పిల్లల్ని ఇక్కడ వుంచటం నాకేం ఇష్టంగాలేదు" అన్నాను.

"ఏం చెయ్యను చెప్పు పిల్లలు ఇక్కడుంటే మంచిది, మనకు అక్కడనుండి ఎప్పుడు రావాలని బుద్ధిపుడితే అప్పుడే వచ్చెయ్య వచ్చు."

రెండోరోజు అలహాబాదునుంచి పిల్లలు వచ్చారు. ఆ రెండు రోజులూ ఇల్లు కళకళలాడుతుంది. మూడోరోజు మేమిద్దరం, మా అమ్మాయి, దానికొడుకు 'జ్ఞానూ' బొంబాయి బయలుదేరాము. స్టేషనుకు మా ఇద్దరుకొడుకులు కూడ వచ్చారు.

రైల్లో పిల్లలకు పెడదామని రొట్టెలు తీశానో లేదో గార్డు విజిల్ వినిపించింది. అదంతా ఒక రుమాల్లో చుట్టి 'బన్నూ' చేతి కిస్తూ అన్నాను:

"హాస్టల్‌కు తీసుకెళ్ళండి తినండి నాయనా! రాత్రి పది గంటలకు హాస్టల్లో అన్న మెక్కడ వుంటుంది?"

బన్నూ నా పాదాలకు నమస్కరిస్తూ ఒక్కసారి బావురుమని ఏడ్చాడు. అప్పటికి బన్నూ పదమూడేళ్ళవాడే. మొదటిసారి మమ్మల్ని వదిలి వుంటున్నాడు. అందులో అందరికంటే చిన్నబిడ్డ కావటంవల్ల ఎక్కువ ముద్దుగా పెరిగాడు. నాకు ఏడుపు వచ్చింది. కాని ఆపుకున్నాను. 'బన్నూ' మా ముగ్గురి పాదాలకు నమస్కరించి బండి దిగాడు. ఆయన "ఏడవబాకు. ఇద్దరూ పోట్లాడుకోకుండా వుండండి. ఇద్దరూ కలిసే వుత్తరాలు రాయండి!" అని అన్నారు.

బన్నూ బండి దిగాడు. కాని ఘన్నూ కిటికీని పట్టుకొని నిల్చున్నాడు ప్లాట్‌ఫారంమీద. వాడూ ఏడుస్తున్నాడు.

"బండి కదులుతుంది. ఏడవకు, కిటికీ వదిలేయ్!" అన్నారు.

ధున్నా బయటనుండే సలాంచేసి వెళ్ళిపోయాడు. బండి కదిలింది. ఆయన ఆకలిగాలేదని ఏమీ తినలేదు. 'జ్ఞానూ'ని వళ్లో కూర్చోపెట్టుకున్నారు. వాడికి కాఫీ, పాలూకూడ ఆయనే తాగించే వారు. నా దగ్గరకూ, పిల్లదగ్గరకూ రానని ఏడ్చేవాడు. పిల్లల్ని వదిలొచ్చిన బాధ నా కెంత వుందో ఆయనకూ అంతవుంది. మేము మూడోరోజు వుదయం 'దాదర్' చేరుకున్నాము.

1935 :

ఇద్దరు పిల్లలూ చదువుకోసం ప్రయాగ వెళుతున్నారు. నేనూ ఆయనా, మా కోడికోడలూ, స్టేషనుకు వెళ్లాము. 'బన్నూ' వెళ్ళే ప్పుడు దిగులుగా, మా కందరకూ నమస్కారం చేశాడు. ధున్నా మెల్లగా వెళ్ళి బండిలో కూర్చున్నాడు. వాళ్ళు వెళ్ళిపోయింతరు వాత ఆయన: "ధున్నాకు మంచీ మర్యాదా తెలియదు. ఒకళ్ళను గౌరవించటమూ తెలియదు, ప్రేమించటమూ తెలియదు!"అన్నారు.

"ఏం జరిగింది ?"

"నువ్వు చూడలా ? వెళ్ళేప్పుడు మన ముగ్గురికీ నమస్కార మన్నా చెయ్యలేదు. మనం పరాయివాళ్ళ మన్నట్లు ప్రవర్తిస్తాడు" అన్నారు బాధగా.

"కాలేజీలో చదువుకుంటున్నాడుగా ?"

"చదువులో ఏమీ లేదు. ఇంగ్లీషువాళ్ళు మాత్రం ఇలాంటి సమయంలో ధున్నాలాగ ప్రవర్తిస్తారనా నీ వుద్దేశం? ఒకరు ఇలా వెళ్ళేప్పుడు వాళ్ళు ఎంతప్రేమనూ, బాధనూ, చూపెడతారు ? వాళ్ళు మనమనుకున్నంత హృదయహీనులుకాదు ! కాకపోతే యిలాంటి దుష్టులే వాళ్ళలోకూడ వుండవచ్చును'' అన్నారు.

''పోనివ్వండి. చిన్న పిల్లవాడు!''

''పోనివ్వక నేనేంచెయ్యబోవటంలేదు. తమతమ కర్తవ్యాన్ని మర్చిపోతున్నవాళ్ళను చూస్తుంటే నేను బాధపడతాను. మన ప్రేమను వాడు తిరస్కరించాడని చెప్పక తప్పదు.

"అందువల్ల కలిగిన నష్టం ఏమిటి?"

"ప్రత్యక్షం ఏమీ కలగక పోవచ్చుకాని పరోక్షంగా చాలా నష్టం కలుగుతుంది."

"సరి!"

"ప్రపంచంలో ఎవర్ని అందరూ ప్రేమిస్తారో వాళ్ళకంటే అదృష్టవంతులు ఎవరూ వుండరు. ప్రేమముందు ప్రపంచంలోని అన్ని వస్తువులూ వ్యర్థంగా కన్పిస్తాయి."

"కొద్ది రోజులుపోతే వాడే తెలుసుకుంటాడు."

"తెలుసుకుంటాడులే! నేను చెప్పేది అదికాదు. ప్రేమకు ప్రతిఫలంగా ప్రేమనే ఇవ్వాలి. పిల్లలు పెద్దలకు నమస్కరించినపుడు పెద్దవాళ్ళు ఆశీర్వదిస్తారు. వాళ్ళ ఆశీర్వాద ఫలమే మానవుణ్ణి మానవుడుగా చేస్తుంది" అన్నారు.

"అయితే వీళ్ళంతా జంతువులేనా!" అన్నాను.

"జంతువులు కాదులే! కాని హృదయంలేని మానవుణ్ణి ఒక విధంగా జంతువనే చెప్పాల్సివస్తుంది."

"ఇక పోనివ్వండి."

"పోనివ్వకేం చేస్తాను. ఏదో వూరికే అన్నాను."

ఆ కళాకారుని దృష్టి ఎంత సూక్ష్మమైనదో నాకు అర్థం కావటంలేదు. అన్నివిషయాలు తెలిసిన వ్యక్తినీ, అన్నిటిమీద దృష్టిని వుంచే వ్యక్తిని గురించి ఇదమిద్ధమని చెప్పటం కష్టమే. ఈ విషయాలన్నీ సాధారణంగా కన్పించినా, అందులో తీసుకొనే వాళ్ళకు ఎంతో తత్వం దొరుకుతుంది.

ఇంటికివచ్చిన తరువాత పదకొండుగంటలకు భోజనంచేసి ఆయన స్టూడియోకి వెళ్ళారు. సాయంకాలం నాలుగ్గంటలకు వర్షంలో తడుస్తూ, రెండుమంచాలు కూలీలచేత ఎత్తించుకొని వస్తున్నారు.

"మంచాలకు అంత తొందరేమొచ్చింది? తడిసి వస్తున్నారు!" అన్నాను.

"నీ గొడుగేమయిందని అడగవేం?" అన్నారు నవ్వుతూ.

"నిజంగానే గొడుగే మయింది?'' అన్నాను.

"మంచాలు కొనాలనే తొందరలో గొడుగు ఆఫీసులోనే మర్చిపోయి వచ్చాను."

''అంత తొందరేమొచ్చింది? ఇంత హడావిడి ఎందుకో నాకర్థం కావటం లేదు!"

"హడావిడి ఎందుకా? రెండు నెలలు బొంబాయిలో వంటరిగా గడిపిన వ్యక్తి ఇంటికి భార్యా పిల్లలొస్తే ఎలావుంటుందో నీకేం తెలుసు?"

"ఇందులో అంత సంతోషించాల్సిందేముందో? పైగా బాధ్యత పెరిగింది, అంతేగా?"

"ఇందులో అంత సంతోషమేముం దంటావు! పెళ్ళిళ్ళలో వేలు ఖర్చుపెట్టి అంత హడావిడి ఎందుకు చేస్తారు. అందులో పెళ్ళికొడుకుకు లభించేది ఒక్క భార్యేగా? ఈ రోజు నా ఇంటికి భార్యా వచ్చింది, కూతురువచ్చింది, మనుమడు వచ్చాడు. అలాంటప్పుడు నేనెంత ఆనందించాలి? నాకు దేనికీ ఆనందించే అదృష్టం కూడ లేదా? నాకు లభించిన దాంట్లోనే ఆనందంవుంది. అందని దాని కోసం ఏడవటం నాకు చాతకాదు" అన్నారు.

పదకొండు గంటలకు భోజనం చేస్తున్నారు. జ్ఞానూకూడ ఆయన పక్కనే కూర్చున్నాడు. స్టూడియోనుండి కొంతమంది మిత్రులు తమ భార్యల్ని తీసుకొనివచ్చారు. తిన్నగా వంటింట్లోకే వచ్చారు. అందరూ ఒక్కసారి పెద్దగా నవ్వారు. "అయితే మీరు పక్కనకూర్చొని అన్నం తినిపిస్తున్నారా? అందుకే పాపం, ఈయన మీరు లేనప్పుడు పొట్టనిండా తిండికూడ తినలేదు" అన్నారు.

"అదేంకాదు. ఆయనకు పిల్లల్లోవుండటం బాగా అలవాటయింది. పిల్లలు లేకుండా ఆయన వుండలేరు" అన్నాను.

"పిల్లవాడు మీ చిన్నకొడుకా?" వాళ్ళు అడిగారు.

"కాదు నా కూతురు కొడుకు" అని చెప్పారు. వాళ్ళకు అర్థం కాలేదు. ఇంగ్లీషులో 'డాటర్స్ సన్' అని చెప్పారు.

తరువాత చాలాసేపు బాతాఖానీవేసి వాళ్ళు వెళ్ళిపోయారు. నాకు వాళ్ళతో మాట్లాడాలంటే సిగ్గుగావుంది.

"మీరూ మంచివారే! వాళ్ళతో అలా మాట్లాడతారేం? నాకు చచ్చే సిగ్గేసింది!" అన్నాను.

"సిగ్గు దేనికి? వీళ్ళంతా పెద్దపెద్ద బాబులు."

"గృహమంటే ఏమిటో వీళ్ళకేం తెలుసు? నౌకరు వండి వడ్డిస్తాడు, తింటారు. ఇంటి యిల్లాలు స్వయంగా వండి తన చేతులతో వడ్డిస్తే ఎలా వుంటుందో? పాపం! వీళ్ళకేం తెలుస్తుంది? వీళ్ల పను లన్నీ గాలిలో జరిగేవే! ఊహా ప్రపంచంలో ఆనందాన్ని అనుభ విస్తారు. హిందూ సంస్కృతిని పూర్తిగా మర్చిపోతున్నారు" అన్నారు.

"కాని వాళ్లు మిమ్మల్ని పల్లెటూరి గబ్బిలాయి అనుకుం టారు!" అన్నాను.

"వాళ్ళేమనుకున్నా నాకు చింతలేదు. కాని వాళ్ళు రోజు రోజుకూ మానవత్వానికి దూరమవుతున్నారనిమాత్రం చెప్పక తప్పదు. ఇంట్లో అంబలితాగితే కలిగే ఆనందం, హోటళ్ళలో ఎంత మంచి తిండి తింటేమట్టుకు కలుగుతుందా?"

"మీరేమన్నా అనండి! నన్ను వాళ్ళు ఎగతాళి చెయ్యటం నాకు బాగాలేదు. ఇంట్లో విషయాలు గడపదాటడం నాకు ఇష్టం లేదు" అన్నాను.

"మనం పొందే ఆనందాన్ని వీళ్లు స్వప్నంలోకూడ పొందలేరు. ఎవరి పనుల్లో వాళ్ళు మునిగివుంటారు. సాయంత్రం ఎవరి భోజనం వాళ్ళుచేసి నిద్రపోతారు. బోర్డింగ్ హౌస్‌లోలాగ వీళ్ళు జీవితాలు గడుపుతున్నారు. వీళ్ళకు ప్రేమా, వాత్సల్యం అంటూ ఏమీ లేదు. వీళ్ళకు ఆనందాన్నీ, సుఖాన్నీ ఇవ్వగలిగింది ఒక్కడబ్బే" అన్నారు.

దసరా సెలవుల్లో పిల్లలు బొంబాయి వచ్చారు. వస్తూ జబల్‌పూర్ నుండి టెలిగ్రాం యిచ్చారు. "ప్రొద్దున్నే స్టేషన్‌కు వెళ్ళాలి. ధున్నూ, బన్నూ వస్తున్నారు" అని అన్నారు.

"రేపే?" అన్నాను.

"అవును! బండీలోనుంచే టెలిగ్రాం ఇచ్చారు."

ప్రొద్దున్నే ఆయన స్టేషన్‌కు వెళతారని తెలుసు. ఆయన బల్ల మీద డబ్బులుపెట్టి నేను కిందకు వచ్చాను. సుబేదార్ చచ్చిపోయాడు. ఆడవాళ్లూ, మగవాళ్లూ గుంపుగూడారు. ఆయనకూడ అక్కడే నిల్చుండిపోయారు. కళ్ళలో నీరు తిరిగింది. స్టేషన్‌కు ఆలస్యంగా వెళ్ళారు. తిరిగొచ్చి తను వెళ్ళేప్పటికే బండి వచ్చిందనీ, పిల్లలు కన్పించలేదనీ చెప్పారు. బండిలో వుండి టెలిగ్రాం ఇచ్చిన వాళ్లు ఏమయ్యారా అని మాకు భయం కలిగింది. నౌకర్ని పిలిచి స్టూడియోకి వెళ్ళి చూడమని చెప్పారు. వాడికి పిల్లల గుర్తులుకూడ చెప్పాము. స్టూడియోకి వెళితే శ్రీపత్ రాయ్ స్టేషన్‌లో వున్నాడని తెలిసిందట. వాడు స్టేషన్‌కు వెళ్ళి పిల్లల్ని తీసుకొచ్చాడు. వాళ్ళు వచ్చింతరువాతగానీ ఆయన స్నానానికి వెళ్ళలేదు.

నాలుగయిదు రోజులతరవాత మా అల్లుడు వస్తున్నానని టెలిగ్రాం యిచ్చాడు. సాయంకాలం ధున్నూతో అన్నారు: "నువ్వెళ్లు నాయనా స్టేషన్‌కు. బావ వస్తున్నాడు. నాకు మీరు స్టేషన్లో కన్పించలేదు. నువ్వెళ్ళి తీసుకురా!"

- "ఏడికీ బొంబాయి కొత్తే! తోవతప్పిపోతే ఇద్దర్నీ వెతకాల్సి వస్తుంది" అన్నాను నేను.

"ధున్నూ అంత తెలివితక్కువవాడు కాదులే!"

నిజంగానే ధున్నూకు కూడ అతను కన్పించలేదు. ధున్నూ ఒంటరిగా రావటం చూసి "నువ్వూ నేను చేసినపనే చేశా?" అన్నారు. అందరం పైకి వెళ్ళాము, ఎటునుండైనా వస్తుంటే కన్పిస్తాడేమోనని. నిజంగానే అతను కన్పించాడు. ధున్నూ తీసుకురావ

టాసికి కిందకు పరుగెత్తాడు. ఆయన పైనుండే "ఇటు ఇటు! ఇదే ఇల్లు" అంటూ కేకవేశారు.

అతను పైకి వచ్చింతరువాత ఆయన అన్నారు: "మీరు ఎలా వస్తున్నారో నా కర్థంకావటంలేదు. ఆరోజు ధున్నాను, బన్నాను తీసుకురావటానికి వెళ్ళాను. వీళ్ళు నాకు కన్పించలేదు. ఇవ్వాళ నీకోసం వీళ్లొస్తే నువ్వు కన్పించలేదు!"

పిల్లలు బొంబాయిలో మూడురోజులుండి వెళ్ళిపోయారు.

కాంగ్రెసు మీటింగు జరుగుతోంది. మొదటిరోజు నలుగు రమూ వెళ్ళివచ్చాము. అందరం ఒకేచోట కూర్చుని వచ్చేశాము. రెండోరోజు ఆయన లోపలకు వెళ్లి కూర్చున్నారు. నేనూ, పిల్లా, అల్లుడూ ఒకచోట కూర్చున్నాము. గాంధీమహాత్మా వుపన్యాంస ప్రారంభం కాగానే, మగవాళ్ళంతా ముందుకు నెట్టుకొచ్చారు. గలాటా ప్రారంభమైంది. నేను గాబరాగా లేచి నిల్చున్నాను. ఇద్దరు సడికారు మనుష్యులు "మీరు కూర్చోండి, అమ్మా!" అని వాళ్ళు మాకు అడ్డంనిల్చున్నారు. ఎలాగో వాళ్ల దయవల్ల ప్రాణాలు దక్కి బయటపడ్డాము. వాళ్లకు ధన్యవాదాలుకూడా చెప్పలేక పోయాము. గొడవ తగ్గగానే వాళ్లెటు వెళ్లారోకూడ తెలియలేదు. ఈ గలాటాలో మా అల్లుడుకూడ తప్పిపోయాడు. అమ్మాయీ, నేనూ ఇంటికొచ్చేశాము.

ఆయన ఇంటికొచ్చి "మీ ఇద్దరూ ముందే ఎలా వచ్చేశారు?" అని అడిగారు.

జరిగిందంతా చెప్పి, అన్నాను: "ఇంకా నయంకాదూ బతికి బయటపడ్డాము! పైగా పసిబిడ్డ జ్ఞానూకూడ వున్నాడు."

"ఇక్కడి మనుషులు, పశువులో, మనుషులో అర్థం కాదు. నెట్టుకోవటం, తొక్కుకోవటం లేకపోతే వాళ్ళకు బాగావుండదు లాగుంది! విదేశాలలో టిక్కెట్లు ఒకళ్ళ వెనుక ఒకళ్ళు నిల్చొని ఏ గొడవా లేకుండా తీసుకుంటారట" అన్నారు.

"కాలేజీ కుర్రాళ్ళే ఈ గొడవంతా చేసినట్లుంది."

"అవును! చదువుకొనికూడ సభ్యత తెలియదు."

"ఈ పెద్దపెద్ద డిగ్రీలు తీసుకొని లాభం?"

"ఇవి పెద్దపెద్ద డిగ్రీలు కావు. బానిసత్వపు బంధాలు అని చెప్పొచ్చు. ఆఫీసర్లముందు కుక్కల్లాగ పడివుంటారు బయటికొచ్చి తమ ప్రతాపం చూపించబోతారు. మహాత్మాగాంధీ ఉపన్యాసం వింటానికి పిల్లల్నీ, స్త్రీలనీ తొక్కటానికికూడ సందేహించటం లేదు. వీళ్ళ నేమంటావు చెప్పు! మంచివాళ్ళు బొత్తిగా లేకుండా పోలేదు. మీకోసం దెబ్బలు తిన్నవాళ్ళందర్నీ ఏమంటావు? రెండు రకాలవాళ్లూ వున్నారు" అన్నారు.

"మంచివాళ్ళూ, చెడువాళ్ళూ ప్రతికాలంలోనూ వుంటూనే వున్నారు."

"రేపు నాతో రండి."

"ఇంక చస్తే నేను రాను. నిన్న జరిగిన ప్రాయశ్చిత్తం చాలు."

"మరి ఇరవయ్ రూపాయల టిక్కెట్లు వ్యర్థంగాపోవూ?"

"పోతే పోనివ్వండి. ఇరవయ్ రూపాయలతోనే పోతుంది. లేకపోతే ప్రాణాలుకూడ పోయేలాగున్నాయి."

"తన వుపన్యాసం వినటానికి ఇంత గలాటా జరుగుతుందని మహాత్మాజీకి తెలిస్తే, ఏడురోజులు వుపవాసంకూడ చెయ్యొచ్చు!"

"పాపం! ఆయన అంతకంటే ఇం కేంచేస్తారు?"

"ఇలాంటి మహాత్మా ఇంకో దేశంలో జన్మించివుంటే, పువ్వుల్తో పూజించి వుండేవాళ్ళు" అన్నాను నేను.

"అంత జాగృతి వున్న దేశంలో మహాత్మాల అవసరమే వుండదు. ఇలాంటి క్లిష్టపరిస్థితుల్లోనే మహాత్ములు జన్మిస్తుంటారు. రాముడు, కృష్ణుడు, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మద్, వీళ్ళంతాకూడ ఇలాంటి పరిస్థితుల్నే ఎదుర్కొనివుంటారు."

"గాంధీ మహాత్మునకు ఎన్ని కష్టాల్ని ఎదుర్కోవలసి వస్తోంది ?"

"క్రీస్తును శిలువ వేశారు. మహమ్మద్ నీళ్ళు పుట్టక అల్లాడాడు. రాముడూ, కృష్ణుడూకూడ ఎన్నో యుద్ధాలు చేశారు! ఇది గాంధీయుగము. ఈయనకూడ ఎన్నో దుష్టశక్తులను ఎదుర్కోవలసి వుంటుంది" అన్నారు.

"చూస్తూంటే అసంభవంలాగుంది ఇదంతా !"

"సంఘర్షణే జీవితం! సంఘర్షణ లేకుండా జీవితం ఎలా వుంటుంది ?"

"ఈ సంఘర్షణ చూస్తూంటే నా హృదయం కంపిస్తుంది! దూరంనుండే ఈ సంఘర్షణకు ఒక నమస్కారం చేస్తాను!" అన్నాను.

"ఆడవాళ్ళు సంఘర్షణ అంటేనే భయపడతారు. కాని మగవాళ్ళు సంఘర్షణను ఆహ్వానిస్తారు."

"మగవాళ్ళెందుకు ఆహ్వానించరులే!"

"అలా కాక సంఘర్షణకు భయపడే మగవాడిని పిరికివాడని చెప్పాలి" అన్నారు.

"ఈ మాటలన్నీ ఇంగ్లీషువాళ్ళదగ్గర నేర్చుకున్నవి."

"అన్యాయం చేసేవాడిని, ఆ అన్యాయం మనకు కావచ్చు, ఇతరులకు కావచ్చు, బలవంతుడైన మానవు డెవడూ చూస్తూ వూరుకోలేడు."

బొంబాయి వెళ్ళిన రెండుమూడు నెల్లకే తెలిసింది- ఆయన రాసిన కథలో ఎన్నో మార్పులు చేశారనీ, అయినప్పటికీ సెన్సార్ బోర్డుచే అదో నిషేధించబడిందనీ. అది జరిగింతరువాత తను ఏ వుద్దేశంతో ఇక్కడకు వచ్చారో అది పూర్తిగాదని ఆయనకు తెలిసిపోయింది.

నాతో అన్నారు: "ఈ సినిమావాళ్ళు ప్రజలకు బానిసలు. వాళ్ళకు డబ్బు సంపాదనే ముఖ్యం. రచయితకు ప్రాముఖ్యం ఇవ్వరు."

"రచయితలు తమ కథలో మార్పులు చెయ్యటం ఒప్పుకో కూడదు" అన్నాను.

"రచయిత మాట వినే వాడెవడు ?"

"వినకపోతే, నా వుద్దేశం, మంచిరచయిత ఎవరూ ఇలాంటి పనిలో ప్రవేశించకూడదని" అన్నాను.

"నేనుకూడ ఇంకా రెండుమూడు నెలలు చూస్తాను."

"మీరు వాళ్ళతో చెప్పెయ్యండి."

"నిస్సందేహంగా పోయిరమ్మంటారు. అంతేకాని లక్షల రూపాయలు ఖర్చుపెడతారా ?" అన్నారు.

"అందుకే నేను ముందే వద్దని చెప్పాను" అన్నాను.

ఆ రోజుల్లో ఆయన ఆరోగ్యంకూడ చెడిపోయింది. జ్వరం కూడ తరుచుగా వస్తోంది. వెళ్ళిపోదామన్నాను. ఇంకా కొన్ని రోజులు చూద్దామన్నారు.

ఆ రోజుల్లో మా ఇంట్లో ఒక వంటవాడు వుండేవాడు. వాడే అన్ని పనులూ చూసుకొనేవాడు. కాని వంటచేసే సమయానికి ఎట్లో వెళ్ళిపోయేవాడు. నేను ఎన్నోసార్లు మందలించి చూశాను. ఒకరోజు ఆయనతో అన్నాను– "ఈ నౌకరు సమయానికి ఎక్కడకో వెళ్ళిపోతాడు."

"ఎక్కడికైనా పనిమీద వెళ్ళాడేమో!"

"మూడు రోజులనుంచి చూస్తున్నాను. తీరా వంటసమయా నికి మాయమవుతాడు. ఇలా ఎన్నోసార్లు చేశాడు. ఇవ్వాళ వాడ్ని వెళ్ళగొట్టదల్చుకున్నాను" అన్నాను.

"ఈసారికి పోనివ్వు. నేను వాడికి చెబుతాను" అన్నారు.

ఆ రోజుకు ఆ విషయాన్ని అంతటితో పోనిచ్చాను. ఆయన వాడికి చెప్పారుకూడ. పదిహేను రోజులు సరిగానే పనిచేశాడు. మళ్ళీ అదేపని చేశాడు. నేను వాడిని వెళ్ళగొట్టాను. నాలుగైదు

రోజులు మా వాకిలిముందే వున్నాడు. "వాడు ఎక్కడకూ వెళ్ళలేదు. ఇక్కడే వున్నాడు పాపం!" అన్నారు ఆయన నాతో.

"మీ వుద్దేశం?"

"ఏంలేదు. బీదముండాకొడుకు ఆకలితో చచ్చిపోతున్నా డంటున్నా."

"మీ కంత దయగావుంటే ఏదైనా ఇవ్వండి. అంతేగాని వాడిని మళ్ళీ నాగడప తొక్కనివ్వను" అన్నాను.

"ఆమాట నువ్వు ముందే చెప్పావుగా?"

ఒకరోజు జ్వరంవచ్చింది. రెండోరోజు సాయంకాలానికిగాని జ్వరం తగ్గలేదు. హల్వాచేసి, పాలు కాయమన్నారు. పాలు తను తాగి, హల్వా నన్ను తినమన్నారు. నేను తిన్నతరువాత ఏదైనా చదివి వినిపించమన్నారు. నేను పాటలపుస్తకం తీసు కొచ్చాను. అందులో పెళ్ళిళ్ళలో పాడే పాటలు, ముఖ్యంగా ఆడపిల్లను అత్తవారింటికి పంపేప్పుడు పాడే పాటలు పాడాను. ఆయనకు ఏడుపాగిందికాదు. మధ్యలో ఆపమన్నారు. "ఆడపిల్లల జీవితం ఎంత దుఃఖపూరితమైంది? ఎక్కడ పుట్టి ఎక్కడ పెరిగి, ఎక్కడ కెళతారు? ఈ పాటలన్నీ చదువుకోని స్త్రీలు రాసినవే. ఈ రోజుల్లోని కవులు ఒక కవిత్వం రాసి చంకనపెట్టుకొని సాహిత్యయాత్రకు బయలుదేరతారు. ఏదో పొడిచేశాం అను కొంటారు. కాని ఈ పాటలు రచించినవాళ్ళ పేర్లుకూడ ఎవరికీ తెలియవు" అన్నారు.

"ఈ పాటలు మగవాళ్ళే ఎందుకు రాసివుండకూడదూ?"

"లేదు. పురుషుల్లో ఇంత భావుకత్వం వుండదు. స్త్రీ హృద యాన్నీ, బాధనూ స్త్రీలే సరిగా అర్థం చేసుకోగలరు. ఈ పాటలు స్త్రీలు రాసినవే అయివుండాలి. అందువల్లనే వాటిలో హృదయాన్ని కదిలించే శక్తి వుంది."

ఇతరచోట్లలాగనే బొంబాయిలోకూడ ఆయన్ను కలుసు కొనేవాళ్ల సంఖ్య కేమీ తక్కువలేదు. ఉదయం ఐదుగంటలకు

'వాకింగ్'కు వెళ్ళేవారు. ఏడు గంటలకు స్నానంచేసి ఫలహారం చేసే వారు. పని చూసుకుంటానంటూ తన గదిలోకి వెళ్ళేవారు. అక్కడ ఎవరో ఒకరు ప్రత్యక్షం. ఆయన పనిచూసుకోవాల్సిన సమయం బాతాఖానీలో పోయేది. భోజనంచేసి స్టూడియోకు వెళ్లేవారు. రాత్రి రెండూ రెండున్నరకులేచి రాయటం ప్రారంభించేవారు. నేను ఎక్కడ నిద్రలేచి పోట్లాడతానోనని పిల్లిలాగ శబ్దం చెయ్యకుండా రాసుకుంటుండేవారు. రెండుమూడుసార్లు చూశాను. కోపం వచ్చింది. "అసలే ఆరోగ్యం మంచిదికాదు. రాత్రంతా పనిచేస్తా రెందుకు? మిమ్మల్ని మీరు యంత్రం అనుకుంటున్నారులాగుంది" అన్నాను.

"నువ్వు అనవసరంగా కోప్పడుతున్నావు. పగలూ పని చెయ్యక, రాత్రీ చెయ్యకపోతే ఎప్పుడు చెయ్యమంటావో నువ్వే చెప్పు!" అన్నారు.

"మీరు ఎప్పుడూ ఇంతే. ఆరోగ్యం చెడిపోతే అవస్థపడేది నేను."

"పగలువున్న కొంచెం టైమ్ వచ్చేపోయేవాళ్లతో సరి పోతుంది. మరి నన్నేంచెయ్యమంటావు?"

"ఆ వచ్చేపోయేవాళ్ళకు ఒక సమయం పెట్టుకోండి."

"అదెలా సంభవం?"

"ఒక బోర్డుమీద ఫలానా గంటలు కలుసుకొనే సమయం అని రాసి తగిలించండి."

"అంటే నన్నుకూడ గొప్పవాడిని కమ్మంటావు? నీకు గుర్తే వుందనుకుంటా. ఒకసారి నేను మహాత్మాజీ దర్శనంకోసం వెళ్లి నిరాశతో తిరిగొచ్చాను. అప్పుడు నీకూ్కడ ఒకలాగ అనిపించింది. విసుక్కోకూడదని మహాత్ముడిమీదకూడ మనకు విసుగు కలిగింది. ఇక నాలాంటివాళ్లను చూట్టానికి వచ్చినవాళ్ళకు ఆ అవకాశం ఇవ్వక పోతే ఏమనుకుంటారో నువ్వే ఆలోచించు! ఈయన గొప్పవాడయి

పోయాడు అనుకుంటారు. ఏ గొప్పతనం పేరు విని నేను గాబరాపడ తానో, ఆ గొప్పతనాన్ని నా నెత్తినే తెచ్చిపెట్టుకోమంటావా? మనల్ని చూట్టానికి వచ్చేవాళ్లుకూడ మనలాంటి బీదవాళ్లే. వాళ్లను ఎలా చూడకుండా వుండగలను?" అన్నారు గంభీరంగా.

"బీదవాళ్లు, ధనవంతుల సమస్య కాదు ఇక్కడ వచ్చేది, పని ఎలా అవుతుందా? అనే!"

"ఇంతవరకూ జరిగినట్లే జరుగుతుంది. అందులో పెద్ద విచారించాల్సిం దేమీ లేదు."

"ఏమన్నా కానివ్వండి! రాత్రంతా మిమ్మల్ని పనిచెయ్య నివ్వను" అన్నాను.

"చెయ్యనివ్వకపోతే చెయ్యను!"

"రాత్రిళ్లు దొంగలాగ లేచి చేస్తారు."

"నన్ను పిచ్చికుక్క కరచిం దనుకుంటున్నావా ఏం? నా సుఖం నాకు తెలియదూ? రాత్రంతా ఎందుకు పనిచేస్తాను?" అన్నారు.

ఒకరోజు స్టూడియోనుండి వస్తూనే "ఏమండీ రాణీగారూ! మీరుకూడ ఇంగ్లాండు వస్తారా!" అన్నారు. స్టూడియోవాళ్లు ఆయన్ను ఇంగ్లాండు రమ్మన్నారట. 'ఇంగ్లండులో ఒక సంవత్సరంవుండి వచ్చింతరువాత ఇంటిదగ్గరే వుండి కథలు రాసిపంపితే చాలు'అన్నారట. ఇంగ్లాండులో ఐదు సినిమాలకు కథలు రాయాలట.

"మిమ్మల్ని ఇంగ్లాండు పోనివ్వను!" అన్నాను.

"ఇందులో నీకు కలిగే నష్ట మేమిటి?"

"నష్టం వుందో లేదో నాకు తెలియదు. కాని నేనుమాత్రం పోనివ్వను."

"నీకూకూడ ఖర్చులిస్తారట. నువ్వూకూడ రా!"

"నేను రానూ, మీరు పోనక్కరలేదూ" అన్నాను.

"పిల్లలు ఇక్కడ చదువుకొంటూంటారుగా?"

"నేను అందర్నీ వదలి రాను!"

"అయితే నన్ను పోనివ్వు. ఇలాంటి అవకాశం దొరకటం చాలా కష్టం. తరువాత అందరం ఇంటిపట్టున హాయిగా కాలం గడపవచ్చు" అన్నారు.

"అదంతా నాకు తెలియదు" అన్నాను.

"ఇటు రానుకోనివ్వవ్, అటు బయటకూ పోనియ్యవ్. నే నేం చేసేది చెప్పు?"

"ఏం చెయ్యవద్దనే చెబుతున్నాను" అన్నాను.

"కనీసం కూలిపనయినా చేసుకోనియ్!"

ఒకప్పుడు ఒక సంవత్సరంపాటు దూరం పంపటానికి ఇష్టపడ లేదు. ఇప్పుడో? ఎన్నాళ్ళు ఆయనకు దూరంగా ఒంటరిగా జీవితం గడపాలో? ఇంత త్వరలోనే నన్ను శాశ్వతంగా వదిలిపోతా రను కొన్నానా? ఆ విషయం తెలిస్తే నాకంటె ఆయనే ఎక్కువ బాధ పడి వుండరా?

మ ద్రా సు :

మద్రాసు 'హిందీ ప్రచారసభ' వారు ఆయన్ను ఆహ్వా నించారు. నన్నుకూడ రమ్మన్నారు. నాకూడా మద్రాసు చూడా లనే అభిలాష చాలారోజులనుండి వుంది.

డిశంబరు 1934 లో మేము మొత్తం నలుగురం మద్రాసు బయలుదేరాము. మే మిద్దరం, నాథూరామ్ 'ప్రేమీ', ఇంకొక మద్రాసీఆయనా బయలుదేరాం. నాకు బండిలో తల నొప్పిగా వుండి నిద్రపోయాను. మద్రాసు స్టేషన్‌కు ఉదయం ఆరుగంటలకు బండి చేరింది. ఆయన, నన్ను లేపారు. స్టేషన్‌కు స్త్రీ, పురుషులు దాదాపు మూడువందలమంది పూలమాలలతో మమ్మల్ని ఆహ్వా నించటానికి వచ్చారు. ఇలాంటి స్వాగతం యింతకు ముం దెప్పుడూ జరగలేదు. మేము ముగ్గురమూ ఒక మార్వాడీ యింట్లో బస చేశాము.

రాత్రి పదకొండుగంటలకు కొంచెం తీరిక చిక్కగానే ఆయన నాతో అన్నారు: "దక్షిణదేశంలో హిందీ ప్రచారం ఎంత ఎక్కువగా వుందో చూశావా? ఇదంతా మహాత్మాజీయొక్క కృషిఫలితమే. ఆయన చేతుల్లోకి తీసుకున్న ఏపని వృథాపోయింది! మనకు స్వాగత మివ్వటానికి ఎంతమంది వచ్చారో చూశావుగా? హిందీ యొక్క భవిష్యత్తు యెంత వుజ్జ్వలమైనదో తెలుస్తుంది! ఇక్కడ నుండికూడ ఒకసారి హిందీ ప్రచారదళం మన ప్రాంతాలకు వచ్చింది. ఈ రోజు చూశావా మనకు ఎంతమంది స్త్రీలు స్వాగతమిచ్చారో! కాని వీళ్లకు స్వాగతం ఇవ్వటానికి మన స్త్రీలలో ఒక్కరైనా వెళ్లారో లేదో సందేహమే!''

"వీళ్లలో వున్న పెద్దమనిషితనం, సభ్యత, సుహృద్భావంలో శతాంశంకూడ మనలో కన్పించదు. అంతవర కెందుకు; వీళ్ల దళం బనారస్ వచ్చినప్పుడు, నేను అక్కడేవుండికూడ వీళ్లకు స్వాగతం ఇవ్వలేదు. అప్పటికే నా రెండుమూడు కథలు, తెలుగూ, తమిళ భాషల్లోకి అనువదించబడ్డాయికూడ" అన్నారు.

"మన ప్రాంతమే అంత!'' అన్నారు ఆయన.

"అందరి విషయం అలావుంచి, తెలిసి తప్పుచేసేవాళ్లనే అనాలి. బొంబాయినుండి బయలుదేరేప్పుడు కొత్తప్రాంతాలకు, నా అనేవాళ్ళు లేనిచోటుకు వెళుతున్నాననిపించింది. ఇక్కడ కొచ్చిం తరువాత నా అక్కచెల్లెళ్ల మధ్య కొచ్చినట్లే అనిపించింది.''

"అదే వీళ్లలోవున్న విశేషం!'' అన్నారు.

"ఈ స్త్రీలంతా నాకంటే ఎంతో విశాల హృదయం గలవారు!" అన్నాను.

రెండోరోజు మీటింగు జరిగింది. అన్యమతాలవాళ్ళు మా 'పొజిషన్' ఇక్కడ ఏమీ బాగాలేదని చెప్పుకొన్నారు.

"చదువుకున్నవాళ్ళ సంఖ్య పెరిగినప్పుడే 'పొజిషన్' కూడ పెరుగుతుంది. మన ప్రాంతంనుండి వచ్చినవాళ్ళు ఇక్కడ ఎక్కువ

మంది లేరు. ఈప్రాంతాలనుండి అన్యప్రాంతాలకు వెళ్ళేవాళ్లు 'మైగ్రేషన్' ఏర్పరచుకుంటారు. మన ప్రాంతాల్లోని ఇంగ్లీషు పత్రికల్లో పనిచేసేవాళ్ళు ఎక్కువమంది మద్రాసు ప్రాంతంవాళ్లే. కొన్ని కాలేజీల ప్రిన్సిపాల్సు కూడ వీళ్లే. దాని కారణం వీళ్ళు ఇంగ్లీషులో ఆర్జించిన జ్ఞానమే. ఇంగ్లీషులాంటి భాషను క్షుణ్ణంగా నేర్చుకోగల మద్రాసీయులకు హిందీ నేర్చుకోవటం ఒక లెక్కలోది కాదు" అని ఆయన వాళ్ళకు జవాబు చెప్పారు.

ఆరురోజులు మద్రాసులో ఆరునిముషాల్లా గడిచిపోయినయ్. ప్రజలు ఆయనయెడల చూపించే ఆదరణనూ, ప్రేమనూ చూచి నేను వుప్పొంగిపోయాను. ఇలాంటి మహాపురుషుడు నాకు భర్తగా లభించాడుగదా అని గర్వించాను. అక్కడీనుండి ఒక మహాశయుడు మమ్మల్ని మైసూరుకు తీసుకెళ్ళారు. అక్కడినుండి బెంగుళూరు వెళ్ళాము. ప్రతిచోట మమ్మల్ని హృదయపూర్వకంగా ఆదరించారు. ఆయన రామేశ్వరం వెళదామన్నారు. కాని నేను బొంబాయి వెళ్ళిపోదామన్నాను. పిల్లలు ఏమయ్యారోననే ఆదుర్దా ఎక్కువయింది నాకు.

మద్రాసు, మైసూరు, బెంగుళూరులలో ఐదారేసి రోజులున్నాము. అప్పటికీ అక్కడివాళ్ళు వున్నట్లు లేదన్నారు. మళ్ళీ త్వరలోనే ఈ ప్రాంతాలకు వస్తామని అందరికీ మాట ఇచ్చాము. ఆరాత్రి ఆయన నాతో "చూడు ఇది ఎంత అందమైన ప్రాంతమో! వీళ్ళ హృదయాలుకూడా, అంత అందమైనవే. ఎంతోకాలంనుంచీ పరిచయంవున్నవాళ్ళలాగా ప్రవర్తిస్తారు. ఎంత ప్రేమ! ఎంత ఆదరణ? ఈసారి పిల్లల్నికూడ తీసుకొద్దాము" అన్నారు ఆయన.

బెంగుళూరునుండి పూనా వెళ్ళాము. అక్కడ రెండు రోజులుండి బొంబాయి వెళ్లాము. ఇంటికి వెళ్ళగానే ఆయన స్టూడియోకు ప్రయాణమవటం చూసి అన్నాను- "స్నానం అదీ చేసి వెళ్ళండి. అంత తొందరేం!"

"పిల్లలదగ్గరనుండి వుత్తరాలు వచ్చినయ్యేమో చూసి వస్తాను. అందుకేగా నువ్వు రామేశ్వరంకూడ వెళ్ళొద్దన్నావు" అంటూ వెళ్ళిపోయారు.

కొంచెంసేపట్లోనే తిరిగొచ్చి అన్నారు: "అల్లుడు టెలిగ్రాం ఇచ్చాడు. అమ్మాయి ప్రసవించిందట. పిల్లా, తల్లీ క్షేమంగా వున్నారట."

ఆ తరువాత మేము బొంబాయినుండి బయలుదేరాము. ముందురోజు నన్ను బజారుకు తీసుకెళ్ళారు. "అమ్మాయికి ముక్కుకు రవ్వలపుడక తీసుకోవాలి" అని అన్నారు.

ఆ ముక్కుపుడక వెనక ఒక కథవుంది. రక్షాబంధనంనాడు మా అమ్మాయి బొంబాయిలోనే వుంది. ఆయన "ఏం అమ్మా! ఏంకావాలి?" అని అడిగారు.

"మీరు ఏం ఇచ్చినాసరే" అంటూ పిల్లవాడికి పాలివ్వటానికి గదిలోనికి వెళ్ళింది.

"అమ్మాయితో ముక్కుపుడక అడగమని చెప్పు. ఇక్కడ రవ్వల ముక్కుపుడకలు చాలా బాగుంటాయి" అన్నారు ఆయన నాతో.

"మీరు ఇవ్వదల్చుకున్నప్పుడు నేను అడగటం ఎందుకు?" అన్నది గదిలోనుండే మా అమ్మాయి.

"నేను ఇవ్వకపోయినా నువ్వు పోట్లాడి ఇప్పించుకోవాలి" అన్నారు.

"పోట్లాడి తీసుకోవటం మంచిదా?" అన్నాను.

"అక్క చెల్లెళ్ళూ, కూతుళ్ళూ తమకు చెందవలసిన లాంఛనాలకోసం పోట్లాడి తీసుకున్నా తప్పులేదు. నాకు అలాంటి పోట్లాటలంటే చాలా ఇష్టం" అన్నారు.

"ఇదంతా మీరు స్త్రీల పాటలనుండి నేర్చుకున్నారు లాగుంది."

"ఆ పాటలు ఎంత చక్కగా వుంటాయి? ఇంగ్లీషువాళ్ళ ప్రభావం అంతా పాడుచేస్తుంది. మనలో భావుకత్వం నశించి పోతుంది అన్నారు.

ఇదే ముక్కుపుడక కథ.

బొంబాయినుండి ఖండ్వా వచ్చాము. మాఖన్‌లాల్ చతుర్వేదీగారు మమ్మల్ని రమ్మని వుత్తరాలు రాశారు. పండిత్‌జీ తల్లి నన్ను ఎంతో ప్రేమగా చూసింది.

రెండోరోజు పండిత్‌జీ మమ్మల్ని ఒక అడివికి తీసుకెళ్ళారు. అక్కడ పండిత్‌జీ మా యిద్దర్నీ ఒకదుగ్గమీద కూర్చోబెట్టి ఫొటోలు తీస్తానన్నారు. మా ఇద్దరకూ కమలాపళ్ళు చేతికిచ్చి "ఒల్చితినండి. అలాంటి సమయంలోనే ఫొటో తీస్తాము" అన్నారు. "నాకు కమలా వద్దు, నేను తినను" అన్నాను.

"ఆ బుట్టంతా ఈమెదగ్గర పెట్టండి. అప్పుడు ఆమె పళ్ళు అమ్ముతున్నట్లూ, మనం కొనుక్కొని తింటున్నట్లూ వుంటుంది" అన్నారు ఆయన.

నాకు కోపం వచ్చింది. అలాగయితే నేను దిగిపోతాను. నాకు ఫొటోయే వద్దన్నాను.

ఇద్దరూ నవ్వుతుంటే నాకు సిగ్గేసింది. ఎలాగయితేనేం ఫొటో తీశారు. అందరం కమలాలు తిన్నాము. ఆయన బిళ్ళంగోడు ఆడుకో సాగారు. పండిత్‌జీ ఫొటోతీస్తానన్నారు. "ఈ ముసలితనంలో ఈయనకు బిళ్ళంగోడు ఏమిటి?" అని ఎగతాళి చేస్తారు వద్దు అన్నారు ఆయన.

"ఏం? నన్ను పళ్ళబుట్టముందైతే ఫొటోతీయవచ్చు. మిమ్మల్ని బిళ్ళంగోడు ఆడుతుంటే తియ్యకూడదేం? మీరు చిన్నప్పుడు బిళ్ళం గోడు చాలా బాగా ఆడేవారటగా?" అన్నాను.

అందరం కార్లో ఇంటికి బయలుదేరాం. ఆయన పండిత్‌జీతో బిళ్ళంగోడునుగురించి మాట్లాడుతున్నారు. ప్రజల జీవితాల

ఖరీదు రోజుకు రోజూ పెరిగిపోతోంది. ఉదాహరణకు పిల్లల ఆటల్నే తీసుకోండి. ఈరోజుల్లో స్కూళ్ళలో, కాలేజీలలో ఆడే ఆటలకు ఎంత ఖర్చవుతుంది. మన రోజుల్లో! బిళ్ళంగోడూ, బచ్చాలూ, గోలీలూ, ఎంత బాగా ఆడుకొనేవాళ్ళం? వాటిలో కూడ ఎంత శరీర వ్యాయామం చేయాల్సివచ్చేది!" ఇలాగే మాట్లాడుకుంటూ యింటికి చేరుకున్నాము. నాలుగయిదురోజులు ఖండ్వాలో వుండి, అక్కడనుంచి 'సాగర్' మా అమ్మాయిగారింటికి వచ్చాము.

అక్కడకూడ ఐదురోజులున్నాము. ఆయన గౌరవార్థం సభలు జరిగాయి. ఒకరోజు మీటింగుకు వెళ్తూ, నన్నూ, మా అమ్మాయినీ రమ్మన్నారు.

నేను మా అమ్మాయితో "నువ్వుకూడ రామ్మా వెళదాం" అన్నాను.

"ఇక్కడ ఘోషా ఎక్కువ, అమ్మా! ఎలా వచ్చేది?" అంది.

"అమ్మాయి రాదట. నేనూ రాను" అన్నాను.

"అమ్మాయి రాకపోతే నీకేం? నువ్వు పద!" అన్నారు.

"ఇక్కడ ఆడవాళ్ళకు ఘోషా ఎక్కువట."

"వీళ్ళకు ఘోషా అయితే నీకేం ఘోషా?" అన్నారు.

"ఎవరూ వెళ్ళకపోతే నేనుమాత్రం ఎలా వచ్చేది? మీకు సిగ్గులేకపోయినా నాకు సిగ్గే బాబూ!" అన్నాను.

ఐదోరోజు మేము బయలుదేరుతుంటే మా అమ్మాయి ఏడ్చింది. ఏడవ వద్దని ఓదార్చి త్వరలోనే 'ధున్నా'ను పంపిస్తానని చెప్పివచ్చారు.

అలహాబాదు స్టేషనుకు ఒక తెలిసిన పెద్దమనిషి మాకోసం కారు తీసుకొనివచ్చారు. ఆయన తిన్నగా బోర్డింగ్‌హౌసుకు వెళ్లి పిల్లల్ని తీసుకెళదామన్నారు. పిల్లల్ని చూడకుండా ఇక వుండటం ఆయనవల్ల కాదనిపించింది, ఆయన ముఖం చూస్తుంటే. అందరం ఇల్లు చేరుకున్నాము.

ఒకరోజు రాత్రి మా ఇంట్లో దొంగలుపడ్డారు. వెయ్యిరూపాయల రొఖ్ఖం, పదిహేనువందల రూపాయలు విలువచేసే నగలూ పోయాయి. దొంగతనం ఒక వంటబ్రాహ్మణుడు చేశాడని తెలిసింది. కాని దొంగ పట్టుబడలేదు.

"నీకు నగలు పెట్టుకోవటం చాతకాదుగా, పెట్టెలో పెట్టి పూజించే బదులు, పాపం! ఆ దొంగ భార్య అయినా పెట్టుకుంటుంది. కాకపోతే రొఖ్ఖం పోయినందుకు కొంత చింతించాల్సిందే అనుకో. అది ప్రెస్ పనివారికి జీతాలు ఇవ్వటానికి ఇంట్లో పెట్టాను. అంత మాత్రంచేత జీతాలు ఇవ్వటం ఆగిపోదనుకో!" అన్నారు నవ్వుతూ.

"నా వెయ్యిన్నర రూపాయల నగలు పోయాయి. మీాకు ఎగతాళిగా కన్పిస్తోంది" అన్నాను కోపంగా.

"నువ్వు పదిహేనువందలకు ఇంత బాధపడుతున్నావు. మానవ జీవితమే క్షణంలో అంతమవుతుంది. మనం చూస్తూ ఏం చెయ్యలేక చేతులు నలుపుకుంటాము. మన అమ్మాయికి అంత జబ్బుచేసి నయమయినందుకు సంతోషించు. నేను మూాడు నెల్లు కూలి చెయ్యలేదనుకుంటాను" అన్నారు నవ్వుతూ.

నేను నా గదిలోకి వెళ్ళి, మా అమ్మాయికి వుత్తరం రాయటం ప్రారంభించాను. ఇంతలో ఆయన వచ్చి "ఏమిటి రాస్తున్నావు?" అన్నారు.

"అమ్మాయికి వుత్తరం."

"నేను రాస్తాలే! నువ్వు రాయబోకు."

"ఏం?"

"నీ బుర్ర ఈ దొంగతనంతో చెడిపోయింది. అమ్మాయిక్కూడ ఈ విషయం రాస్తావు. జబ్బుపడి లేచినపిల్ల బాధపడుతుంది" అన్నారు.

"అయితే మీారే రాయండి" అంటూ నేను రాసింది చింపే

శాను. ఆయనే రాశారు. జూన్‌లో 'ధున్నూ'నూ, 'బన్నూ'నూ అమ్మాయిని తీసుకురమ్మని పంపిస్తున్నారు.

"తోట కెళ్లి ఒక వంద మామిడిపళ్ళు తీసుకురా!" అని ధున్నూతో చెప్పారు.

మా అమ్మాయికి మామిడిపళ్ళంటే ప్రాణం. "బరువుచేటు ఎందుకు? అక్కయ్యను ఇక్కడకే తీసుకొస్తున్నాంగా?" అన్నాడు ధున్నూ.

"బరువేమిటి? నువ్వేమయినా మోస్తావా? రైల్లో తీసుకెళ్ళే వేగా? అమ్మాయి వస్తే, బావ రావటం లేదుగా!" అన్నారు.

ఉదయం చెప్పారు. కాని సాయంకాలం తనే వెళ్లి వంద మామిడిపళ్ళు కొనుక్కొనివచ్చారు.

1935 :

అప్పుడు మేము కాశీలో వున్నాము. రాత్రంతా ఆయన జ్వరంతో బాధపడ్డారు. ఉదయం నాలుగుగంటలకు జ్వరం తగ్గింది. ఇంకా ముఖం కడుక్కొని పాలన్నా తాగలేదు. 'హంస'కు సంపాదకీయం రాయటానికి కూర్చున్నారు.

"ఏం చేస్తున్నారు?" అడిగాను.

"నిన్ననే రాయాల్సింది. 'హంస'కు సంపాదకీయం రాస్తున్నాను" అన్నారు.

"బలేవారు, నిన్నంతా జ్వరంతో బాధపడి, లేస్తూనే రాయటం ప్రారంభించారు."

"ఐదు నిముషాలు వూరుకో. కంపోజిటర్సు వచ్చారు" అన్నారు.

"ఐదు సెకండ్లుకూడ ఇవ్వను. లేవండి! ఈ పనంతా తరువాత చూసుకోవచ్చు" అన్నాను.

"నేను ఇప్పుడు రాసివ్వకపోతే వాళ్ళు కంపోజ్ ఏంచేస్తారు, చెప్పు?"

"అదంతా నా కనవసరం."

"నీ కనవసరమైనా నా కవసరమేగా? పేపరు కొనేవాళ్ళు ఏమనుకుంటారు? నేను జబ్బుపడ్డాననేది కాదు వాళ్లకు కావాల్సింది, పేపరు!" అన్నారు.

"మీతో తర్కించటానికి కూర్చోలేదు. లేవండి. లేకపోతే చింపేస్తాను, ఆపైన మీ ఇష్టం."

దాంతో ఆయన టిఫిన్ తినటానికి లేచారు.

"నువ్వు నామాట వినవు! ఆ వచ్చినవాళ్లు వ్యర్థంగా పని లేకుండా కూర్చున్నారు" అన్నారు.

"ఇంతలో మీ 'హంస' కక్కే ముత్యాలేమీ వ్యర్థంగా పోవులే" అన్నాను.

"'హంస' ముత్యాలు కక్కదు. ముత్యాలు తింటుంది."

"నిజమే, తింటూనే వుంది. డబ్బు తినేదే కాకుండా, మీ రక్త మాంసాలనుకూడా తింటుంది. ఈ ఎనిమిది సంవత్సరాల్లో 20 వేల రూపాయల పుస్తకాలు అమ్ముడు పోయాయట, కాని ఏం, లాభం, అంతా మీ 'ప్రెస్,' 'హంస', 'జాగరణ'ల పొట్టలకే చాల్లేదు. ఈ బెడదంతా లేకపోతే, కడుపులో చల్ల కదలకుండా ఇంట్లో హాయిగా కూర్చొనేపని" అన్నాను కోపంగా.

"నువ్వు వ్యర్థంగా కోప్పడుతున్నావు" అన్నారు.

"మీ కెన్నిసార్లు చెప్పాను ఈపని నెత్తిన పెట్టుకోవద్దని. నా మాటలు మీ చెవి కెక్కతేగదూ? శరీరాన్నీ, మనస్సునూ, జీవితాన్నీ సైతం బలి చెయ్యాల్సివచ్చే ఇలాంటి పనులెందుకు నెత్తిన కోవటం చెప్పండి?" అన్నాను.

"రాణీ! నువ్వు పొరబడుతున్నావు. నేనేం త్యాగం, తపస్సూ చెయ్యటం లేదు. జీవితాన్ని బలియివ్వటమూ లేదు. ఈ పనిలో నాకు ఆనందం దొరుకుతుంది కాబట్టే చేస్తున్నాను. జూదరి జూదాన్ని ఎందుకు వదల్లేడు? తాగుబోతు తాగుడు నెందుకు విడవలేడు?

నల్లమందుభాయీ నల్లమందుఅలవాటును ఎందుకు తప్పించుకోలేదు. వీళ్ళందరికీ వీటివల్ల లాభం కలుగుతుందంటావా లేక నష్టమా? వీళ్ళంతా ఈ పనుల్లో నాశనమైపోతే త్యాగం చేశారంటావా? అలాగే నాకూ ఇదోరకమైన అలవాటనుకో" అన్నారు.

"అయితే మీకు దీంట్లో మత్తులో కూడిన ఆనందం కలుగుతుందంటారా?" అన్నాను.

"ఇదీ ఓరకమైన మత్తును కలిగించే పనే కాని, ఇది చెడుది మాత్రం కాదు."

"ముందు మీ ఆరోగ్యాన్ని చూసుకోండి. తరువాత ఇతరుల మంచి చెడులనుగురించి ఆలోచించవచ్చు" అన్నాను.

"దీపం పని వెలుగుని ఇవ్వటమే. ఆ వెలుతురువల్ల ఎవరికైనా లాభంకలుగుతుందో, నష్టమే కలుగుతుందో, దీపానికనవసరం. వత్తి వున్నంతవరకూ, నూనె వున్నంతవరకూ వెలగటమే దానికి తెలుసు. అది అయిపోగానే ఆ జ్యోతి కాస్తా ఆరిపోతుంది. ఆరిపోయిన దీపాన్ని నవ్వూ వెతగబోవ్వూ, అదీ నీమంచి చెడ్డల్ని గురించి కనుక్కోవాలనుకోదు" అన్నారు.

ఏ వస్తువులను నేను ఒకప్పుడు విమర్శించేదాన్నో, వాటినే యీరోజు హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. 'హంస'ను యీరోజు ప్రాణప్రదంగా చూసుకుంటున్నాను. 'హంస'ను హిందీ పరిషత్తుకు అప్పగించినతరవాత గాంధీజీ చేతులమీదుగా ఏ పదినెల్లు నడిచిందో అంతే! గవర్నమెంటు వెయ్యిరూపాయలు ధరావతు కట్టమన్నారు. అంతటితో పేపరు ఆగిపోయింది. అప్పుడు ఆయన జబ్బులో వున్నారు. "రాణీ! ఒక వెయ్యిరూపాయలు బ్యాంకీనుండి తెప్పించి 'హంస'కు ధరావతు కట్టించు" అన్నారు.

"మీకు నయం కానివ్వండి అలాగే చేద్దాం!" అన్నాను.

"నాకు నయం కావటానికీ, 'హంస'ను నడపటానికీ సంబంధం ఏమిటి?" అన్నారు.

"మరి దాన్ని చూసుకొనేవాళ్ళు వుండొద్దూ!"

"జైనేంద్ర చూసుకుంటాడు" అన్నారు.

ఇంకో సమయమైతే బహుశా అంతత్వరగా ఒప్పుకొని వుండనేమో కాని, ఆరోజు వెంటనే డబ్బు తెప్పించాను.

ఆయన వెళ్ళిపోయినతరువాత ఎంతోమంది 'హంస'ను ఆపేయమని సలహాలు ఇచ్చారు. వాళ్లకు ఒకే జవాబు ఇచ్చేదాన్ని: "ఆయన వున్నంతవరకూ 'హంస'ను బిడ్డలాగ చూసుకున్నారు అలాంటప్పుడు నేను, తల్లిని ఇంకా బతికేవున్నానుగా! ఎందుకూ పనికిరాని, తండ్రిలేని బిడ్డనే తల్లి ఎక్కువగా ప్రేమిస్తుంది. యోగ్యులైన బిడ్డలను అందరూ ప్రేమిస్తారు. అయోగ్యులనూ, సంపాదించని వాళ్ళనూ, ఎవరు చూస్తారు? ఒక్క తల్లిమాత్రమే అలాంటి బిడ్డను ఎంతో జాగ్రత్తగా చూసుకొంటుంది. ఏమాత్రం బాధ కలిగించినా వాడు పారిపోతాడో, లేక ఏ విషంతిని చస్తాడోనని భయపడుతూ వుంటుంది. ప్రపంచంలో తల్లిహృదయంలోమాత్రమే మంచికీ, చెడుకూ కూడ ఒకేస్థానం లభించగలదు. ఈ 'హంస' మధ్యనూ, నా మధ్యనూవున్న సంబంధంకూడ అలాంటిదే." నామాట విని పలక్కుండా వెళ్లిపోయేవారు ఆ సలహా యివ్వటానికి వచ్చిన పెద్దమనుష్యులు.

1935 నాటిమాట. రాత్రి సమయము. మేమిద్దరమే మాత్రమే ఇంట్లో వున్నాము.

"ఈసారి కౌన్సిల్ ఎలక్షన్‌కు మీరు నిల్చోండి" అన్నాను నేను.

"నేను నిల్చోను. ఇప్పుడే నేను శాంతంగా వున్నాను."

"ఏం పోటీచేస్తే తప్పేముంది? మీరు కాంగ్రెసు తరుఫున నిల్చోండి" అన్నాను నేను.

"నా జీవితధ్యేయము కౌన్సిల్లోకి వెళ్లికూర్చోవటం కాదు!" అన్నారు.

"మీ జీవితధ్యేయం ఏమిటి?" అడిగాను.

"నా జీవితధ్యేయం కౌన్సిల్లో పని చేసేవారిని విమర్శించటం!" అన్నారు నవ్వుతూ.

"ఇంట్లో కూర్చొని ప్రతివాళ్ళనూ విమర్శించే పనిని గుత్తకు తీసుకున్నారా ఏమిటి?" అన్నాను.

"ఒక రచయిత చెయ్యాల్సిన పనే నేనూ చేస్తున్నాను. వీళ్ళంతా కౌన్సిల్లో కూర్చొని ఏం చేస్తున్నారో ప్రజలకు తెలియ వద్దూ?" అన్నారు.

"బహుశా ఆ భయంవల్లనే మీరు కౌన్సిల్‌కు వెళ్ళటానికి ప్రయత్నించడం లేదేమో?" అన్నాను.

"నాయకులంతా సద్గుణాలరాసు లనుకుంటున్నావా? ప్రతి మానవుడిలో అవగుణాలూ, బలహీనతలూ వుంటాయి. ఇతరు లెవరైనా వాటిని ఎత్తిచూపించేవరకూ మానవుడికి తన లోపాలు తెలియవు. కాబట్టి విమర్శకుడు అందరికంటే లాభకరమైన పనినే చేస్తున్నాడని నా ఉద్దేశం. అయితే, ఆ విమర్శకుడు నిష్పక్షపాతంగా పనిచేసినంతవరకే అది సంభవము. మన లోపాలను ఎత్తిచూపించే వారే మన నిజమైన హితులు" అన్నారు.

"సాధారణంగా విమర్శకుల పని ఇతరులమీద బురదనీళ్ళు చల్లటమేగా?" అన్నాను.

"వాళ్ళు నిజమైన విమర్శకులు కారు. రాగద్వేషాలతో కుళ్ళిపోయేవాళ్ళు, ఒకరిమీద ఒకరు బురదను విసురుకుంటారు. విమ ర్శించటం సాధారణ కార్యం కాదు. ఒక వస్తువునుగురించి క్షుణ్ణంగా తెలుసుకోనంతవరకూ, అర్థం చేసుకోలేనంతవరకూ కలం పట్ట కూడదు" ఆయన అన్నారు.

"మిమ్మల్ని మీరు నిజమైన విమర్శకుడిననే భావించుకుంటు న్నారా?" అడిగాను.

"నేను హృదయంలో ద్వేషాన్ని, కుళ్లుతూ పెట్టుకొని విమ ర్శించను. తటస్థంగావుండే విమర్శిస్తాను" అన్నారు.

"ఇతర విమర్శకులుకూడ తమనుగురించి మీలాగే అను కుంటూ వుండవచ్చు. కాని అది మనకు కటువుగా తోస్తుంది" అన్నాను.

"అది నిజమేఅయితే, ఈరోజు ఎవరికీ, ఎవర్నిగురించిన విమర్శా బాధాకరంగా వుండదు."

ఇలాగే ఆరాత్రి ఎంతో పొద్దుపోయేంతవరకూ మాట్లాడు కుంటూనే వున్నాము.

1936 నాటి విషయం :

ఫాల్గుణ మాసం. ఆయన వచ్చి "నేను ఢిల్లీ వెళ్ళాలి" అన్నారు.

"ఏం పనిమీద ?" అడిగాను.

"రేడియోవాళ్లు రేడియోలో కథ చదవటానికి పిల్చారు. నువ్వుకూడ రా !" అన్నారు.

"నే నెందుకు ?"

"ఎందు కేమిటి ? నువ్వు హోలీకి ఒక్కదానివీ వుండాల్సి వస్తుంది."

"అనవసరంగా ఖర్చు ఎందుకని !" అన్నాను.

"నీకు అన్నిటికంటే ఎక్కువ ఖర్చునుగురించిన దిగులు పట్టుకుంటుంది" అన్నారు నవ్వుతూ.

"మరి డబ్బు ఆకాశంనుండి వర్షిస్తుందా ?"

"రేడియోవారు 100 రూపాయలిస్తున్నారు. దాంట్లోనే ఇద్దరి ఖర్చులూ వెళ్ళమారిపోతాయి" అన్నారు.

మేము ఢిల్లీ వెళ్ళిన మూడోరోజే హోలీపండుగ వచ్చింది. జైనేంద్ర ఇంట్లో వున్నాము. ఆయనా, భగవాన్‌దీన్, జైనేంద్ర, అందరం కూర్చుని మాట్లాడుకొంటున్నాము. ఇరవయ్, ముప్ఫయ్-

మంది వచ్చి రంగునీళ్ళతో వీళ్ళను స్నానం చేయించసాగారు. ఆయన మెదలకుండా కూర్చొని రంగునీళ్లు పోయించుకోవటం చూస్తే నాకు నవ్వొచ్చింది. వాళ్ళు వెళ్లిపోయేసే గుడ్డలుమార్చి కూర్చున్నారో లేదో, ఇంకొక గుంపువచ్చి మళ్ళీ రంగులో ముంచి తేల్చారు. "నేను చస్తుంటే నీకు నవ్వులాటగావుంది!" అన్నారు నాతో.

ఇంతలో జైనేంద్ర భార్య వచ్చి 'అమ్మా' మీరు లోపలికి వెళ్ళిపొండి! ఆడవాళ్ళ గుంపు వస్తూంది!" అన్నది.

"ఎందు కంతభయం? సంవత్సరానికి ఒక్కరోజేకదా వస్తుంది ఇలాంటిరోజు!" అన్నారు.

నేను లోపల కెళ్లి తలుపులు బిగించుకొని కూర్చున్నాను.

రెండోరోజు పాతఢిల్లీ చూట్టానికి బయలుదేరాము. పాత ఢిల్లీలో నేను పాదుషా భవనాలు చూశాను. వాటిలో ఇంకా ఆ స్మృతులు తిరుగుతుంటాయి. ఇంతకాలం తరువాతకూడ చెక్కు-చెదరకుండా ఎంతో మనోహరంగా కన్పించే ఆ భవనాలు చూస్తుంటే, నాకు ఎక్కడలేని ఆశ్చర్యం కలుగుతుంది. హిందూ, ముస్లిముల సంస్కృతుల సమన్వయాన్ని చూడవచ్చును ఆ భవనాల్లో.

ఢిల్లీలో ఎనిమిది రోజులున్నాము. ఆ తరువాత మేము ప్రయాగ వెళ్ళాము. మా అన్నగారింటికి వెళ్ళాము. మా వదిన ఆయనతో "హోళీ" ఆడింది. పూర్తిగా రంగులో మునిగిపోయారు. "మీరుకూడ ఆమె ముఖంమీద రంగు పుయ్యండి" అన్నాను.

"ఇంత పొడుగు ముసుగులో ఆ ముఖం ఎక్కడుందో నే నెలా వెతగ్గలను?" అన్నారు నవ్వుతూ.

ఆయన జీవితంలో అదే ఆఖరి హోళీ.

మార్చి, 1936 :

"గోదాన్" అచ్చు అయింది. "మంగళ సూత్రము" ప్లాటు ఆలోచిస్తున్నారు. "గోదాన్" చదవటానికి నా కిచ్చారు. "హోరీ"

చాపుఘట్టం చదువుతుంటే నాకు ఏడుపు ఆగింది కాదు. ఎక్కిళ్ళు కూడ వచ్చాయి. తాంబూలంకోసం ఆయన నా గదిలోకి వచ్చారు. నేను ఏడుస్తుండటం చూసి అన్నారు: "ఎందుకు ఏడుస్తున్నావు?" అని ఆశ్చర్యంగా.

నే నేం చెప్పేది? పక్కనేవున్న "గోదాన్" చూసి సంగతి గ్రహించారు. "పిచ్చిదానిలాగున్నావే? కల్పిత విషయాలకుకూడ ఏడుస్తున్నావు! అదే ఇంకొకరు రాసివుంటే ఇంకెంత ఏడ్చేదానివో!" అన్నారు నవ్వుతూ.

"పాపం. అతన్ని చంపి, ధనియాను విధవనుచేశా రెందుకు?" అన్నాను కొంచెం సిగ్గుపడుతూ.

"ఆ సంగతి వదిలేయ్! నాకు తాంబూలంయిచ్చి ఇలా కూర్చో, నీ కొక మంచి కథకు ప్లాటు చెబుతాను" అన్నారు.

"ఇప్పుడు నాకు వినాలని లేదు. తల నొప్పిగావుంది" అన్నాను.

"సాధారణంగా నేను ఏడవనని బింకాలు కొట్టేదానివే? నిజంకాని విషయాలని తెలిసికూడ ఇంతగా ఎందుకు ఏడుస్తున్నావు?" అన్నారు.

నేను వద్దంటుంటే నా తల పిసకటం మొదలుపెట్టారు. నిద్ర పోయాను. నిద్ర లేచి తరువాత ఆయన చేసినపనికి నాకు సిగ్గువేసింది.

ఆగస్టు, 1936:

ఆయన మంచిజబ్బులో వున్నారు. రక్తపువాంతులు అవుతున్నాయి. ఈ జబ్బు ఆయనకు బొంబాయిలో వుండగానే ప్రారంభమయిందని ఇప్పుడే తెలుసుకున్నాను.

'గోర్కీ' గతించాడని తెలిసింది 'ఆజ్'ఆఫీసులో సంతాపసభ జరుగుతుంది. రాత్రి పొద్దుపోయిన తరవాత ఆయన కూర్చొని ఆ సభకు ఉపన్యాసం రాసుకుంటున్నారు. నాకు నిద్ర మెలుకువవచ్చి చూస్తే కిందకూర్చొని రాసుకొంటున్నారు.

"ఏం చేస్తున్నారు?" అన్నాను.

"ఏమీ లేదు!" అన్నారు.

"ఏమీ లేకపోవటమేమిటి ఏదో రాసుకుంటూ?"

"ఎల్లుండి గోర్కీ మరణానికి సంతాపం తెలియజేయటానికి సభ జరగబోతుంది" అన్నారు.

"అయితే? మీరు అలావుండి రాయకపోతేనేం?"

"రాయకుండా ఎలా?"

"గోర్కీ శోకసభకు మీరు ఉపన్యాసం రాయకపోతే వచ్చే నష్టం? పైగా హిందూదేశస్తుడు కూడా కాడాయె!" అన్నాను విసుగ్గా.

"ఇదే మన సంకుచిత మనస్తత్వం! గోర్కీలాంటి మహా రచయితకు జాతీయత, దేశం, అడ్డం రావు!" అన్నారు.

"ఆ మహారచయిత మన దేశానికి ఏం చేశాడు?"

"నువ్వు పొరపడుతున్నావు రాణీ! రచయితదగ్గర పంచిపెట్టటానికి ఏముంటుంది? అతనిదగ్గర వుండేదల్లా ఒక్క తపస్సే. దాన్నే అందరిముందూ పెడతాడు. కాని తనకోసం ఏమీ మిగుల్చుకోడు. సాధారణ మానవుడు తనకోసమే తపస్సు చేసుకుంటాడు. రచయిత విశ్వమానవ కళ్యాణంకొరకు తపస్సు చేస్తాడు" అన్నారు.

"మన గ్రామంలో వున్నవాళ్ళకు గోర్కీ పేరుకూడ తెలిసి వుండదు" అన్నాను.

"ఈ గ్రామాలవాళ్ళకు తమవాళ్ళే తెలియదు."

"ఎందుకు తెలియదు? తులసీదాసు, సూరదాసు, కబీరుదాసు పేర్లు తెలియనివాళ్ళెవరు?"

"గ్రామాల్లో ఎంతోమందికి వీరి పేర్లుకూడ తెలియవు. దీనికంతా కారణం విద్యలేకపోవటమే. విద్యా, విజ్ఞానం పెరిగినకొద్దీ గోర్కీ పేరుకూడ అందరికీ తెలుస్తుంది."

"ఇక్కడివాళ్ళకు తమ వాళ్ళను గౌరవించటమే తెలియదు! ఆగ్రా కవిసమ్మేళనములో ఏంజరిగింది!"

"అది మన రచయితల, పాఠకుల దౌర్భాగ్యమే. పాఠకుల హృదయాల్లో రచయితలకు స్థానం దొరకనంతవరకూ రచయితల వుపదేశాలవల్ల లాభం లేదు" అన్నారు.

ఇలాగే తెల్లవారుఝాము నాలుగుగంటలవరకు పిచ్చాపాటీ మాట్లాడుకుంటూవున్నాము. ఉదయం ఆయన సభకు వెళ్ళటానికి తయారవుతూ వుండగా చూసి, అన్నాను: "మీరు ఇలావుండి ఎందుకు వెళతారు చెప్పండి?"

"గుఱ్ఱంబండిమీద వెళతాను" అన్నారు.

"మెట్లు దిగటం, ఎక్కటం కష్టంగాదూ?"

"ఏం చెయ్యను? ఎలాగో ఒకలాగ ఎక్కి దిగటం తప్పు తుందా!"

నేను ఆయనవెంట మా పెద్దఅబ్బాయిని పంపించాను. మెట్లు దిగుతూ ఎక్కడ పడిపోతారోనని నా భయం. నేనుకూడ కిందదాకా వెళ్ళాను.

మళ్ళీ ఆయన తిరిగొచ్చేప్పటికి నేను వాకిట్లోనే వున్నాను. మెట్లు ఎక్కుతుంటే ఆయన కాళ్ళు గజగజ వణికాయి. మంచం మీద పడిపోయారు. పక్కన కూర్చుని కాళ్ళు ఒత్తుతున్నాను. కొంచెంసేపటికి సేదతీరింతరువాత "నేను నిల్చోలేకపోయాను. నేను రాసుకెళ్ళిన వ్యాసం ఇంకొకరు చదివారు" అన్నారు.

"నేను చెబితే మీ చెవికెక్కదు!" అన్నాను.

"గోర్కీ చనిపోవటం నాకు చాలా దుఃఖాన్ని కలిగించింది. ఆయన స్థానాన్ని ఆక్రమించుకోగలవారు ఎవరూ లేరు" అన్నారు.

గోర్కీని గురించి ఎప్పుడూ మాట్లాడుతూనే వుండేవారు. గోర్కీ మరణం ఆయన్ని చాలా కుంగదీసింది. ఆతరువాత రెండు నెల్లకే తనూ వెళ్ళిపోతానని పాపం, ఆయన కేం తెలుసు? తన

మరణంవల్ల హిందీసాహిత్యంలో, ముఖ్యంగా నా జీవితంలో ప్రకాశా న్నిచ్చే నక్షత్రమే రాలిపోయిందని ఆయనకేం తెలుసు? గోర్కీ మరణానికి అంత బాధపడ్డ ఆయన మన బాధను చూసి ఎందుకు దుఃఖించరో!

25 జూలై 1936:

ఆయనకు 25 జూలై రాత్రి రక్తపువాంతి అయింది. ఆరోజు నుండే ఆయన ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. ఆరోజే రాత్రి ఒకటిన్నరకు మళ్ళీ వాంతి అయింది. ఆయన తలదగ్గిర కూర్చుని వున్నాను. "నువ్వుపోయి పడుకో? ఎంతసేపు కూర్చుంటావు!" అన్నారు.

"నేను మీగురించి ఆలోచిస్తుంటే, మీరు నాగురించి ఆలోచిస్తున్నారా?" అన్నాను.

"నాకూ నిద్రొస్తుంది. నువ్వు పడుకో!" అన్నారు. నేను ఆ పక్కనే వున్న బల్లమీద మేనువాల్చాను. నేను కన్నుమూశానో లేదో, ఆయన చిన్నగా లేచి పాయఖానాకు వెళ్ళారు. అక్కడ మళ్ళీ వాంతి వచ్చింది. శబ్దం విని పరుగెత్తాను. వెళ్ళి పట్టుకోగానే అయిన వాంతి రక్తంతో, ఇద్దరం తడిసిపోయాము. చిన్నగా తీసుకొచ్చి మంచంమీద పడుకోబెట్టిన కొంతసేపటికి ఆయనకు స్పృహవచ్చింది. అప్పటికే ముగ్గురు పిల్లలూ మేల్కొన్నారు.

ధున్నూను వెళ్ళి డాక్టర్ని పిల్చుకురమ్మన్నాను.

"ఇప్పుడు పిల్లవాడ్ని పంపకు. డాక్టరు భగవంతుడేమీ కాదు. ఉదయం చూసుకోవచ్చు. త్వరగా ఒక కాగితం, కలం, ఇలా ఇవ్వు!" అన్నారు తొందరతొందరగా.

"ఎందుకు?" అన్నాను రుద్ధకంఠంతో.

"కనీసం నీకు వుండటానికి ఒకనీడ అంటూ వుండాలా?" అన్నారు.

"గాబరాపడకండి. మీకు ఏమీ కాదు" అన్నాను వచ్చే ఏడుపును ఆపుకుంటూ, ఆయనకు ధైర్యాన్ని కలిగించే ఉద్దేశంతో.

ఆయన నా ముఖంలోకి కొంచెంసేపు అలాగే చూసి ఒక్క సారిగా ఏడ్చేశారు. నాకు ఏడుపు ఆగిందికాదు. కాని ఎలాగో నిబ్బరించుకున్నాను.

ఉదయం డాక్టరు వచ్చాడు. ఎక్సరే తీయించుకోవటానికి లఖ్నో వెళ్ళమన్నాడు. నేనుకూడా వెంట వస్తానన్నాను. కాని ఆయన ఒప్పుకోలేదు. ధున్నానుమాత్రం తీసుకొని వెళ్లిపోయారు.

అక్కడవున్న ఆ పది పన్నెండురోజులు ఎలా గడిపానో ఆ భగవంతుడికే ఎరుక. కాలుకాలిన పిల్లిలా వుంది నా పని. నేను లఖ్నో వెళ్లటానికి తయారుగావున్న రోజే ఆయన వచ్చేశారు. ఆయన్ను చూడగానే నా కాళ్ళకింద భూమి జరిగినట్లనిపించింది. చిక్కి శల్యమైయున్నారు. ఎలాగో ఆయన్ను పైకి తీసుకెళ్ళాను. నన్ను పట్టుకొని మెట్లెక్కుతూ "ఎలా వున్నావు!" అని అడిగారు.

"నాకేం బాగానే వున్నాను" అన్నానుదుఃఖాన్ని దిగ మింగుకుంటూ.

మంచంమీద పడుకోబెట్టాను. కొంచెంసేపు మౌనంగా కళ్ళుమూసుకొని పడుకున్నారు. చిన్నగా కళ్ళుతెరిచి అన్నారు: "ఇక నేను బతకను." నేను ఏం జవాబు చెప్పను? కళ్లవెంట బొట బొట నీళ్లు కారుతున్నాయి. అది నేను ధైర్యంగా వున్నట్లు నటించ వలసిన సమయమని నాకు తెలుసు! కాని ఎలా?

"డాక్టరు జలోదరం (ఒకరకమైన నీరువ్యాధి) అని చెప్పాడు" అన్నారు.

"డాక్టర్లు అలాగే చెబుతారు డబ్బు గుంజటానికి! మీకు తప్పక నయమవుతుంది. ఏంతింటారో చెప్పండి!" అన్నాను తల్లిలాగ సముదాయిస్తూ.

ఆయనకు నా మాటమీద నమ్మకం కలిగింది. "తిండికూడా ఆపేశాడు డాక్టరు. మూడు రోజుల్నుండి ఏమీ తిన లేదు" అన్నారు.

"మూడు రోజుల్నుంచీ ఏమీ తిన లేదూ?"

"లేదు."

"అందుకే ఇంత బలహీనమయిపోయారు. అసలు ఇన్నింటికీ ఆహారం ఏం తీసుకోమన్నాడు?"

"బార్లీ లేక డబ్బాపాలు తీసుకోమన్నాడు." బార్లీకి నీరు వేడిచేశాను. ముందు తాగటానికి పాలు ఇచ్చాను.

ధున్నా వెళ్ళి ఒక హోమియోపతి డాక్టర్ని తీసుకొచ్చాడు. ఏం జబ్బని అడిగాను.

"నాకు తెలుసు. దాయాల్సిన అవసరం లేదు చెప్పండి" అన్నారు ఆయన.

"మీకు నయమయిపోతుంది. ప్రమాద మేమీ లేదు" అన్నాడు డాక్టరు.

ఆయన యెన్నోసార్లు గ్రామానికి వెళ్ళిపోదామన్నారు. చివరకు నేనూ ఒప్పుకున్నాను. ధున్నా - "గ్రామం దగ్గర్లో లేదు పైగా వర్షాలు. నాన్న స్థితి ఇలావుంది. పైగా అక్కడ ప్రాణం మీదకు వచ్చినా డాక్టరు దొరకడు" అన్నాడు.

చివరి నిముషంవరకూ ఆయనకు తనఊరు వెళ్ళాలనేకోర్కె బాధిస్తూనేవుంది.

ఇల్లు మార్చాము. ఆయన అనారోగ్యం సంగతి విని మా అన్నయ్య వచ్చాడు. సామాను సర్దేప్పుడు పుస్తకాలు ఏమవు తాయోనని ఆయన భయం! తను లేవబోయి, లేవ లేక పడు కున్నారు. నన్ను చూసి పిల్ల లెక్కడని అడిగారు. సామాను సర్దుతున్నారన్నాను. "పుస్తకాలను జాగ్రత్తగా కట్టించవేం?" అన్నారు. నేను వెనక్కు తిరిగ్గానే "ఏమయినా చేసుకోండి. ఇంక నాకెందు కాదిగులు?" అన్నారు.

ఆయన అన్న ఆ మాటలో ఎంత విరక్తి ఇమిడివుందో ఆలోచించండి! ఏ పుస్తకాలకోసం తన శరీరంలోని రక్తపుబొట్లను అమ్ముకొన్నారో, వేటిని తన ప్రాణంతో సమానంగా చూసుకున్నారో, వేటిని సర్దటానికి ఒక్క నిముషంముందు లేవబోయారో, వాటియడలే ఇంతలో ఇంత ఉదాసీనతా? బంకిలో కొత్తింటికి తీసుకొచ్చాను.

1936 ఆగష్టు 25 వ తేదీ

ఆ రాత్రి నేను రెండు గంటలవరకూ మేలుకొని వున్నాను. ఆయన నిద్రపోతున్నారు. నేను తలదగ్గర కూర్చొని వున్నాను. గడియారం ఎదురుగా వుంది. నిముషనిముషానికి నాదృష్టి గడియారం మీదకే వెళ్ళుతుంది. 'ఓ భగవంతుడా! ఏ న్నేం చేస్తావో!" అనుకుంటూ నిముషాలు లెక్కపెడుతున్నాను.

రెండూ రెండుంపావు అయివుంటుంది చిన్నగా కళ్ళు విప్పారు. "వళ్ళు వేడిగావుంది. బహుశా మళ్ళీ రక్తం వాంతికావచ్చు! ఇవ్వాళ తారీఖు 25 కదూ!" అని అడిగారు.

"లేదే? ఇవ్వాళ 24 వ తేదీయేగా!" అన్నాను.

"గడియారం చూడు! రెండున్నర కాలేదుగదా?"అన్నారు.

"మీకు అన్నీ అర్థంలేని అనుమానాలు. ఇప్పుడు రెండే అయింది"అన్నాను. అంతకుముందే నేను గడియారం ఒక అర్ధగంట వెనక్కు తిప్పివుంచాను. "ఎందు కవన్నీ ఆలోచిస్తారు?"అన్నాను.

"అవన్నీ ఏమీ ఆలోచించటంలేదు. రక్తం వాంతి అయేప్పుడు పడేబాధ అనుభవించినవాడికే తెలుస్తుంది. ప్రాణంమాత్రం పోవటంలేదు. కాని, మరణబాధను అనుభవిస్తున్నాను"అన్నారు.

ఆయనకు నేను ఎన్నోవిధాల ధైర్యంచెబుతూ కూర్చున్నాను రాత్రంతా. కాని భయంతో ఒకవైపు నా హృదయం వణికిపోతూనే వుంది. ఇలాగే తెల్లవారింది. ఆయనకు నిజంగా నేను చెప్పిన మాటమీద నమ్మకం కలిగిందా? 25 వ తేదీ అని ఆయనకు తెలి

యదూ? తనకంటే నేను తెలివికలదాన్నని నా మాటను ఒప్పుకొనే వారు కాదు. కేవలం నాకు గౌరవాన్ని ఇవ్వటానికే నేను చెప్పిందంతా నమ్మినట్లు నటించేవారు. ఆయన ఎన్నోసార్లు "నేను నిన్ను గౌరవించినట్లు నీ కొడుకులు గౌరవిస్తారని నాకేం నమ్మకం లేదు" అన్నారు. అందుకే పిల్లల్నిగురించి ఆయనతో ఏ కంప్లెయింట్ చేసేదాన్ని కాదు.

సామాను పాతఇంటినుంచి కొంత వచ్చింది; ఇంకా కొంత రాలేదు. ఇంటి యజమానికీ, ధున్నూకూ పోట్లాట వచ్చింది. సామాను రానివ్వకుండా ఇంటికి తాళం వేయించాడు ఇంటి యజమాని. ధున్నూ కొంతమందిని తీసుకెళ్ళి తాళం పగలగొట్టించబోయాడు. దెబ్బలాటకూడ జరిగింది. ఆ విషయం ఆయనకు తెలిసి, మా అల్లుణ్ణి పంపించారు సామాను తీసుకురావటానికి. "ఇక్కడ నేను చావుబతుకుల్లో వున్నాను. వాడు అక్కడ సైన్యాధిపత్యం వహిస్తున్నాడు" అన్నారు నాతో.

"తప్పు ఇంటివాడిదే!" అన్నాను నేను.

"ఇలాంటప్పుడు శాంతంగా పరిష్కరించుకోవాలి. అసలు పోట్లాట ఎందుకొచ్చింది?"

" ఈ నెల్లో నీరు యెక్కువ ఖర్చయినందుకు డబ్బుకట్టాల్సి వచ్చిందట. ఆ డబ్బు అతను ధున్నూను కట్టమంటాడు. ధున్నూ "నువ్వు కొత్తఇల్లు కట్టించినందువల్లనే అంత నీరు ఖర్చు అయింది. నేనెందుకు కడతాను?" అంటాడు. "ఇదీ పోట్లాట" అన్నాను.

"ఆమాత్రం డబ్బుకే మనం బీదవాళ్ళ మయిపోతామా! నువ్వు ఇవ్వకూడదూ! గూండాలతో గూండాలు కాని పోట్లాడలేరు" అని ఇంటి యజమానిని పిలిపించారు.

"నువ్వు నన్ను ఎందుకు పోట్లాడావు!" అడిగారు ఆయన.

"శ్రీపత్ పోట్లాడాడు. నీళ్ళకు టాక్సు మీరే ఇచ్చుకోవాలి" అన్నాడు అతను.

"మీరంతా ధుమ్నాకంటే పెద్దవాళ్ళయివుండీ వాడితో ఎందుకు పోట్లాడారు! నీళ్ళకు డబ్బు నిజంగా కట్టాల్సింది నువ్వే!" అన్నాను నేను.

"నువ్వూరుకోవమ్మా! నువ్వుకూడ పోట్లాటకు కూర్చున్నావు లాగుంది" అని నన్ను మందలించి, "చెప్పవయ్యా! ఎంత డబ్బు కట్టాలి?" అని అతన్ని అడిగారు.

"పద్ధెనిమిది రూపాయలు" అన్నాడు అతను.

డబ్బు ఇచ్చి అన్నారు – "చిన్న చిన్న వాటికి పోట్లాడ కూడదు. ముందే నా దగ్గరకు వచ్చివుంటే ఏగొడవా వుండివుండ దుగా? తొందర్యం నేర్చుకో. అనవసరంగా నీ గౌరవాన్నీ, ఇతరుల గౌరవాన్నీ నాశనం చెయ్యకు! మానవత్వంమీద నమ్మకం కలిగి వుండు!" అని చెప్పి పంపించారు.

*　　*　　*　　*

జబ్బులోవుండగా ఆయన నా కొక సంఘటన వినిపించారు. ఒకరోజురాత్రి చాలా పొద్దుపోయేంతవరకూ నిద్ర రాలేదు. "పాపం! నేను జబ్బు పడినపడ్డానో, నీ ప్రాణం పోతుంది!" అన్నారు. ఆయన నొసటిమీదవున్న నా చేతిని చేతులోకి తీసుకుంటూ, "ఇలా వచ్చి కూర్చో! ఏదైనా పిచ్చాపాటీ మాట్లాడుకుందాం!" అన్నారు.

"చాలా పొద్దుపోయింది, నిద్రపోండి!" అన్నాను.

"ఎంతోసేపటినుండి నేను చేస్తున్న ప్రయత్నమే అది. కాని నిద్ర రావటంలేదు. నీదగ్గర నేనొక దొంగతనం చేశాను. చెప్తాను విను!" అన్నారు.

"దొంగతనమా?" ఆశ్చర్యంగా అడిగాను.

"ఆ బంగాలీయువకునకు నీకు తెలిసేట్టు ఇచ్చిన డబ్బుకాక, అతని భార్యకు నగలూ, గుడ్డలూకూడ నా పేరుమీద ఇప్పించాను. ఆ అప్పును దొంగతనంగా తీర్చాను" అన్నారు.

"ఎలా తీర్చారు?" అడిగాను.

"నీకు తెలియకుండా కథలు రాసి ఆ అప్పు తీర్చాను."

"అదంతా నాకు తెలిసే పలక్కుండా వున్నాను!"

"నువ్వు నన్ను ఎప్పుడూ అడగలేదేం?"

"అడిగి ప్రయోజనం? దొంగతనంగా చేస్తున్నా ననుకుంటున్న పనిని గురించి ఎలా అడగను? చేసిన తప్పుకు ఫలితం అనుభవించక తప్పుతుందా? అనుకున్నాను" అన్నాను.

"అయితే, ఇంకో దొంగతనాన్ని చెబుతాను విను! నా మొదటి భార్య వుండగానే నాకు ఒక స్త్రీతో సంబంధం యేర్పడింది. నువ్వు వచ్చినతర్వాతకూడ ఆ సంబంధం అలానే వుండిపోయింది" అన్నారు.

"నాకు తెలుసు" అన్నాను.

ఇది విని నాముఖంలోకి చూశారు. ఆయన చూపులు నా ముఖంలోని భావాలను చదవటానికి ప్రయత్నించాయి. ఆయన నా ముఖంలోకి చూస్తూనే వుండటంవల్ల నేను కిందకు చూడసాగాను. ఆయన చాలాసేపటివరకూ నా ముఖంలోకి గంభీరంగా చూస్తూనే వున్నారు. "నువ్వు నాకంటే చాలా గొప్పదానివి" అన్నారు.

నాకు ఆయన ఆ మాటను ఏ ఉద్దేశంతో అన్నదీ అర్థం కాలేదు. "ఇవ్వాళ ఇలాగ ఎందుకు మాట్లాడుతున్నారో అర్థం కావటంలేదు. నేను మీకంటే ఎలా పెద్దదాన్ని కాగలను?"

"నీ హృదయం ఎంత ఉన్నతమైనదో ఈ రోజు గ్రహించ గలిగాను. ఇంతకాలం ఆ విషయం తెలిసికూడ, ఒక్కసారన్నా నన్ను అడగలేదు. కనీసం తెలిసినట్లయినా ప్రవర్తించలేదు" అన్నారు.

ఆయన నోటిని మూస్తూ ఇక మాట్లాడొద్దన్నాను. గతాన్ని గురించి ఎందుకు మాట్లాడుతున్నారోనని భయంకలిగింది.

"ఓ భగవంతుడా, నన్ను ఇంకా కొన్నిరోజులు బతికించు" అని ఆయన తనలో తనే అనుకుంటున్నారు. నేను ఏడుస్తున్నాను.

"ఓ, భగవంతుడా! వింటున్నావా? నువ్వంటూ ఒకడివి వుంటే తప్పక వినితీరాలి! నాకోసం కాదు. ఈ మహాత్యాగికోసం కొంతకాలం నన్ను బతికించు!" అన్నాను. దుఃఖకంఠంతో మళ్ళీ "వచ్చేజన్మలోనన్నా ఈమెనే నా అర్ధాంగినిగా చెయ్యి. కనీసం నా యీ చివరి ప్రార్థనన్నా ఆలకించు" గొణిగారు.

ఆ సమయంలో నాలోని చైతన్యం జడత్వాన్ని ధరించింది. దుఃఖంతో గొంతు పూడుకుపోయింది. ఆపుకోటానికి ఎంత ప్రయత్నిస్తే అంతయెక్కువగా కళ్ళవెంట నీరు వస్తావుంది. నే నేంచెయ్యగలను? కొంతసేపటికి ఆయన లేచి పాయఖానాకు వెళ్ళారు. వెళ్ళివచ్చి వరండాలో నుంచున్నారు. నేను లేచి ముఖంకడుక్కున్నాను. ఆయన గదిలోకివచ్చి పడుకుంటూ అన్నారు - "నేను ఎంతకాలంనుంచో ఈ విషయాలను చెప్పాలనుకుంటున్నాను."

"నాకు వినాలని లేదు" అన్నాను.

"ఇ కొక సమయంలో నేను చెప్పలేకపోయివుందును. కాని ఈరోజు చెప్పకుండా వుండలేకపోయాను. నీగురించి ఆలోచించిన కొద్దీ నాకు ఎక్కువ బాధకలుగుతోంది. ఒక సెకండుకూడ నిన్నువదలి వుండటం నాకు బాధగా వుంటుంది. కొంతకాలం నాలో ఈ మార్పు ఎందుకువచ్చిందో నాకే అర్థంకాదు" అన్నారు.

"నేను మిమ్మల్ని వదిలి ఎక్కడకెళతానూ!" అన్నాను.

ఇదంతా చూస్తుంటే ప్రతి మానవుడూ పరిస్థితులకు లొంగిపోతాడేమో ననిపిస్తుంది. అందరూ పరిస్థితులకు తలవొగ్గాల్సిందే. మానవుడిలో పరిస్థితులను ధిక్కరించగలిగే శక్తివున్నట్లు కన్పించదు. అందువల్ల నే నేం చెయ్యలేకపోతున్నాడు.



కొత్త ఇంట్లోకి వచ్చినప్పటినుండి ఆయనకు కడుపునొప్పి ఎక్కువయింది. నేను మంచంపక్కనే కూర్చొని ఆయన పొట్టకు

వేడినీళ్ళు కాపు వేస్తున్నాను. పక్కనే మా వదిన కూర్చొని నాకు సహాయం చేస్తోంది. ఆమెను చూసి "నువ్వు కాయి!" అన్నారు.

"నేనే కాస్తున్నాను."

"మరి అనవసరంగా మీ వదినను ఎందుకు కష్టపెడుతున్నావు?" అన్నారు. ఆయన స్వరంలోని తీవ్రతను అర్థంచేసుకున్న నేను ఆమెను సైగతో బైటకు పంపివేశాను. ఆమె వెళ్ళింతరువాత తలుపు వేయమన్నారు.

"నా పనంతా నువ్వే చెయ్యాలి. ఇతరులకు ఋణపడటం నాకు ఇష్టంలేదు" అన్నారు.

"ఇందులో ఋణం ఏముంది?" అన్నాను.

"ఒకరిసేవను తీసుకున్నప్పుడు తిరిగి ఋణం చెల్లించ నవసరం లేదూ?" అన్నారు.

"ఇంట్లో వాళ్ళకు అలాంటిపట్టింపులు ఏమీ వుండవు" అన్నాను.

"నీ ఒక్కదానికే ఋణపడటం నాకిష్టం. నువ్వు నాకెంత సేవచేస్తే నాకంత ఆనందం కలుగుతుంది" అన్నారు.

  

చాలా కాలంనాటి సంఘటన ఒకటి గుర్తొస్తోంది. ప్రెస్ కొత్తగా తెచ్చారు చలికాలం, ఆయనకు ఉన్నిగుడ్డలు లేవు నూలు గుడ్డలే - అవీ పాతవి - వేసుకొని ప్రెస్‌కు వెళ్ళటంచూస్తే నాకు బాధగా వుండేది. ఉన్నిగుడ్డలు కట్టించమని రెండుసార్లు నలభై నలభై రూపాయలిచ్చాను. రెండుసార్లూ ఆయన ఆ డబ్బును కూలీలకు గుడ్డలు కట్టించుకోమని ఇచ్చేశారు. అడిగితే "రాణీ! పగలంతా కష్టించి నా ప్రెస్‌లో పనిచేసేవాళ్లకు వంటినిండా గుడ్డలు లేనప్పుడు నేనెలా ఉన్నిగుడ్డలు కట్టుకొని తిరగ్గలను!" అని అన్నారు.

"నేను వాళ్ళందరి బాధ్యతనూ నెత్తిన వేసుకోలేదు" అన్నాను కోపంగా.

"ఆ నీటితో పాటు నా జీవశక్తులన్నీ కూడ పోతున్నాయి" అన్నారు.

ఆయనమాటవిన్న నా కళ్ళవెంట ధారాపాతంగా నీళ్ళు కారాయి. ఎంత ప్రయత్నించినా ఆయననుండి నాకన్నీళ్ళను దాచుకో లేకపోతున్నాను. ధైర్యం కట్టలు తెంచుకుంటే నేనేం చెయ్యను!

రెండోరోజు మళ్లీ ఆయనకు మైకం వచ్చింది. విరోచనం కూడ అయింది. శుభ్రంచేద్దామని ముందుకువస్తున్న నా చెయ్యి పట్టుకుంటూ, మా అన్నయ్య అన్నాడు "ఆయ నింక లేరమ్మా! ఎక్కడ కెళుతున్నావ్?"

ఇన్నిరోజులూ అణుచుకున్న దుఃఖం కట్టలు తెంచుకుంది. ఈ రోజువరకూ ఏడుస్తానే వున్నాను. పాఠకులారా! ఇక రాయటం నా వల్ల కానిపని; ఏడవటానికే జీవించి వున్నాను.

నేను రచయిత్రినీ కాదు; కళాకారిణినీ కాదు. ఈ నా రచన వల్ల పాఠకులకు ఏదైనా లాభం కలిగితే నేను ధన్యురాలను.

సమాప్తం.



ఆయన పకపకా నవ్వుతూ "నా బాధ్యతను నెత్తిన వేసుకున్నావుగా? అందువల్ల నాకు సంబంధించిన బాధ్యత లన్నింటినీ నెత్తిన వేసుకున్నట్లే. మనిద్దరం ఒకే నావలో ప్రయాణం చేస్తున్నాము. కాబట్టి, మన కర్తవ్యాలుకూడ ఒకటిగానే వుంటాయి. నా కర్తవ్యం, నీ కర్తవ్యం విభిన్నంగా వుండటానికి అవకాశంలేదు. నన్ను నేనే నీకు సమర్పించుకున్నాను. అందువల్ల నాదంతా నీదే" అన్నారు.

జీవిత గ్రంథంలో అంతిమపుట :

ఒకరోజు ఆయనకు స్పృహరాగానే అన్నారు.

"శివప్రసాదుగారు కట్టించిన మాతృ మందిరం ప్రారంభోత్సవము జరుగుతుంది. గాంధీజీ వస్తారు. లక్షలకొద్దీ జనం పోగవుతారు."

"మీకు కొంచెం తగ్గితే మీరూ వెళుదురుగాని" అన్నాను.

"రాణీ! నీమాట నిజంకావాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను. కాని, నీ తపస్సుకు ప్రతిఫలం ఈజన్మలో లభించేలాగ కనబడటం లేదు'' అన్నారు.

"మనం ఎప్పుడూ ఎవరికీ ఏ అపకారం చెయ్యలేదు. భగవంతుడు తప్పక మన మొర ఆలకిస్తాడు''

"రాణీ! నన్ను వదిలి ఎక్కడకూ వెళ్ళకు. నువ్వు నాపక్కన వుంటే నాకు ఎంతో ధైర్యంగా వుంటుంది. నువ్వుపెట్టిన మాంసం నాకు ఇంకా అరగలేదు. నాకు అలా ఎందుకుపెడతావు చెప్పు?" అన్నారు.

"డాక్టరు సలహాను పాటించమంటారా లేక మీ సలహానా?"

"డాక్టరు కాదుగా కష్టంకలిగేది? నాకేగా?"

"అందువల్ల మీకు కలిగే నష్టం?"

"రాణీ! నువ్వు చూడలేదుకాని ఎంత నీరు పోతుంది?"

"అది మంచిదేగా? నీరు పోవాలనేగా?"అన్నాను.

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు, విజయవాడ.

194

